అపరాధ పరిశోధన అనుబంధం—7

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఎడారిలో ప్రాణగండం!

రచన: శ్యాంబాబు

## ఫ్యామిలీ డాక్టర్

రచన: సుజనశ్రీ

## తొమ్మిదేళ్ళ క్రితం హంతకుడు?

రచన: మిస్. మధుబాల

## న్యూ మర్ టెస్ట్!

రచన: టెంపోరావ్

"ఖైదీ" సీరియల్—రెండవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—7
జూలై, 1974
వెల: రు. 3-00

ఏడాది చందా 39 రూపాయలు
30-8-74 లోగా 30 రూపాయలు

ఉచిత చందా డిపాజిట్టు 180 రూపాయలు
పోస్ట్ డెలివరీ సభ్యత్వ రుసుము 3 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
మల్లాది వెంకటకృష్ణమూర్తి
వాసవదత్త
కంచర్ల రమణ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
శ్యాంబాబు
మిస్. మధుబాల

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్ — 36959

ముద్రణ:
క్రాంతి ప్రెస్
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# ఎడారిలో ప్రాణగండం!

శ్యాంబాబు

ముగ్గురు కస్టమ్స్ అధికారులు, మరో ఎయిర్‌పోర్ట్ సెక్యూరిటీ ఆఫీసరు ప్రయాణీకుల్ని వారి సామానులనీ క్షుణ్ణంగా తనిఖీ చేస్తున్నారు.

దేశాయ్ తన బ్రీఫ్‌కేస్ తాళం తెరచి టేబిల్ మీద పెట్టాడు. రెండు షర్ట్‌లు, పాంటు, అండర్ వేర్, బనియన్స్, షేవింగ్ కిట్, టూత్ బ్రష్, పేస్ట్, 20 ఉత్తరాలు, టైప్ చేసిన కాగితాలున్న ఫైలు, బ్రీఫ్ కేస్ లైనింగ్‌ను, అడుగుభాగాన్ని జాగ్రత్తగా చూసిన తరువాత మూత వేశారు.

"కెమెరా ప్లీజ్!" —

కెమెరాను ఇచ్చాడు. మినోల్టా ఎ. ఫైవ్. ఖరీదై

కెమెరా.

"ఈజిట్ లోడెడ్" అడిగాడు సెక్యూరిటీ ఆఫీసరు.

"నో. ఎంప్టీ!" అన్నాడు దేశాయ్ నవ్వుతూ.

కెమెరా ఓపెన్ చేసి, లోపల ఓసారి పరీక్షగా చూసి మళ్ళీ మూసేసి బల్లమీద పెట్టారు.

"ప్లీజ్ స్టెప్ ఆన్ దిస్ మిషిన్ ప్లీజ్" అన్నాడో కస్టమ్స్ అధికారి.

దేశాయ్ పరీక్షగా ఆ మిషిన్ వైపు చూశాడు.

బరువు చూసుకొనే యంత్రంలావుంది. అడుగు బేస్‌కు ఎటాచ్ చేసి అటూ ఇటూ రెండు మెటల్ బార్స్ వున్నాయి. ఎలక్ట్రానిక్ చెక్కర్. శరీరంమీద ఏరకమైన లోహమున్నా వెంటనే అలారం మోగిస్తుంది ఆ యంత్రం. పిస్తోళ్ళు, కత్తులు, బంగారం ఎలాంటి లోహాలున్నయినా, ఎంత చిన్న మొత్తంలో వంటిమీద ఉన్నా పసిగడుతుంది.

"ఇదివరకు ఇంత సివియర్ చెక్కింగ్ లేదు" అన్నాడు దేశాయ్ మిషన్ మధ్య నిలబడుతూ.

"అవును. ఇప్పుడు విమానాల హైజాకింగ్ వల్ల కట్టుదిట్టాలు ఎక్కువ చేశారు" చెప్పాడు ఓ అధికారి.

వెంటనే 'బజ్ జ్' మంటూ ఆగకుండా అలారం మ్రోగడం మొదలెట్టింది. సెక్యూరిటీ ఆఫీసరు స్విచ్ ఆఫ్ చేశాడు.

"చేతి గడియారం, ఫౌంటెన్ పెన్, తాళాలగుత్తి, చిల్లర డబ్బులు బయటపెట్టండి" అన్నాడు అర్థంచేసుకొన్నట్లు.

మినూ దేశాయ్ విసుగ్గా అతనివంక చూశాడు.

"సారీ! ఇన్‌స్ట్రక్షన్స్! ప్లీజ్ కోపరేట్ విత్ అజ్!" అన్నాడు అపోలజిటిక్‌గా.

దేశాయ్ చిత్రంగా భుజాలెగరేసి, "ఆల్ రైట్" అన్నాడు గడియారం మొదలయినవి తీసి బల్లమీద పెడుతూ. సెక్యూరిటీ ఆఫీసరు మళ్ళీ స్విచ్ ఆన్ చేశాడు. ఈసారి ఏవిధమైన శబ్దం రాలేదు.

"ఓ. కె. సర్. థాంక్యూ!"

దేశాయ్ సన్నగా నవ్వి తన వస్తువులు తీసుకొని విమానంవైపు నడిచాడు.

ఫోకర్ ఫ్రెండ్ షిప్ విమానం, ఇండియన్ ఎయిర్ లైన్స్ కలర్స్ తోకమీద పెయింట్ చేసుకొని రన్ వే మీద దర్జాగా నిలబడివుంది. 'ఇండియన్ ఆయిల్' వాళ్ళ ట్రక్కు పెట్రోల్ నింపుతోంది.

విమానంవైపు నడుస్తూ తల త్రిప్పి కస్టమ్స్ బారియర్ వైపు మళ్ళీ చూశాడు.

తన మిత్రుడు జైస్వాల్ కూడా తను చేసిన డ్రిల్లే మళ్ళీ చేస్తున్నాడు.

మెట్లెక్కి విమానంలోకి వెళ్ళాడు. పనసపండులాటి ఎయిర్ హోస్టెస్ చిరునవ్వులు చిందిస్తూ స్వాగతం పలికింది. చేతిలో బ్రీఫ్ కేసు 'స్టివర్డ్'కు ఇచ్చి ముందుకు కదిలాడు.

ముందువరసలో కిటికీ ప్రక్కగావున్న సీట్లో కూర్చొన్నాడు.

జైస్వాల్ కూడా అప్పుడే లోపలికివచ్చి చివరి వరుసలో కూర్చొన్నాడు.

వెనక్కి జేరగిలబడి సిగరెట్ వెలిగించాడు దేశాయ్. సీట్ కంపార్ట్మెంట్లోవున్న రాక్ లోనుండి 'లైఫ్' మాగజైన్ తీసి పేజీలు త్రిప్పసాగాడు.

ఏడూ అయిదయింది.

ఎయిర్ హోస్టెస్ ముందువరస దగ్గరకొచ్చి పబ్లిక్

అడ్రస్ సిస్టమ్ ఆన్ చేసింది. చేతిలో స్పీకర్ పట్టుకొని ఒక్కసారి అందరివంకా నవ్వుతూ చూసింది.

"లేడీస్ అండ్ జంటిల్ మెన్! వెల్ కం ఎబ్రాడ్ ది ఇండియన్ ఏర్ లైన్స్ ఫోకర్ ఫ్రెండ్షిప్, వియార్ గోయింగ్ టు టేకాఫ్ ఇన్ ఎ ఫ్యూ మినిట్స్. మీన్ వైల్ ఐవిల్ ఎక్స్ప్లైన్...."

ఎయిర్ హోస్టెస్ కంఠం మధురంగా ఆక్సిజన్ మాస్క్ ను ఎమర్జెన్సీలో ఎలా ఉపయోగించాలో చెప్పుకు పోతోంది.

దేశాయ్ కిదేం క్రొత్తకాదు. సీటుబెల్టు కట్టుకొని, సిగరెట్ ఆర్పేసి బయటకు చూస్తూ కూర్చున్నాడు.

రన్ వే వదిలి విమానం ఆకాశంలోకి ఎగబ్రాకుతోంది. ఇంజన్ చప్పుడులో చిత్రమైన మార్పులువింటూ కూర్చొన్నాడు. విమానం లెవల్ గా ఎగరడం మొదలవగానే సీట్ బెల్ట్ విప్పేసి, సిగరెట్ వెలిగించాడు.

పబ్లిక్ అడ్రెస్ సిస్టమ్ జుంమ్మంటూ మ్రోగింది. మైక్ లో విమానం కెప్టెన్ గొంతు వినిపించింది.

"గుడ్ ఈవెనింగ్ ఫోక్స్! దిసీజ్ యువర్ కెప్టెన్ మాన్ సింగ్ స్పీకింగ్. భూమికి దాదాపు పదైనిమిది వేల అడుగుల ఎత్తులో గంటకు రెండువందల డెభైమైళ్ళ వేగంతో మనం ప్రయాణం చేస్తున్నాము. వాతావరణం దారంట బాగానే వున్నట్లు వెదర్ రిపోర్ట్స్ చెపుతున్నాయి. బహుశా తొమ్మిదింపావు ప్రాంతంలో మనం బొంబే శాంతక్రుజ్ ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్ట్ లో దిగుతాము. ఎంజాయ్ ది ఫ్లయిట్ అండ్ థాంక్యూ!"-

మైక్ లో కెప్టెన్ గొంతు ఆగిపోగానే టైమ్ చూసుకొన్నాడు దేశాయ్. ఏడు ఇరవై అయింది. లేచి నిలబడి 'లేవెటరి' వైపు నడిచాడు.

లోపలకు వెళ్ళగానే తలుపుమూసి బోల్ట్ పెట్టాడు. ప్యాంట్ ఫోల్డ్‌లోనుండి చిన్న పాలిథిన్ కవరు బయటికి తీశాడు. దాంట్లో ఎర్రటి కేప్సిల్స్‌లు మూడు, పచ్చని క్యాప్సిల్ ఒకటి వున్నాయి.

కవరుచింపి నాలుగింటిని అరచేతిలో పెట్టుకొని వాటి వంకే క్షణం చూస్తూ వుండిపోయాడు.

ఎర్రని కాప్సిల్స్ పేరు డ్లితోక్లోరోసెక్లిన్. రీసెన్ట్ ఇన్‌వెన్షన్. ఆ కాప్సిల్ లోపలి పౌడర్ కలిసిన గాలి పీల్చిన మనుషులు క్షణాలమీద స్పృహకోల్పోతారు. రైల్వే కంపార్ట్‌మెంట్ అంత ఏరియాను కలుషితం చెయ్యడానికి ఒక్క కాప్సిల్ చాలు.

పచ్చ కాప్సిల్ దానికి విరుగుడు.

పచ్చ కాప్సిల్ జేబురుమాలు మధ్యలో పెట్టి జాగ్రత్తగా మడత వేశాడు. రెడ్ కాప్సిల్స్‌ను పైజేబులో వేసుకొన్నాడు. మరో జేబులోనుండి నీలి లిట్మస్ పేపరు తీసి గడియారం చైన్ మధ్య ఇరికించాడు.

తిరిగివచ్చి సీట్లో కూర్చొన్నాడు.

ఎయిర్ హోస్టెస్ అందరికీ 'డిన్నర్' సర్వ్ చేస్తోంది. ఆమ్లెట్ అండ్ టోస్ట్, విస్కీ ఆన్ రాక్స్ తెమ్మని చెప్పాడు.

ఈ ఫ్లయిట్‌లో తక్కువ మంది వున్నట్టున్నారు. అంతవరకూ కొంతశ్రమ తగ్గింది అనుకొన్నాడు దేశాయ్. దాదాపు ఇరవై నిముషాల్లో అందరూ డిన్నర్ ముగించారు.

టైమ్ అయిదు నిముషాలక్కువ ఎనిమిది కావస్తోంది. రీడింగ్ లాంప్స్ తప్ప డూమ్‌లైట్స్ వెలగడం లేదు.

దేశాయ్ లేచి నిలబడ్డాడు.

సీటు పైభాగంనుండి అంతా చీకటిగావుంది. ఎవరికీ ముఖం గుర్తుతెలిసే అవకాశం లేదు.

జేబురుమాలు బయటికితీసి పచ్చ కాప్సిల్ దగ్గర గట్టిగా నొక్కి ముక్కు దగ్గర పెట్టుకొని, రెడ్ కాప్సిల్ రెండవ చేతిలో వేళ్ళమధ్య గట్టిగా నలిపాడు. కాప్సిల్స్ పేలిక్ అనగానే ఉఫ్‌మంటూ గాలిలోకి పౌడర్ని ఊదాడు.

పైన తిరుగుతున్న బ్లోయింగ్ ఫేన్‌వల్ల ఆ హాలులో పౌడరు క్షణాలమీద విమానం బాడీ అంతా వ్యాపిస్తుందని తెలుసు.

కర్చీఫ్‌ను ముక్కుకు అడ్డంపెట్టుకొని, వాచ్ చైన్ క్రిందవున్న లిట్మస్ పేపర్‌నే చూస్తున్నాడు. నీలి లిట్మస్ రంగు క్షణాల్లో ఎరుపుగా మారింది.

'గుడ్! వెరీ ఎఫెక్టివ్!' అనుకొన్నాడు ఆనందంగా.

కళ్ళు మండుతున్నాయి. ముఖంలో చికాకు కలిగిస్తోన్న వాసన. రెండు నిముషాలు అలానే జేబురుమాల్లో పౌడరువాసన చూస్తూ గడిపాడు.

జైస్వాల్ నవ్వుతూ ముందుకు నడిచి వచ్చాడు.

"ఎవిరిథింగ్ యీజ్ ఓ. కె! ఎయిర్ హోస్టెస్‌తో సహా అందరూ స్పృహతప్పిపడివున్నారు"–అన్నాడు కళ్ళవెంట కారుతున్న నీరు తుడుచుకొంటూ.

దేశాయ్ తల వూపాడు. "ప్రెటీ గుడ్ స్టఫ్! లెటజ్ మూవ్!"–అన్నాడు పైలట్ కాబిన్ వైపు నడుస్తూ.

కాబిన్ తలుపు తెరిచి జైస్వాల్ లోపలకు అడుగు పెట్టాడు. అతని వెనుకే దేశాయ్ లోపలకు నడిచాడు.

"వాట్ ది హెల్" అంతే! పైలట్ ఒక్కక్షణం తల విదిలించి అలాగే కంట్రోల్ స్టిక్ మీద ముందుకు వరిగాడు. కో పైలట్ అపస్మృతిలో వున్నాడు.

కంట్రోల్ తప్పి విమానం డైవింగ్ పొజిషన్‌లోకి వచ్చింది.

విమానం అటూ ఇటూ ఊగుతూ పోతోంది. పైలట్‌ను పక్కకు కులాగాడు దేశాయ్. సీట్లో కూర్చొని కంట్రోల్ స్టిక్ చేతికి తీసుకొన్నాడు.

## 2

నాకు చటుక్కున మెలకువ వచ్చింది. దేనికి? ఒక్క క్షణం కళ్ళు తెరచి చూశాను.

జూఁయ్ మంటూ ఎక్కడో దూరాన ఇంజన్ చప్పుడు వినిపిస్తోంది.

ఆ శబ్దం దగరవుతోంది. క్షణక్షణానికి దగ్గరవుతున్నట్లు శబ్దం పెరుగుతోంది.

మై గాడ్! ఎయిర్ ప్లేన్! జోధ్‌పూర్ నుండి రావల సిన సప్లయిలు, వారం క్రితం రావలసినవి, ఇసుక తుఫాను కారణంగా రాలేదు.

మంచంమీదినుండి దిగి నైట్ డ్రస్ మీదే చకచకా 'ఓవరాల్' తొడుక్కున్నాను. గ్లోవ్స్ తొడుక్కుని, యాంకిల్ బూట్ తొడుక్కొని, టార్చి తీసుకొని బయటి కారిడార్లోకి నడిచాను.

కారిడార్ చివర ప్రొజక్షన్ దగ్గర నిలబడి ఆకాశం లోకి చూస్తున్నాడు షేర్ ఖాన్.

బలంగా వీచే గాలివెంట ఇసుక కణాలు రాకెట్లలా దూసుకువస్తున్నాయి. జేబులోనుండి 'విండ్ షీటర్' గాగుల్స్ తొడుక్కొని అతనివైపు నడిచాను.

గాగుల్స్, ఓవరాల్ రెండూ లేకుండా ఈ ఎడారి ఇసుకలో జీవించడం కష్టం.

నిశ్శబ్దంగా వెళ్ళి షేర్ ఖాన్ ప్రక్కనే నిలబడ్డాను.

విమానం దగ్గరగా ఎగురుతున్న శబ్దం వినిపిస్తోంది. ఎంత దూరంలో వున్నదీ ఆ ఇసుకలో కనిపించడం లేదు.

ఈ ఇసుక తుఫానులో 'సప్లయిస్' డ్రాప్ చెయ్యడానికి ప్లేన్‌ను ఎలా అనుమతించారో అర్థం కావడం లేదు.

మేఘంలావున్న ఇసుక మధ్యలోంచి ఎర్రగా, పచ్చగా రొటేట్ అవుతోన్న లైట్లు కనిపిస్తున్నాయి. గాలి రొదతోపాటు విమానశబ్దం హెచ్చుగా వినిపిస్తోంది.

"మైగాడ్! హి యీజ్ గోయింగ్ టు లాండ్!" అరిచాను. అవును ఆ రొటేటింగ్ లాండింగ్ లైట్లకు అర్థం అదే.

"అవును! కానీ అది మన సప్లయిస్ విమానం కాదు. ఈ తుఫానులో దారితప్పిన ఏ కమర్షియల్ ఎయిర్ లైనరో అయ్యివుండాలి"—అన్నాడు షేర్‌ఖాన్.

విమానం బేరక్స్ మీదుగా, మా తలమీద ఎగిరి వెళ్ళినట్లు అనిపించింది. క్రమక్రమంగా మళ్ళీ శబ్దం దూరం అవుతోంది.

"క్రాష్‌లాండింగ్ చెయ్యడానికి సరైనచోటు చూస్తున్నట్లుంది... ఈ ఇసుక తుఫానులో పైలట్‌కు ఏం కనిపిస్తుంది?"—నాకు ఓవరాల్ లోపల చేతులకు చెమట పడుతోంది.

ఎటు చూసినా ఇసుకగుట్టలు. సమతలమైన ప్రదేశం అంటూ లేదు. ఆ వేగంలో ఎంత జాగ్రత్తగా దించినా ప్రమాదం తప్పదు. అప్పుడు గుర్తొచ్చింది నా రెస్పాన్సిబిలిటీ. మానవుడిగా నా కర్తవ్యం!

"షేర్‌ఖాన్! వెంటనే డాక్టర్ ఘోష్‌ను లేపు. ఫస్ట్ ఎయిడ్ కిట్‌ను, వీలయినన్ని ఓవరాల్స్‌ను తీసుకురా... చూస్తోంటే దగ్గరలోనే లాండింగ్ చేసేట్లున్నారు"—అరిచాను.

నా గొంతులో ఆత్రుతను షేర్‌ఖాన్ అర్థం చేసుకొన్న వాడిలా "ఓ.హాం. సాబ్"— అని క్వార్టర్స్‌లోకి పరి గెత్తాడు...

విమానం శబ్దం మళ్ళీ దగ్గరయింది.

ఎర్రని పచ్చని రొటేటింగ్ లాండింగ్ దీపాలుస్పష్టంగా కనిపిస్తోన్నాయ్. వాటితోపాటు తెల్లని కాంతి చిమ్మే హెడ్ లైట్స్ వెలిగించాడు పైలట్.

ఆ వెలుతురున్నిబట్టి భూమికి దాదాపు వంద అడుగుల ఎత్తునవుంది విమానం... హెడ్ లైట్ వెలుతురులో ఎగిరే ఇసుక మేఘంలా కనిపిస్తోంది. అలా ఎంతోసేపు ఎగు రుతూ ఉండలేదు. ఈ ఇసుకంతా ఇంజన్‌లోకి దూరి ఈ పాటికి దాటిని పాడు చేసివుండాలి...

లాండింగ్ వీల్స్ ఇంకా బయటకు రాలేదు...చక్రాల మీద విమానాన్ని ఈ ఇసుకలో దింపడం అవివేకం... పైలెట్ చాలా తెలివిగలవాడు, ధైర్యవంతుడు అయి వుండాలి...'బెల్లీ లాండింగ్' చేస్తాడనుకొంటూను.

అవును...ఈ పరిస్థితులలో చక్రాలు లేకుండా విమా నాన్ని దింపడమేమంచిది. ఇసుక కాబట్టి, క్రిందవుండే పెట్రోలుటాంకు పగిలి నిప్పంటుకునే ప్రమాదంలేదు.

ఉన్నట్లుండి విమానం రోడ ఆగిపోయింది.

మేము ముగ్గురం విమానం పడిపోయినవైపు పరు గెత్తాము.

## 3

రాజస్థాన్ ఎడారి! ది గ్రేట్ ఇండియన్ డెసర్ట్ అని పిలుస్తూవుంటారు భూగర్భ శాస్త్రవేత్తలు.

ఆ ఎడారి మధ్యలో జీవాణువుల అభివృద్ధి, పరిశీలన భూగర్భ పరిశోధన జేయడానికి భారత ప్రభుత్వం తర

పున ఓ పదిమంది భూగర్భశాస్త్రజ్ఞులం ఇక్కడ పరిశోధ నలు చేస్తున్నాం.

ఈ ప్రాంతమంతా ఇసుక ఎడారి. ఏరకమైన కాలి బాటలుగాని, ఆకాశ మార్గాలుగాని ఈ ప్రాంతానికి దగ్గరలో లేవు.

ప్రతి బుధవారం జోధ్‌పూర్ మిలటరీ ఎయిరోడ్రోమ్ నుండి ఒక విమానంవచ్చి మాకు ఓ వారానికి సరిపడే ఆహార పదార్థాలు పారాషూట్లద్వారా పడేసి వెళ్ళిపోతుం టుంది.

ఎండా కాలంలో విపరీతమైన వేడి, శీతాకాలంలో అతిచల్లదనం ఈ ప్రాంతపు శీతోష్ణస్థితి లక్షణాలు.

వేసవి మొదలయేముందు బ్రహ్మాండమైన గాలితో ఇసుకతుఫానులు రావడం మామూలే.

ఏప్రిల్ నెల మామూలుగా ఈ ప్రదేశంగుండా ఏ రక మైన విమానాలు ప్రయాణం చెయ్యవు.

విమానం కూలినవైపు ఓ పదిగజాలు పరిగెత్తి చటు క్కున ఆగిపోయాను. "స్టాప్ ది రన్"—అరిచాను మెదడులో చటుక్కున ఏదో గుర్తొచ్చి.

షేర్‌ఖాన్, డాక్టర్ ఘోష్, నావెనకే ఆగిపోయారు.

నేను వెనక్కి తిరిగి బారెక్స్‌లోకి పరిగెత్తాను. స్టోర్ రూమ్‌లోనుండి నాలుగు నైలాన్ తాడు చుట్టలుతీసుకొని బయటికి వచ్చాను.

ఒక తాడు కొసను బారెక్స్ వరెండా స్తంభానికి బిగించాను. మిగిలినది చేత్తోపట్టుకుని మళ్ళీ వాళ్ళిద్దరి దగ్గ రకు చేరుకొన్నాను.

ఈ ఎడారి ఇసుకలో ఒకసారి దారితప్పితే 'కంపాస్' సహాయం లేకుండా రాత్రిళ్ళు దారి కనుక్కోవడం దుర్లభం. విమానం వెతికే ప్రయత్నంలో దారితప్పితే, ఆ

ఇసుక గుట్టల్లో మేము కప్పడిపోవడం ఖాయం.

అంచేతే మౌంటినీరింగ్ చేసే వాళ్ళలా తాడు సహాయంతో ముందుకు వెళ్ళడానికి నిశ్చయించాను.

నడుస్తోంటే ఇసుకలో అడుగులు కూరుకుపోతున్నాయి.

తాడు ఒక్కొక్క చుట్టూ వదలిపెడుతూ విమానంవైపు గబగబ నడుస్తున్నాము. ఒక తాడు అయిపోగానే దాని చివరకు రెండవ చుట్టను బిగించి మళ్ళీ నడవడం మొదలు పెట్టాను.

ఒక్కొక్క రోప్ కాయిల్ పొడవు వందగజాలు. అంతా బారెక్స్ నుండి దాదాపు వందగజాలు వచ్చామన్న మాట.

షేర్ ఖాన్ నడుస్తూ చేతిలో ఫ్లాష్ లైటు అర్ధచంద్రాకారంలో వెలుగును త్రిప్పుతున్నాడు.

మూడవ కాయిల్ కూడా ముడివేశాము. కొంత దూరం నడవగానే గాలిలో చిత్రమైన శబ్దం మార్పువచ్చింది. విమానం అల్యూమినియం రేకుమీద ఇసుక పడుతోన్న శబ్దం.

ముగ్గురం ఒక్క క్షణం కదలకుండా నిలబడిపోయాం.

ఫ్లాష్ లైట్ వెలుగులో విమానం తోకభాగం కనిపిస్తోంది.

భారత త్రివర్ణ పతాకం, దాని క్రిందే 'ఐ ఏ' అని పెయింట్ చేసిన ఎర్రని అక్షరాలు కనిపిస్తున్నాయి.

విమానం చుట్టూ గాలి అప్పుడే ఇసుకను గుట్టలు, గుట్టలుగా పోస్తోంది.

ఫ్లాష్ లైట్ కాంతిని ప్రక్కకు తిప్పాడు. విమానం కిటికీలు, ఒక రెక్క కనిపిస్తున్నాయి.

కిటికీల అద్దాల లోపలనుండి సన్నని వెలుతురు కని

పిస్తోంది. ఏమాత్రం లోపల కదలిక వున్నట్లు లేదు.

షేర్‌ఖాన్ చకచకా విమానం చుట్టూ ప్రదక్షిణ చేసి వచ్చాడు.

"కాంబిన్‌లో ఎవరో కదులుతున్నట్టుంది సాబ్!"— అన్నాడు తిరిగివస్తూ.

బహుశా విమానంలో పైలట్, క్రూ, తప్ప ఎవరూ లేరేమో. అందుకనే బహుశా లోపల ఏమీ అలికిడి లేదనుకొంటాను.

అంత ప్రమాదకరపరిస్థితుల్లోనూ విమానానికి ప్రమాదం కలక్కుండా బెల్లీలాండింగ్ చేసిన పైలట్ నిపుణత్వాన్ని అభినందించకుండా వుండలేకపోయాను.

ముగ్గురం విమానం ముందువైపుకు నడిచాము.

కాక్‌పిట్‌లో కదలిక లేదు. బలంగా వీచేగాలికి ఇసుక తెరలు తెరలుగా విండ్‌షీల్డ్ అద్దాలమీద పడుతోంది.

షేర్‌ఖాన్ ఫ్లాష్‌లైటు కాంతి అద్దాలమీద పడేట్టు వేశాడు.

కాబిన్ లోపల ఎవరిదో తలమాత్రం కనిపిస్తోంది. బహుశా పైలట్ ఏమో?

లైటు ఆర్పి, మళ్ళీ వెలిగించాడు. అలా నాలుగైదు సార్లు లైటు ఆర్పుతూ వెలిగిస్తూ అద్దాలమీద వెలుతురు ప్రసరించేట్టు వేశాడు. లోపలవున్న వాళ్ళకు అలా చేయడంవలన, బయట మనుషులున్నట్లు తెలుస్తుందని.

లోపల ఏమాత్రం కదలిక లేదు. నేను షేర్‌ఖాన్ వైపు చూశాను. షేర్‌ఖాన్ మళ్ళీ ఓసారి లైటు వెలిగించి, ఆర్పేసి విసుగ్గా తలాడించాడు.

"ఇందాక నేను చూసినప్పుడు కాబిన్‌లో ఎవరో తిరుగుతున్నట్లు ఆ అద్దాల్లోంచి కనిపించింది"—అన్నాడు షేర్‌ఖాన్.

"బహుశా స్ట్రయిక్ వల్ల స్పృహతప్పి పడిపోవడం జరిగుండాలి. తలుపు తెరిచే ప్రయత్నం చెయ్యడం మంచిది" అన్నాను మళ్ళీ విమానం ప్రక్కకు నడుస్తూ.

విమానం ఎంట్రెన్స్ డోర్ విమానంలో ఓ భాగంగా అతుక్కుని బాడీలో కలిసిపోయివుంది. బయటినుండి ఎలా తెరవాలో అర్థంకా లేదు.

షేర్ ఖాన్ ఒక్కసారి డోర్ చుట్టూ చూసి లాభం లేదన్నట్లు తలాడించాడు.

"కిటికీ అద్దాలు పగలగొడితే మంచిదేమో"-అన్నాడు డాక్టర్ ఘోష్.

షేర్ ఖాన్ చేతిలోవున్న 'పిక్ యాక్స్'తో అద్దంమీద బలంగా రెండుసార్లు కొట్టాడు. అవి చెక్కు చెదర కుండా వున్నాయి. కనీసం ఒక్క బీటుకూడా పడ లేదు.

"నో. లాభంలేదు. విమానం ప్రెషర్ ప్రూఫ్. అనేక వేల పౌండ్ల వత్తిడిగల గాలికి తట్టుకోనే శక్తిగలవి ఆ అద్దాలు. మామూలు పరికరాల్తో పగలగొట్టడం కుదరదు" అన్నాడు నిస్పృహగా.

డాక్టర్ ఘోష్ చటుక్కున నా చెయ్యినొక్కాడు "సురేష్ సీక్రెట్!" అన్నాడు ఓ కిటికీవైపు చూపెడుతూ.

కిటికీ ప్రక్క సీట్లోంచి ఎవరో లేచి నిలబడ్డారు. ముఖం సరిగ్గా కనిపించడంలేదు.

షేర్ ఖాన్ 'పిక్కాక్స్'తో కిటికీమీద కొట్టాడు. ఆ వ్యక్తి కిటికీలోంచి బయటకు చూశాడు. బయటచీకటిగా వుండడంవలన అతనికి మేం కనిపించము. అందుకే షేర్ ఖాన్ మీద పడేట్లు టార్చి వేశాను నేను.

అతను కదలిక లేకుండా కిటికీలోనుండి మావంకే చూస్తూ వుండిపోయాడు.

"మాడండి! ఇంకా లోపల చాలామంది వున్నారు"
అరిచాడు డాక్టర్ ఘోష్.

కిటికీలోనుండి లోపల అనేకమంది వున్నట్లు సన్నని నీడలు కనిపిస్తున్నాయి.

"మైగాడ్! విమానం కూలినప్పుడు వత్తిడికి వాళ్ళంతా స్పృహతప్పి పడివుండాలి" అన్నాను.

కిటికీలోనుండి షేర్ ఖాన్ వైపు చూస్తున్న తను తలుపు వైపు సైగ చేశాడు.

లోపలంతా కంగారుగా అటూ ఇటూ తిరుగుతున్నట్లు కిటికీ అద్దాలమీద నీడలు కదులుతున్నాయి. లోపలవున్న వాళ్ళ ఆందోళన, ఆదుర్దా అర్థం చేసుకోగలను. కొద్ది క్షణాల్లో చావబోతున్నామని తెలిసి, మానసికంగా ఆ ఆలోచనకు అలవాటు పడేలోపలే స్పృహపోయి, మేలుకొనేప్పటికి ఇంకా బ్రతికే వున్నట్లు తెలుసుకోవడం, కొన్ని క్షణాలు విచక్షణా జ్ఞానాన్ని, ఆలోచనను పని చెయ్యనివ్వదు.

ముగ్గురం విమానం తలుపు వైపు పరిగెత్తాం.

లోపల గడ తెరిచినా బలంగా వీస్తున్న గాలివలన తలుపు తీయడం చాలా కష్టమైంది. తలుపు తెరవగానే తెల్లని వెలుతురు మామీద పడింది. తలుపు తెరిచిన వ్యక్తి గాలివిసురుకు ఒక్క క్షణం వెనక్కి తూలాడు.

గబగబా విమానంలోకి ఎక్కాశాం.

తెరిచిన తలుపులోనుండి ఇసుక జల్లులు జల్లులుగా వర్షంలా విమానం లోపలికి పడుతోంది. మేం లోపలకు ఎక్కగానే ఒక్క క్షణం అంతా నిశ్శబ్దం మేర్పడింది.

"ఈజీ మైడియర్ ఫ్రెండ్స్! టేకిట్ యీజీ!"– అన్నాను అందరివైపూ చూస్తూ.

డాక్టర్ ఘోష్, షేర్ ఖాన్ నా వెనకే వాళ్లు తెచ్చిన

సామగ్రితో నిలబడ్డారు. ఈ ఎడారి గుస్తుల్లో మమ్మల్ని చూసిన ఏ సామాన్య మానవుడైనా ఒక్క క్షణం అవాక్కవడం సహజం. కళ్ళకు కాపుదలగా పెట్టుకొన్న గాగుల్స్ తీసేసి అందరివైపూ నవ్వుతూ చూశాను.

"హు ద హెల్ ఆర్ యూ?" అన్నాడో ముసలాయన సీట్లమధ్యనుండి లేచి నిలబడుతూ.

"ఇదే ఎయిర్ పోర్ట్? బొంబే వెళ్ళడానికి ఇంకెంత సేపు పడుతుంది?"—ఆతృతగా అడుగుతున్నాడో ముందు సీట్లో మనిషి.

"మై గుడ్ నెస్! వీళ్ళవరో దొంగల్లావున్నారు" అరిచింది ఒకావిడ కీచుగొంతులో.

ఒక్కసారి అందరూ అన్నిరకాలుగా ప్రశ్నించడం, జవాబులు చెప్పడం, మాట్లాడ్డం చేసేస్తున్నారు.

"స్టాపిట్! యూ ఫూల్స్!" అరిచాను ఒక్కసారి కోపంలో.

"మీరెంత ప్రమాదంలో వున్నదీ అర్థంకాలేదనుకొంటాను మీకు. మీరిప్పుడు వున్నది రాజస్థాన్ ఎడారిలో. ఓ ఇరవై నిముషాల క్రితం మీ విమానం ఇక్కడ కూలిపోయింది. మరో అరగంట మీరంతా ఇలాగేవుంటే ఇక్కడి ఇసుకతుఫానులో, ఇసుకగుట్టల్లో సమాధి అవుతారు."

అందరూ ఒక్కసారిగా అదిరిపోయారు. నేచెప్పింది నమ్మలేనట్లు అందరూ నావంక చూస్తూ వుండిపోయారు గుడ్లప్పగించి.

"నో! పైలట్ ఏడి?"—అన్నాను వాళ్ళందరి వంకా చూస్తూ.

"ఎయిర్ హోస్టెస్ కూడా కనిపించడంలేదు"—

అన్నాడు డాక్టర్ ఘోష్.

వాళ్ళందరినీ మా సాయం తీసుకెళ్ళడానికి సిద్ధం చెయ్యమని చెప్పి, నేను పైలెట్ కాబిన్ లోకి నడిచాను. తలుపు తెరచుకొని లోపలకు వెళ్ళాను.

విమానం కెప్టెన్ కంట్రోల్ స్టిక్ మీద తల అనించి ముందుకు పడివున్నాడు. అతనిలో ప్రాణంలేదని ఆ విచిత్రమైన భంగిమ చూడగానే అర్థమయింది. కో పైలట్ కూడా అదే స్థితిలో వున్నాడు.

విమానం బెల్లీ లాండింగ్ చేసినప్పుడు వత్తిడి అంతా ముందుభాగం తీసుకొంటుంది.

ఆ వత్తిడికి చనిపోయివుండాలి.

కాబిన్ లో వస్తువులన్నీ చెల్లాచెదురుగా అటూ ఇటూ పడిపోయివున్నాయి.

కో-పైలట్ చెయ్యి పట్టుకొన్నాను. ప్రాణంలేదని తెలుస్తోంది. వెనక్కి తిరిగి వెళ్ళబోయి ఆగిపోయాను. బూటుకు ఏదో జిగురుగా అంటుకొన్నట్లనిపించింది. క్రిందకివంగి చూశాను. ఏదో నల్లటి ఆయిల్ ఒకప్రక్క చిన్న మడుగులావుంది. చటుక్కున టార్చి వెలిగించి అటు వేశాను.

రక్తం! ఎర్రని, చిక్కని రక్తం!

క్రాష్‌లాండింగ్‌లో ఏ ఊచో, గెరో పైలట్ శరీరం లోకి గుచ్చుకొని వుండాలి. అద్దాలమీద ఇసుక జల్లుగా పడుతూ చిత్రమైన శబ్దం చేస్తోంది. ఒక్కసారి వెన్ను లోంచి చిత్రమైన వణుకు పుట్టుకొచ్చింది.

చటుక్కున తలుపు తీసుకొని బయటపడ్డాను.

అప్పటికే ప్రయాణీకులందరినీ డాక్టర్ ఘోష్ వెంట పంపి, విమానమంతా కలయచూస్తున్నాడు షేర్‌ఖాన్. నన్ను చూడగానే తనవెనకే రమ్మని తలవూపి విమానం

చివరకు నడిచాడు.

చివరివరుస సీట్లమధ్యలో ఎయిర్ హోస్టెస్ పడివుంది.

ఎంతో అసహజంగా, ఎవరో బలవంతంగా, కూడా విడిగా పక్కినట్లు, అసహ్యంగా కనిపిస్తోంది.

"డెడ్!" అన్నాను విచారంగా ఆ అందమైన ముఖం వైపు చూస్తూ.

అడ్డంగా తలవూపాడు షేర్‌ఖాన్, గొంతుదగ్గర చూపెడుతూ. అప్పుడు చూశాను. ఎర్రగా, ఉబ్బి, కందిపోయి, అక్కడకూడా పచ్చగా కమిలిన గుర్తులు.

"మైగాడ్! ఇటీజ్ మర్డర్."

చటుక్కునలేచి నిలబడి కాబిన్‌లోకి పరిగెత్తాను. షేర్‌ఖాన్ నా వెనకే లోపలికి వచ్చాడు.

కోపైలట్‌ను సీట్లోంచి క్రిందకులాగాను. వెల్లకిలా పడుకోబెట్టగానే కనిపించింది. నుదురు క్రింద, రెండు కనుబొమ్మలు కలిసేచోట. చుట్టూ నల్లగా మాడిపోయిన ఎర్రని రంధ్రం. పిస్తోలు గుండు చేసిన రంధ్రం!

ఒక్కక్షణం గుండె ఆగి కొట్టుకోవడం మొదలెట్టింది. విమానం కెప్టెన్ కూడా అదేవిధంగా చనిపోయాడు. త్రీ మర్డర్స్!!

## 4

మర్డర్! మైగాడ్ త్రీమర్డర్స్!

విమానం కూలినప్పుడు శవాలను చూడాల్సిన పరిస్థితి వస్తుందని తెలుసుగాని, హత్యచేయబడిన శవాల్ని అని మాత్రం అనుకోలేదు. ఢిల్లీటు బొంబే ఫ్లయిట్ విమానమదని షేర్‌ఖాన్ తెలుసుకొన్న దాన్నిబట్టి తెలుస్తోంది.

ఢిల్లీటు బొంబే ఫ్లయిట్ ఇప్పుడీ విమానంకూలిన చోటుకు దరిదాపుల్లో ఎక్కడా లేదు.

ఎవరయినా బలవంతంగా విమానాన్ని ఇటు మళ్ళించారా? ఎవరువాళ్ళు. ప్రయాణీకులు ఎవరూ చావలేదు. ఉన్న పదముగ్గురూ సురక్షితంగా వున్నారు.

విమానం బయల్దేరిన కాసేపటికి అందరూ నిద్రపోయినట్లు, ఎవరికీ ఏమీ తెలియనట్లు తెలుస్తుంది. అదెలా సంభవం? లేక వున్న పదముగ్గురూ కుట్రదారులేనా? అసలు విమానాన్ని ఎందుకు 'హైజాక్' చెయ్యాల్సి వచ్చింది? కారణమేమిటి?

విమానం పైలట్స్, ఎయిర్ హోస్టెస్ ప్రతిఘంటే తమని గుర్తుపడతారని చంపేశారా? గుడ్ గాడ్! అంతే అయ్యుండాలి. విమానాన్ని జాగ్రత్తగా ఈ ఎడారిలో బెల్లీలాండింగ్ చేయించగానే, తమ రహస్యాన్ని కాపాడుకోవడం కోసం చంపేసివుండాలి.

మైగాడ్! కోల్డ్ బ్లడెడ్ మర్డర్! హంతకులు మనుషుల్ని చంపడానికి వెనుకాడేవాళ్ళు కారు.

తిరిగి 'నైలాన్ కోవ్' కంటే మా స్థావరానికి తిరిగొస్తుంటే, నా మనసులో ఆలోచనలకు అంతులేకుండా పోయింది. మేము రక్షించిన పదముగ్గురిలో హంతకులు వున్నారు అనుకొంటుంటే వళ్ళు జలదరిస్తోంది.

మా స్థావరంలో వుండడానికి పదిమందిమి వున్నా, ఏడుగురు 'నార్త్ వెస్ట్' దిశగా 'ఇన్టెన్సివ్ ఇన్వెస్టిగేషన్' కోసం రెండ్రోజుల క్రితమే వెళ్ళిపోయారు. తిరిగి వాళ్ళు మరో పదిరోజులవరకూ రారు.

డాక్టర్ ఘోష్, షేర్ఖాన్, నేను, మేంముగ్గురమే వీళ్ళను హేండిల్ చెయ్యాలి. అందులోనూ క్రూరమైన ఆయుధాలున్న హంతకులను.

స్థావరానికి తిరిగివెళ్ళగానే వైర్లెస్ ట్రాన్స్మిటరు ద్వారా జోధ్పూర్ బేస్ను కంటాక్ట్ చేస్తే వెంటనే

తొందర్లో కొంత సహాయాన్ని అర్థించవచ్చు, అనుకున్నాను.

విమానం సిబ్బంది హత్యచేయబడినట్లు, మేము తెలుసుకొన్నట్లు హంతకులకు తెలియకపోవడమే మంచిది. మాకు ఏమీ తెలియదని వాళ్ళు అనుకోవడంలోనే మేము బ్రతికివుండడం ఆధారపడివుంది. ఈ విషయం గురించి ఏమీ మాట్లాడవద్దని షేర్‌ఖాన్‌కు చెప్పాను.

బారెక్స్‌లో సెంట్రల్ ఛాంబర్‌లో అంతా కూర్చొని డాక్టర్ ఘోష్‌తో మాట్లాడుతూ వున్నారు.

నేను లోపలికి రాగానే అందరివంకా ఒక్కక్షణం పరిశీలనగా చూశాను. అందరి ముఖాలలోనూ భయం, ఆందోళన కనిపిస్తోన్నయ్.

అందరూ అమాయకంగా, ఆపదలో చిక్కుకొన్న అసహాయుల్లా_మామూలు విమాన ప్రయాణీకుల్లా కనిపించారు.

ప్రయాణికులంతా కలిపి మొత్తం పదముగ్గురున్నారు. పదకొండుమంది మగవాళ్ళు, ఇద్దరు ఆడవాళ్ళు.

గాగుల్స్ తీసేసి లోపలి భావాల్ని దాచుకొంటూ అందరివైపూ నవ్వుతూ చూశాను.

"విమానం ఎలా కూలిందో ఎవరికయినా గుర్తుందా?" అడిగాను.

"నో. విమానం ఎక్కిన ఓ గంటలోపల అందరూ ఒళ్ళు తెలియకుండా నిద్రపోయారట. మేలుకొనేప్పటికి విమానం లాండయివుంది. మనం కనిపించాము" అన్నాడు డాక్టర్ ఘోష్.

డాక్టర్ ఘోష్ అప్పటికే అన్ని వివరాలు కనుక్కొన్నట్లున్నాడు. ప్రస్తుతానికి ఆ విషయం వదిలేయదలచుకొన్నాను.

"వెల్ మైడియర్ ఫ్రెండ్స్! వెల్‌కం టు గవర్న మెంట్ జియోలాజికల్ ఇన్‌వెస్టిగేషన్ సెంటర్. మిమ్మల్ని మేము పరిచయం చేసుకోవడం అవసరం అనుకొంటూను" అన్నాను చేతిగ్లవ్స్ తీసేస్తూ.

అందరూ మా ముగ్గురివంకా నిశ్శబ్దంగా చూశారు.

"వెల్! నాపేరు సురేష్. టెంపరరీ ఇన్‌చార్జ్ టుది సెంటర్. మీతో ఇప్పటివరకూ మాట్లాడుతూ వున్నది డాక్టర్ ఘోష్. నా వెనకవున్నది మిస్టర్ షేర్‌ఖాన్. నా! మీ గురించి చెప్పండి" అన్నాను వాళ్ళవంకే చూస్తూ.

అందరూ ఇబ్బందిగా ఒకరినొకరు చూసుకొంటూ ఓ క్షణంవుండి పోయారు. ఓ లావుపాటి గళ్ళకోటాయన ఒక్కసారి భుజాలెగరేసి ఒకడుగు ముందుకువేశాడు.

"అయామ్ మన్నీలాల్. బొంబాయిలో వ్యాపారం చేస్తున్నాను. ఢిల్లీలో మా బావమరిది పెళ్ళికెళ్ళి తిరిగి వస్తున్నాను నా మిసెస్‌తో" అన్నాడు ప్రక్కనే వున్న ఒకావిడ భుజంమీద చెయ్యివేసి దగ్గరికి తీసుకొంటూ.

మిసెస్ లాల్‌ను చూస్తే ఓ క్షణం గుండె కలుక్కుమంది. ఆవిడ పూర్ణగర్భవతని చూస్తుంటేనే తెలుస్తోంది.

ఆ తర్వాత మిగతావాళ్ళ గురించి తెలియడం ఎంతో సేపు పట్టలేదు. మిగతా పదకొండుమంది వివరాలు ఇవి:

మిస్ కామినీ సర్కార్: ప్రభుత్వ వాణిజ్యశాఖ కార్యదర్శి కుమార్తె. బొంబేలో బంధువుల్ని చూడ్డానికి వెళుతోంది. వయసు పాతికలోపు.

చక్రవర్తి: టెక్స్‌టైల్ డిజైనరు. బొంబాయిలో నివాసం. వయసు యాభైఅయిదు వుండొచ్చు.

సంజల్ బోస్: క్రికెట్ ఆటగాడు. వయసు 22.

గోపాల్ సంధు: రెడీమేడ్ దుస్తుల వ్యాపారం. వయసు 40.

చార్లెస్ ఫెర్రీరా: సబ్బుల కంపెనీ సేల్సు మేనేజరు. వయసు 35.

బల్వంత్ మెహ్రా: రిటైర్డ్ కాలేజ్ ప్రొఫెసర్. వయసు 60.

పి. యస్. రావు: డిస్ట్రిక్ట్ సబ్ కలెక్టరు. వయసు 25.

చాంద్ సింగ్: ఎగుమతి దిగుమతి వ్యాపారం. వయసు 30.

సునీల్ కుమార్: సినిమా నటుడు. వయసు 35.

రవివర్మ: సినిమా డైరెక్టరు. వయసు 40.

అబ్దుల్ గఫూర్: న్యాయవాది. వయసు 50.

అందరూ తమను తాము పరిచయం చేసుకోగానే గదిలోవున్న టెన్షన్ కాస్త తగ్గినట్లనిపించింది.

"మిస్టర్ సురేష్! విమానం కూలిందన్న భయంలో మొదట ఆలోచించలేదు. కాని విమానం సిబ్బంది ఏమయ్యారు?" అన్నాడు పి. యస్. రావు.

రావు మాట్లాడగానే ఒక్కసారి మళ్ళీ గదిలోని వాతావరణంలో చటుక్కున మార్పువచ్చింది.

నేను ఒక్కక్షణం రావువంక పరిశీలనగా చూశాను. చక్కటి పర్సనాలిటీ. తెలివైన కళ్ళు. అతన్లో జిల్లా అధికారికుండే దర్పం, హోదా కనిపిస్తోన్నయ్.

"డెడ్. చనిపోయారు. బహుశా లాండింగ్ షాక్ వల్ల ననుకొంటాను" అన్నాను.

"ఆర్ యూ ష్యూర్ మిస్టర్ సురేష్! ఒకవేళ వాళ్ళు బ్రతికుంటే" బల్వంత్ మెహ్రా స్వరం కొద్దిగా వణికి నట్లనిపించింది.

"యస్! అయామ్ పాజిటివ్ అబవుట్ ఇట్. వాళ్ళను

బయటికితీసి పరీక్ష చెయ్యలేదుగాని, ఎవరికీ గుండె కొట్టుకోవడం లేదు, విమానం వదిలి వచ్చేముందు ఐ మేడ్ ష్యూర్!'' అన్నాను. ఆ మాటలు చెపుతోంటే నా ఒళ్లు ఒక్కసారి జలదరించింది.

గదిలో ఒక్కక్షణం నిశ్శబ్దం ఆవరించింది.

''ఈ ఎడారిలోనుండి బయటకు వెళ్ళడం ఎలా? ఈ యాక్సిడెంట్ గురించి అధికారులకు ఎలా తెలుస్తుంది?''

అందరి చూపులు అటుతిరిగాయి. చార్లెస్ ఫెర్రీరా ముఖంలో చాలా ఆందోళన కనిపిస్తోంది. అందరి మనసుల్లో వేధిస్తున్న ప్రశ్నను అతను అడిగాడు.

అందరూ నే నేం చెపుతానో అని ఊపిరి బిగబట్టుకొని చూస్తున్నారు.

''ఇక్కడికి యాభైమైళ్ళ చుట్టూ ఏ వూరుగాని, పల్లెగాని లేవు. వారానికోసారి మాత్రం జోధ్‌పూర్ నుండి ఓ విమానంవచ్చి మాకు కావలసిన సప్లయిస్ డ్రాప్ చేసి వెళ్ళిపోతుంది. ఇక్కడికి దగ్గరలోవున్న వూరు అరవై మైళ్ళ దూరంలోవున్న శ్రీమోహన్‌ఘర్ అనే చిన్న వూరు'' అన్నాను ఒక్కసారి పరిసరాల్ని గుర్తుకు తెచ్చుకొంటూ.

''అయితే ఇక్కడనుండి శ్రీ మోహన్‌ఘర్ చేరడం ఎలా?'' అడిగాడు గోపాల్ సంధు.

''కాలి నడకన ఈ ఎడారిలో నడవడం అసాధ్యం. పగలు విపరీతమైన వేడి, రాత్రిళ్ళు విపరీతమైన చలి వుంటాయి. అయినా మరో ముప్పై ఆరుగంటల్లోగా యీ ఇసుక తుఫాన్‌లో మనం బయటకు కదలడం సాధ్యపడదనుకొంటాను.''

అంతా ప్రాణభయంతో బిక్కుబిక్కుమంటూ నా వంక చూశారు.

"అంటే ఈ తుఫాను తగ్గితేగాని మనం కదలడానికి వీలుండదా?" చాంద్‌సింగ్ గొంతు వణకడం కనిపించింది.

"నో! నో ఛాన్స్! తుఫాను తగ్గేవరకూ బయల్దేరడం కల్ల. తగ్గిన తరువాతైనా నడిచివెళ్ళడం అసంభవం."

"అయితే మరెలా?" అబ్దుల్ గఫ్ఫార్ మొట్టమొదటి సారి మాట్లాడాడు.

"తుఫాను తగ్గనివ్వండి ఆలోచిద్దాం" అన్నాను సమాధానంగా.

అప్పటిదాకా టువే రేడియో ట్రాన్సిస్టరుద్వారా జోధ్‌పూర్ బేస్‌ను 'రైజ్' చెయ్యడానికి విఫలప్రయత్నం చేసి, లాభంలేక స్విచ్ ఆఫ్ చేసి సిగరెట్ వెలిగించాడు షేర్‌ఖాన్.

"క్వయిట్ ఇంపాజిబిలిటీ! ఈ తుఫాను తగ్గేవరకూ ట్రాన్సిస్టరు వుపయోగం వుండదనుకొంటాను" అన్నాడు డాక్టర్ ఘోష్.

ట్రాన్సిస్టరు రిప్లై సిగ్నల్ కోసం చెవులు రిక్కించుకొని వింటున్న అందరూ నిస్పృహగా నిట్టూర్చారు.

షేర్‌ఖాన్ అందరికీ బిస్కట్లు, వేడివేడి టీ అందించసాగాడు. అందరూ కృతజ్ఞతగా పుచ్చుకొన్నారు. నేనుమాత్రం నామీద పెరుగుతోన్న బాధ్యతను గుర్తుతెచ్చుకొంటూ ఒక్క క్షణం దిగులుపడ్డాను.

జోధపూర నుండి రావలసినరోజుకు సప్లయిస్ రాకపోవడంవలన, మా దగ్గరవున్న 'రిజర్వ్ రేషన్స్' వాడుతున్నాము.

టీ ఆకు, పంచదార తరగనంతవున్నా ఆహార పదార్థాలు మాత్రం ఈ పదిహేనుమందికి ఒక్క రోజుకుకూడా చాలవు. అవి అయిపోతే, ఈలోగా ఈ తుఫాను తగ్గకపోతే అంధరూ ఆకలికి మాడి చావాల్సిన పరిస్థితి ఏర్పడు

తుంది.

పైగా, ఈ విమానం సిబ్బంది మరణాల మిస్టరీ నా మెదడును తినేస్తోంది. అసలు విమానం మార్గం మళ్ళి. ఇటెందుకొచ్చింది? ఎవరు మళ్ళించారు? ఎందుకు చేశారు? వీరిలో ఆ హంతకులెవరు?

త్వరగా జోధ్‌పూర్ బేస్‌తో కనెక్షన్ వస్తే బావుండును. బయట ప్రపంచంతో సంబంధం కలిగితే కాస్త ధైర్యంగా వుంటుంది.

అసలు చేరవలసిన బెయిరుకు విమానం చేరకుండా, వెళ్ళవలసిన మార్గంలో పోకుండావుంటే ఎయిర్ ట్రాఫిక్ కంట్రోలు సిబ్బంది ఏంచేస్తున్నట్లు?

తలవిదిలించి ఓసారి గదిచుట్టూ చూశాను. షేర్‌ఖాన్ ఇచ్చిన పదార్థాలతో సేదతీరి అంతా మెల్లిమెల్లిగా నిద్రలోకి జారుకొంటున్నారు. షేర్‌ఖాన్ గదిబయట స్టూలు మీద మళ్ళీ 'సెంట్రీ' కూర్చున్నాడు. తెల్లవారుజామున అతనికి నేను రిలీఫ్ ఇవ్వాలి.

అలసటగా నేనూ కళ్ళు మూసుకొన్నాను.

# 5

చటుక్కున మెలకువవచ్చింది. షేర్‌ఖాన్ చెయ్యి పట్టుకొని నన్ను ఊపుతున్నాడు.

బదకంగా కళ్లు తెరిచి చూశాను.

గదిలో దీపం దేదీప్యమానంగా వెలుగుతోంది. పడుకొన్న వాళ్ళందరూ లేచి గదిలో ఓమూల గూమిగూడి వున్నారు. తలవిదిలించి లేచి నిలబడ్డాను.

"వాటీజిట్ ఖాన్?" అన్నాను గుంపు దగ్గరికి నడుస్తూ.

షేర్‌ఖాన్ మాట్లాడలేదు. నా వెనుకే గుంపు దగ్గరికి

వచ్చాడు.

అక్కడి దృశ్యాన్ని చూసి నా కళ్ళను నేను నమ్మలేనట్లు చూస్తూ వుండిపోయాను. కోపం, నిస్సహాయం ఒక్కసారి గుండెల్లో పెల్లుబికాయి.

గదిమూల టేబిల్ మీద వున్న రేడియో ట్రాన్సిస్టరు క్రిందపడి ముక్కలు ముక్కలై వుంది.

మాకున్న ఒకే ఒక ఆశ, ఈ ఎడారినుండి మానవ ప్రపంచంతో సంబంధాలు కలిపే ఒకేఒక మార్గం, ముక్కలు చెక్కలై, అర్థంలేని, ఆకారంలేని వస్తువులా క్రిందపడివుంది.

ప్లాస్టిక్ కాబినెట్, లోపల గాజువాల్వులు పొడిపొడి ముక్కలుగా అయి దీపంకాంతిలో నన్ను వెక్కిరిస్తున్నట్లు మెరుస్తున్నాయి.

ఒక్కక్షణం అందరివంకా క్రోధంగా చూశాను. "డామ్ యు! ఎవరు చేశారీపని?" పిచ్చాళ్ళా అరిచాను.

నా అరుపుకు ఒక సెకనుపాటు బయట తుఫాను శబ్దం వినిపించలేదు. అందరూ గుడ్లప్పగించి తెల్లబోయి నావంక చూస్తున్నారు.

"జవాబు చెప్పండి. హు డిడ్ దిస్ బ్లడీథింగ్?"_ మళ్ళీ అరిచాను.

అందరూ నోటిమాట పోయినట్లు నిలబడ్డారు. నిముషం పాటు అందరి ముఖాలవంకా చూస్తూ వూరుకున్నాను. మెల్లిగా కోపంతగ్గి, వాస్తవం మెదడులోకి ప్రవేశించింది.

"షేర్ ఖాన్! ఎలా జరిగింది?" అన్నాను శాంతంగా.

"అంతా నిద్రపోయిన తరువాత లైట్ ఆఫ్ చేశాను సాబ్. లైట్ ఆఫ్ చేసి బయట కూర్చున్న పదినిముషాలకు బళ్ళున చప్పుడయింది. వెంటనే లైటు వెలిగించాను. చప్పుడుకు అందరూ నిద్రలేచివున్నారు. ట్రాన్సిస్టరు

క్రిందపడి ముక్కలై వుంది"-అన్నాడు షేర్‌ఖాన్ నింపాదిగా.

నేను తలవూపి అందరివైపు ఒకసారి చూశాను. ఇది కావాలని ఎవరో చేశారనడంలో సందేహంలేదు. ట్రాన్సిస్టర్‌తో బేస్‌ను రైజ్ చెయ్యగలిగితే తమ ఆట కట్టుతుందని వాంతప్లో ఎవరో ఈపని చేసుండాలి.

"ఆల్‌రైట్! ట్రాన్సిస్టర్‌కి దగ్గరగా పడుకున్న దెవరు?"

రవివర్మ భయంభయంగా నావంక చూశాడు. "నేను పడుకున్నాను."

"నిద్రలో పొరపాటున మీకాలు టేబిల్ కేమయినా తగిలిందా?"

ఈ ప్రశ్న అనవసరం అని తెలుసు. ఏమరుపాటున కాలుతగిలి టేబిల్ కదిలినంతమాత్రాన అంతె బరువైన, వెడల్పైన ట్రాన్సిస్టరు క్రిందపడదు.

"లేదు. గుర్తులేదు" అన్నాడు నిస్సహాయంగా.

నేనతనివైపు తీక్షణంగా చూశాను. "మిస్టర్ వర్మా! దయచేసి గుర్తు తెచ్చుకోండి. దాదాపు మూడుకిలోల బరువున్న ట్రాన్సిస్టరు దానంతట అది ఎగిరి క్రింద పడదు" అన్నాను.

రవివర్మ జాలిగా నావైపు చూశాడు. "నో! మిస్టర్ సురేష్! నాకేం తెలియదు. నిద్రలో నా కాళ్ళు టేబిలుకు తగిలే అవకాశంలేదు. టేబిల్‌కు దగ్గరగా పడుకున్నా అంతగా తగిలేట్లు పడుకోలేదు నేను"-

"డామిట్! మనకు సరైన సమయంలో సహాయం తెచ్చే ఆధారం ఆ ట్రాన్సిస్టరే. ఇప్పుడా అవకాశం లేకుండా పోయింది. ఈ ఎడారిలో, ఈ తుఫానులో

నుండి బయటపడడానికి ఇక మిమ్మల్ని ఆ దేవుడే రక్షిం చాలి''—అన్నాను బాధగా.

## 6

మర్నాడు పగలంతా కూడా తుఫాను తగ్గలేదు.

రాత్రిపూట చీకట్లో శబ్దంతప్ప మరేమీ తెలియదు గాని, పగలు వెలుతుర్లో గాలిలో అలల్లా తేలుతూ వస్తోన్న ఆ ఇసుక తెరలు చూస్తుంటే ఎంత ధైర్యవంతుడి కయినా గుండెలు జలదరించక మానవు.

నేను ఓ ప్రక్కన కూర్చొని జరిగిన విషయాలన్నీ ఓసారి నెమరువేసుకొన్నాను.

ఈరోజు రాత్రితో నిలవవున్న ఆహారమంతా అయి పోతుంది. ఆ తర్వాత ఇక్కడున్న పదిహేను మందికీ తుఫానుతో బాటు తిండికూడా ఓ పెద్ద సమస్యే కాచుం టుంది.

అదృష్టం బావుంటే బహుశా రేపాగున్నకల్లా ఈ ఇసుక తుఫాను తగ్గవచ్చు. తగ్గితే ఇక్కడ నుండి శ్రీ మోహాన్ ఘర్ కు కదిలే ప్రయత్నం చెయ్యాలి.

రాత్రి ట్రాన్స్మిటరు పగలడం యాధృచ్ఛికంకాదని మేం ముగ్గురం నిశ్చయించుకొన్నాము. బయట ప్రపం చంతో సంబంధం లేకుండా చెయ్యడం హంతకుల ఉద్దే శ్యమని స్పష్టంగా తెలుస్తోంది. ఎందుకని?

ఎడారిలో పరిస్థితి వాళ్ళకీ తెలుసు. నల్భై ఎనిమిది గంటల్లోగా సరైన సహాయం అందకపోతే అందరూ ఈ ఇసుక ఎడారిలో చావక తప్పదు. అలాంటప్పుడు నాగరిక ప్రపంచంలో చేరే అవకాశాన్ని ఎందుకు చెడగొడుతున్నారు. ఇంతకూ వాళ్ళలో ఆ హంతకు లెవరై వుంటారు?

"అందర్నీ బెదిరించి వాళ్ళ సామాన్లు వెతికితే మనకీ హాంతకులెవరో తెలియొచ్చు. పైలట్‌ని, సిబ్బందిని చంపడానికి ఉపయోగించిన పిస్తోళ్ళు ఇంకా వాళ్ళదగ్గరే వుండొచ్చు" అన్నాడు డాక్టర్ ఘోష్.

"నో! నాటెచాన్స్! ఆ పిస్తోళ్ళు ఇంకా వాళ్ళదగ్గర వున్నయ్యా లేదా అనేది అనుమానాస్పదం. ఒకవేళ లేకపోతే అనవసరంగా విషయాలన్నీ అందరికీ చెప్పి భయపెట్టడం అవుతుంది. వున్నా వాళ్ళను లొంగదీసుకోవడం జరగని పని. తమ రహస్యం బయట పడుతుందనుకొంటే అందర్నీ చంపడానికి వెనుకాడని మనుషులు హాంతకులు" అన్నాను తల అడ్డంగా ఊపుతూ.

"అయితే మరేం చేయడం?"

"ఏమీ తెలియనట్లు నటించడమే మంచిది. హాంతకులు మనకేమీ తెలియదని అనుకొన్నంతకాలం మన ప్రాణాలకేం భయంలేదు. రేపు తుఫాను తగ్గగానే వెంటనే శ్రీ మోహన్ ఘర్‌కు బయల్దేరుదాం. అంతవరకూ అందరి మీదా ఓ కన్నేసి వుంచండి."

"అందర్నీ అనుమానించడం అనవసరమేమో అనుకొంటాను" అన్నాడు షేర్‌ఖాన్.

నే నతనివంక ఆశ్చర్యంగా చూశాను.

అవునన్నట్లు తలవూపాడు. "చున్నీలాల్‌ను అనుమానించాల్సిన అవుసరంలేదు. అలాగే చంచల్‌బోస్‌నుకూడా. అతని ఫోటో చాలాసార్లు న్యూస్‌పేపర్లలో చూశాను. నేషనల్ ఫిగర్. బల్‌వంత్ మెహ్రా, విసూ చక్రవర్తిని కూడా లిస్ట్‌లోనుంచి తొలగించవచ్చు. దౌర్జన్యాలుచేసే వయసుకాదు వాళ్ళది. మిగిలిన ఎనిమిదిమందిని జాగ్రత్తగా గమనించడం మంచిది."

"హౌ ఎబవుట్ కామిని సర్కార్. ఆడది అలాంటి

ఘోరమైన హత్యలు చేస్తుందంటావా?"

షేర్ ఖాన్ చిత్రంగా భుజాలెగురేశాడు. "ఏం చెప్ప గలం?" అన్నాడు.

మనసులో షేర్ ఖాన్‌కు ఓ క్షణం కృతజ్ఞతలు చెప్పు కొన్నాను. పదమూడ్గురికన్నా ఎనిమిదిమందిని గమనించడం తేలిక.

క్రమక్రమంగా చీకటి పడుతోంది.

చీకటితో పాటు గాలి ఉధృతం కూడా పెరగసాగింది. ఒక్కొసారి గాలితెర వచ్చినప్పుడు బారెక్ కప్పు లేచి పోతుందేమో అనిపిస్తోంది.

అందరూ వేడివేడి చాకొలెట్ టీ త్రాగి కూర్చొ న్నారు. అందరి గుండెల్లో దిగులు. భవిష్యత్తుని గురించి, ఇక్కడనుండి ఎలా బయటపడడమో అని. మళ్ళీ బ్రతికి వుంటే బయట ప్రపంచాన్ని చూస్తామా అని.

అప్పుడు గుర్తొచ్చింది నాకు. నేను చేసిన పొరపాటు. ఈ విషయం ఇరవై నాలుగు గంటల క్రితమే గుర్తొస్తే ఈ పాటికి మేమందరం సురక్షితంగా వుండడానికి ఏర్పాట్లు జరిగుండేవి.

ఒక్కక్షణం నన్ను నేను తిట్టుకొని షేర్ ఖాన్‌కు సైగ చేశాను. మే మిద్దరం వరండాలో ఒంటరిగా నిలబడ్డాం.

వరండానిండా ఇసుక కుప్పలుగా పడివుంది. తుఫాను తగ్గేముందు చివరదెబ్బ. ఈ ఉధృతం తగ్గగానే తుఫాను ఆగిపోతుందని తెలుసు.

ఏమిటన్నట్లు చూశాడు షేర్ ఖాన్.

"విమానంలో రేడియో ట్రాన్స్మిటరు ఉంటుందన్న విషయం మనం మరిచిపోయాం. మన ట్రాన్స్మిటరుకన్నా చాలా పవర్ ఫుల్‌ది వుంటుంది. దాంతో కంట్రోల్ స్టేషన్‌కు కనెక్ట్ చెయ్యగలిగితే మనకష్టాలు సగం తీరు

తాయి. అసలు విషయమేమిటో కూడా తెలుసుకోవచ్చు"
అన్నాను.

షేర్‌ఖాన్ నావంక ఆశ్చర్యంగా చూశాడు. తరువాత అవునన్నట్లు తలాడించాడు.

"వెళదామా?" అన్నాడు.

నేను అడ్డంగా తలాడించాను. బయట గుట్టలుగా పడుతోన్న ఇసుకను చూపించాను.

"నో. ఇప్పుడు కాదు. విమానం తలుపుకు సగానికి పైగా ఇసుక పేరుకొనిపోయి వుంటుంది. తలుపు తెరవాలంటే చుట్టూవున్న ఇసుక తొలగించాలి. మనం బయటికి వెళ్ళి చాలా సేపువుంటే లోపలి వాళ్ళకు అనుమానం రావచ్చు" అన్నాను.

రాత్రి అందరూ పడుకొన్నాక విమానం దగ్గరికి వెళ్ళాలని నిశ్చయించుకొన్నాము. మేము బయటికి వెళ్ళినప్పుడు డాక్టర్ ఘోష్‌ను సెంట్రీగా వుండమని చెప్పాను.

## 7

రాత్రి అందరూ ఓచోట గదిలో పడుకొన్నారని నిశ్చయించుకోగానే నేను, షేర్‌ఖాన్ చప్పుడులేకుండా బయటికి వచ్చాము. హాలుబయట సెంట్రీగా కూర్చొన్న డాక్టర్ ఘోష్ 'గుడ్ లక్' అన్నట్లు నాలుగువేళ్ళు మడచి బొటనవేలు పైకెత్తి సైగచేశాడు.

నేను, షేర్‌ఖాన్ 'శోవెల్' సహాయంతో పదినిముషాల్లో విమానాన్ని చేరుకొన్నాము.

అనుకున్నదానికంటే ఎక్కువగానే ఇసుక విమానం చుట్టూ పేరుకొంది. కిటికీల వెత్తుకు పేరుకుపోయిన ఇసుకలో, సముద్రంలో సగం సగం తేలుతోన్న చిన్న తిమింగలంలా అవుపిస్తోంది విమానం.

'షావెల్స్'తో ఇద్దరం తలుపుదగ్గర ఇసుకను గబగబా తోడడం ప్రారంభించాము.

మనిషిదూరి లోపలకు వెళ్ళడానికి వీలయినంత తెరుచుకొనేందుకు దాదాపు ఇరవై నిముషాలపైనే త్రవ్వాము. మామూలుగా అయితే రెండు నిముషాలకన్నా ఎక్కువ పట్టదు. కాని త్రవ్వితీస్తున్న ఇసుక మళ్ళీ క్రిందకు జారి త్రవ్వందంతా పూడిపోతుంది. దానికితోడు వీపుమీద నిరంతరం వానలా కురుస్తోన్న ఇసుక.

విమానం లోపలికి ప్రవేశించి రెండుక్షణాలు బరువుగా ఊపిరి పీలుస్తూ ఆగిపోయాము.

లోపలంతా శవం కుళ్ళిన దుర్గంధం వస్తోంది. అవును! పగలున్న వేడికి శవాలు చాలా త్వరగా కంపుకొడతాయి. చకచకా కాక్‌పిట్ లోపలకు వెళ్ళాము.

తళతళ మెరుస్తోన్న డయల్స్‌తో, ఫ్లాష్‌లైట్ కాంతిలో రేడియో ట్రాన్స్‌మిటరు ఓ ప్రక్కవుంది. స్విచ్ ఆఫ్ చేసివుంది.

"బ్యాటరీ వుందో, అయిపోయిందో చూడాలి" అన్నాడు షేర్‌ఖాన్ స్విచ్ ఆన్ చేస్తూ.

కరకర శబ్దం వినిపించింది. ఫ్లాష్‌లైటు కాంతిలో షేర్‌ఖాన్ ముఖంలో నవ్వు చూడగానే ఒక్కక్షణం తృప్తిగా శ్వాసపీల్చి వదిలాను.

వేవ్ లెంగ్త్ కదపకుండా, డయల్ చూపిస్తున్న వేవ్ లెంగ్త్ మీదే సిగ్నల్ పంపించడం ప్రారంభించాడు.

విమానం జాడ తెలియకుండా పోయిన ఇరవైనాలుగంటల తరువాతకూడా కంట్రోల్ స్టేషన్ వాళ్ళు ఆ వేవ్ లెంగ్త్ మీదే వింటూ వుంటారని అనుకోను. అయినా తప్పదు. ప్రయత్నించాలి.

రెండు నిమిషాల సిగ్నలింగ్ తరువాత, సమాధానం కోసం మరో నిముషం ఆగిచూశాము. రిసెప్షన్ సిగ్నల్ బల్బు మామూలుగా వెలుగుతోంది. అంటే అటుప్రక్క ఎవ్వరూ ట్రాన్స్మిషన్ రిసీవ్ చేసుకోవడం లేదన్న మాట. వెంటనే జోధ్‌పూర్ బేస్ వేవ్ లెంగ్త్ మీద సిగ్నల్ పంపమని చెప్పాను.

మామూలుగా ప్రతి గురువారం ఉదయం పదినుండి పదకొండుమధ్య మా ట్రాన్స్మిటర్ సిగ్నల్ కోసం ఎదురు చూస్తారు వాళ్లు. రిసీవింగ్ సెట్‌లో ఆ వేవ్ లెంగ్త్ మీద ట్రాన్స్మిషన్ చేసే సమయంలో రిసెప్షన్ లేకపోతే ఎన్ని సిగ్నల్స్ పంపినా వృధాయే. అయిదు నిముషాలు సిగ్నల్స్ పంపి సెట్ ఆఫ్ చేశాడు షేర్‌ఖాన్.

ఒక్క క్షణం నిరాశగా ట్రాన్స్మిటరువైపు చూశాను. చటుక్కున ఓ విషయం స్ఫురించింది.

"జోధ్‌పూర్ రేడియో స్టేషన్‌గాని, బికనీర్ రేడియో స్టేషన్‌గాని ఏ వేవ్ లెంగ్త్స్ మీద ప్రోగ్రాం ప్రసారం చేస్తాయి?" అడిగాను.

"జోధ్‌పూర్ షార్ట్ వేవ్ 30.1మీద ప్రసారంచేస్తుంది" అన్నాడు షేర్‌ఖాన్ ఓ క్షణం అర్థం కానట్లు.

మామూలుగా ఎప్పుడయినా రేడియో ఆన్ చేసినప్పుడు, స్టేషన్ ఇండికేటర్ నీడిల్ త్రిప్పుతోంటే మనకు అర్థంకాని సంభాషణలు వినిపిస్తుంటాయి అప్పుడప్పుడు. అవి ఎయిరో డ్రోమ్ ఫ్లయిట్ కంట్రోల్ రూమ్ అధికారులు, మార్గమధ్యంలోవున్న విమానం నావిగేటర్లకు మధ్య జరిగే సంభాషణ అని చాలామందికి తెలియదు.

ఆ సూత్రాన్నే నే నిప్పుడు అమలు చేస్తున్నాను. ఎవరైన ఈ టైమ్‌లో జోధ్‌పూర్ రేడియో స్టేషన్ ఆన్

చేస్తే మేము ప్రసారం చేసేది వినే అవకాశం వుంది. రాజస్థాన్‌లో వున్న కొన్ని వేల రేడియో సెట్లలో కనీసం ఒకటయినా ఆ టయిములో ఆన్ అయివుండదా అని మా ఆశ.

త్రీ పాయింట్ వన్ వ డయల్ సరిచేసి నేను చెప్పిన మెసేజ్‌ను రేడియో అనౌన్సర్‌లా ప్రసారం చెయ్యడం మొదలు పెట్టాడు షేర్ ఖాన్.

"దిసీజ్ ఇండియన్ గవర్నమెంట్ జియోలాజికల్ సెంటర్ కాలింగ్ ఫ్రమ్ థార్. రిపీట్. దిసీజ్ గవర్నమెంట్ జియోలాజికల్ సెంటర్ కాలింగ్ ఫ్రమ్ థార్. ఢిల్లీ-టు-బొంబే ఫ్లయిట్ నిన్న రాత్రి మా సెంటర్‌కు ప్రక్కన కూలిపోయింది. సిబ్బంది మర్డర్ చెయ్యబడ్డారు. ప్లీజ్ పాస్ ది మెసేజ్ టు ది అథారిటీస్. దగ్గరవున్న అధికారులకు ఈ విషయం వెంటనే తెలియ చెయ్యండి. దిసీజ్ ఎమర్జెన్సీ."

మెసేజ్‌ను మళ్ళీ మళ్ళీ రిపీట్ చెయ్యమని చెప్పాను షేర్ ఖాన్‌కు.

# 8

ఏదో శబ్దం. ఎవరో విమానాన్ని సుత్తులతో బాదుతున్నట్లు ఒక్కొక్క దెబ్బకు విమానం గోడలు కదులుతున్నట్లనిపించాయి.

షేర్ ఖాన్‌ను సంజ్ఞలతో హెచ్చరించి, తలుపు దగ్గరకు పరిగెత్తాను.

తలుపు మూసేసి వుంది.

ఒక్కసారి గుండె ఝల్లుమంది.

మేం లోపలకు వచ్చేప్పుడు గాలికి తలుపు మూసుకోకుండా 'పిక్ యాక్స్' అడ్డం పెట్టి వచ్చాము.

రెండు చేతులతో తలుపును గట్టిగా తోశాను. రెండు వేళ్ళు పట్టేంత సందు వచ్చింది. బయటినుండి ఎవరో అదిమిపడుతోన్నట్లనిపించింది. నేను త్రవ్విపోసిన ఇసుకంతా మళ్ళీ తలుపుచుట్టూ పేరుకొంది.

తలుపును ఇంకా బలంగా త్రోశాను. మరో అంగుళం కదిలింది...అంతే అంతకన్నా తెరవడానికి నా బలం చాలలేదు.

ఎవరో విమానం అడుగుభాగాన్ని ఇంకా బాదుతోనే వున్నారు. తలుపు సందులోనుండి బయటకు చూశాను. ఎవరూ కనుపించడంలేదు. సర్రున వీచే గాలితోపాటు ఇసుక కణాలు గాగుల్స్‌కు కొట్టుకొంటూ దృష్టికి ఆటంకం కలిగిస్తున్నాయి.

ఉన్నట్టుండి శబ్దం ఆగిపోయింది. ఒక్క క్షణం గాలి, ఇసుక చప్పుడు తప్ప మరేం వినిపించలేదు.

అంతే, మరుక్షణం ఎర్రనిమంట విమానం వెనకవైపు కనిపించింది.

మైగాడ్! విమానం పెట్రోల్ టాంకులను ఎవరో అంటించారు. చటుక్కున వెనక్కి తిరిగి కాబిన్‌లోకి పరిగెత్తాను.

షేర్‌ఖాన్ మెసేజ్ చెపుతోనే నావంక ప్రశ్నార్థకంగా చూశాడు.

“డ్రాప్ ఇట్ ఖాన్! కమాన్ క్విక్! ఎవరో ఫ్యూయల్ టాంక్స్ అంటించారు” అన్నాను వెనక్కి తిరిగి పరిగెడుతూ.

షేర్‌ఖాన్ నా వెనకాలే పరిగెత్తుకొచ్చాడు.

ఇద్దరం కలిసి తలుపును బలంగా తొయ్యడం ప్రారంభించాము. దాదాపు ఆరంగుళాలు సందు ఏర్పడింది. ఎవరో తలుపుమూసి, దానిచుట్టూ గోతిలో ఇసుకపోసి వుండాలి.

షనుక అరఘులుగా వుండడంవలన మరో రెండంగుళాలు తెరువడానికి సాధ్యపడింది. సందులోనుండి ఎర్రని మంటలు కనిపిస్తోన్నయ్.

హైలీ ప్యూరిఫైడ్ వైట్ పెట్రోల్. మేము బయట వదలిన పిక్‌యాక్స్‌తో లోక భాగంలోవున్న టాంక్స్‌ను చిల్లుపెట్టి వుండాలి. బయట ఇసుక పడుతోన్నా, టాంక్ లోపల 'కావెటీ'లో గాలివత్తిడి పెరిగి టాంకులు పేలిపోయే ప్రమాదం వుంది.

తలుపు సందులోంచి ఇద్దరం బయటపడ్డాము.

బుస్సుమంటూ మండుతున్న సన్నని ఎర్రని మంటలు కనిపిస్తున్నాయి. చేయిచాచి నైలాన్ రోప్ అందుకోవడానికి ప్రయత్నించాను. చేతికందే దూరంలో రోప్ తగల్లేదు.

ఒక్కసారి గుండె ఝల్లుమంది. 'రోప్ వే' సహాయం లేకపోతే స్థావరాన్ని చేరుకోవడం చాలాకష్టం.

"కమాన్ సాబ్! రోప్ కోసం వెతికే ప్రయోజనం లేదు. స్ట్రెయిట్ లైన్‌లో పరిగెడితే బారెక్స్‌కు దగ్గరగా వెళతాము"

అన్నాడు షేర్‌ఖాన్ ముందుకు పరిగెడుతూ.

నేనూ అతని వెనుకే పరుగు ప్రారంభించాను. టాంకులు పేలేసమయానికి దగ్గరలోవుంటే చాలా ప్రమాదం.

"రోగ్స్! డర్టీరోగ్స్!" తిట్టుకొన్నాను కసిగా పరిగెడుతూనే.

యాభై గజాలు పరిగెత్తి వుంటాము. పరిగెడుతోంటే బూట్లు ఇసుకలో కూరుకుపోయి ఎక్కువదూరం పరిగెత్తడానికి వీలులేకుండా వుంది.

అప్పుడే పెద్ద ధ్వని వినిపించింది. షేర్‌ఖాన్ ఎగిరి బోర్లాపడ్డాడు. నేను అతనిప్రక్కనే రెండు చేతుల్లో

ముఖం దాచుకొంటూ క్రిందపడ్డాను.

వెంటనే బాంబు పేలినట్టు రెండు పెద్ద శబ్దాలు మా వెనకే వినిపించాయి. శబ్దం వెంటనే ఎర్రటికాంతి ఓ అర నిముషంపాటు చుట్టూ పరిసరాల్ని ముంచేసింది. వెంటనే చీకటి అలుముకొంది.

ఓ రెండు నిముషాలపాటు ఊపిరి బిగబట్టినట్లు అలాగే పడుకొని వుండపోయాము. అప్పటికే ఇసుక మమ్మల్ని సగంవరకు కప్పేట్టింది. మరికాసేపు ఆగితే సజీవ సమాధే చేసేసుంది.

మెల్లిగా పైకిలేచి విమానంవున్న వైపు చూశాము. ఎర్రగా అక్కడక్కడా సన్నగా మండుతోన్న మంట కనిపిస్తోంది. కొద్ది నిముషాల్లో ఆ మంటకూడా ఆరిపో తుంది. నిరంతరం వానజల్లులా ఇసుక పడడంవలన పెద్దగా మంటమండే అవకాశంలేదు.

విమానం నామరూపాలు లేకుండా ధ్వంసమయిపో యింది. అంటే రేడియో ట్రాన్స్మిటరుతో మరో మెసేజ్ పంపే అవకాశంలేదు.

ఎవరో మా వెనకేవచ్చి మేము విమానం లోపలకు వెళ్ళగానే తలుపుమూసేసి, తెరుచుకోకుండా ఇసుకపోసి, ఫ్యూయల్ టాంక్స్ను చిల్లుపెట్టి నిప్పంటించారు. ఎవరు వాళ్ళు?

# 9

గదిలో డాక్టర్ ఘోష్ను చూడగానే జరిగిందేమిటో వూహించగల్గాను.

గదిమధ్య దీపంక్రింద డాక్టర్ ఘోష్ నీరసంగా కళ్లు మూసుకొని కూర్చొనివున్నాడు. నంజల్ బోస్ ఆయన తలచుట్టూ డ్రస్సింగ్ చేస్తున్నాడు.

గదిలోకి రాగానే "మాకుముందు బయటినుండి గదిలోకి వచ్చిందెవరు?" అన్నాను రొప్పుతూ.

ఎవరూ మాట్లాడలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు.

అంతలో, డాక్టర్ ఘోష్ భారంగా కళ్ళు తెరచి మావంక చూశాడు. ఆయన్ని తలవెనుక ఎవరో బలంగా కొట్టారు. మమ్మల్ని చూసి బలహీనంగా నవ్వి, మంచినీళ్ళు అని సైగచేశాడు. డాక్టర్ ఘోష్ మంచినీళ్లు త్రాగగానే అడిగాను. "డాక్టర్! అసలు ఏం జరిగింది?"

"మీరు వెళ్ళిన రెండు, మూడు నిమిషాలకు గదిలో ఎవరో కదిలిన అలికిడయింది. లేచి లైట్ స్విచ్ ఆన్ చేయబోయాను. లైటు వెలిగే లోపలే ఎవరో తలమీద బరువైన వస్తువుతో మోదారు. నాకు స్పృహపోయింది. నాకు తిరిగి స్పృహ వచ్చేటప్పటికి గదిలో మిస్టర్ బోస్ నా ముఖంమీద నీళ్ళుచల్లుతూ కనిపించారు. మిగిలిన అందరూ చుట్టూవున్నారు" అన్నాడు ఘోష్ నెమ్మదిగా ఒక్కొక్క మాటే పలుకుతూ.

నేను తలవూపి అందరివంకా చూశాను.

"డాక్టర్ ఘోష్‌ను గదిలోకి తెచ్చిందెవరు?"

చంచల్ బోస్ నావైపు అలసటగా చూశాడు. "హఠాత్తుగా నిద్రలో పెద్దశబ్దం. ఏదో ఎక్స్‌ప్లోషన్ జరిగినట్లు విని మెలకువ వచ్చింది. బహుశా అందరూ ఆ శబ్దం వినుండాలి. అందరూ మేలుకొని భయంగా ఏమిటేమిటని అడుగుతున్నారు. నేను లేచి లైటు వేయబోయాను_ కాని అప్పటికే సర్దార్‌జీ లైట్ స్విచ్ వేశారు."

"వెయిటే మినిట్! గదిలో లైటు వెలిగినప్పుడు అందరూ లోపలే వున్నారా?" అడిగాను.

బోస్ విచిత్రంగా భుజాలెగురేశాడు. "గమనించలేదు.

అందరూ భయంగా గదిలోకి, వరెండాలోకి తిరుగుతున్నారు. మా ముగ్గురిలో ఎవరూ కనిపించలేదు. వరండాలో లైటు వెలిగించేసరికి డాక్టర్ ఘోష్ కాళ్ళూ చేతులు కట్టిపడేసి, నోట్లో గుడ్డలు కుక్కబడి స్పృహ లేకుండా పడివున్నారు. వెంటనే ఆయన్ను లోపలకు తీసుకొచ్చి ఫస్టెయిడ్ చేశాను'' అన్నాడు.

'డామిట్' అనుకొన్నాను పళ్ళుబిగించి లోపలే.

పరిస్థితి నా చేతుల్లోంచి జారిపోతుందనడంలో సందేహం లేదు. అవసరమొస్తే హంతకులు అందర్నీ చంపి పోతారనడంలోకూడా సందేహం లేదు. కాని ఆపదలో వున్న మిగిలిన అమాయకులకు తమ స్థితేమిటో తెలియజెయ్యడం మంచిదనిపించింది.

దానివల్ల కొంత రిస్క్ తగ్గుతుంది. తమతో ఎవరో అంతుతెలియని హంతకుడున్నాడని తెలిస్తే, ప్రాణభయంతో ప్రతీ మనిషీ ప్రక్క మనిషిని అనుక్షణం కనిపెడుతూ వుంటాడు. దానివల్ల హంతకులు ఇదివరలా చొరవచేసే అవకాశం లేదు.

నేను షేర్ ఖాన్ వైపు తిరిగి గుంపుకు వెనుక నిలబడమని సైగచేసి గొంతు సవరించుకొన్నాను.

"దయచేసి జాగ్రత్తగా వినండి! నేను చెప్పే విషయం మీద మనం బ్రతికుండడం ఆధారపడి వుంది. మీలో ఎవరికైనా ఈ ఎడారిలో మీ విమానం ఎలా కూలిపోయిందో తెలుసా?''—

ఎవ్వరూ మాట్లాడలేదు. గదిలో ఒక్కసారి నిశ్శబ్దం ఆవరించింది.

"రైట్! బహుశా మీకు తెలియదు. మీ విమానం దారితప్పి ఇక్కడ కూలిపోలేదు. ఎవరో బలవంతాన ఈ ఎడారి మధ్యలో ఆ విమానాన్ని దింపించారు. హై

జాకింగ్! ఎవరు చేశారో, ఎందుకు చేశారో నామటుకు నాకు తెలియదు. కాని ఆ హైజాక్ చేసిన వాళ్లుమాత్రం మీలోనే వున్నారు. అంతేకాదు విమానం సిబ్బంది మీతో చెప్పినట్లు 'లాండింగ్ షాక్' వల్ల చనిపోలేదు. ఎవరో వాళ్ళను హత్యచేశారు. బ్రతికుంటే తమను గుర్తు పడతారని చంపేశారు. తిరిగి ఈ రోజు మేము విమానం దగ్గరకు వెళ్ళగానే, మా వెనకే వచ్చి ఫ్యూయల్ టాంక్స్ అంటించారు. వాళ్ళే మన ట్రాన్స్మిటర్ను కూడా టేబిల్ మీదనుండి క్రిందకు తోసి పగలగొట్టారు.

"నా! మైడియర్ ఫ్రెండ్స్! ఇవి జరిగిన విషయాలు. మొదటి రోజు పైలెట్ ఆఫీసర్ను, కెప్టెన్ హత్య చేయబడినప్పుడు మిమ్మల్ని అనవసరంగా కలవరపెట్టడం ఇష్టంలేక, మనకు సహాయం వస్తుందనే ఆశతో చెప్పలేదు. కాని ఇంత జరిగింతరువాత మీకు తెలుపకపోవడం బాధ్యతారహితంగా తోచింది. సో వాచవుట్! మీ పదముగ్గురిలోనే హంతకులున్నారనేది నిస్సందేహం"

అన్నాను ఒక్కొక్క మాటే వత్తిపలుకుతూ.

అందరూ భయభయంగా ఒకరినొకరు చూసుకున్నారు.

"మిష్టర్ సురేష్! దిసీజ్ టూమచ్! ఆర్ యూ సీరియస్..."...బల్వంత్ మెహ్రా కంఠం ప్రాణభయంతో వణుకుతోంది.

"యస్ మిష్టర్ మెహ్రా! ఐయామ్ క్వాయిట్ సీరియస్! పైలట్ ఆఫీసర్ల కణతల్లో పిస్తోలుగుళ్ళు చేసిన రంధ్రాలు, గొంతు నులిమి చంపబడ్డ ఏర్హోస్టెస్ను నేను మిమ్మల్ని రెస్క్యూచేస్తున్నప్పుడే చూశాను."

"ఐకాంట్ బిలీవ్... యూ మస్ట్ బి డ్రీమింగ్..." అంది కామినీసర్కార్ ఊపిరి పీల్చలేనట్లు.

నే నావిడ వైపు అసహనంగా చూశాను. "డోంట్

టాక్ రబ్బిష్ మిస్. సర్కార్! యూ జస్ట్ వాచవుట్! మీలో అమాయకుడైన ప్రతి వ్యక్తీ ప్రాణాపాయంలో వున్నారని గుర్తుంచుకోండి" అన్నాను ఆమె కళ్ళలోకి సూటిగా చూస్తూ.

"బట్ మిస్టర్ సురేష్! మనం ఇక్కడినుండి బయట పడేదెలా?" అన్నాడు చంచల్ బోస్.

"యూ వెయిట్ అంటిల్ మార్నింగ్! ఉదయాన్నే అందరం శ్రీమోహన్ ఘర్ కు బయల్దేరే ఏర్పాటుచేస్తాను" అందరి ముఖాలు చూస్తూ అన్నాను.

వాళ్ళు నమ్మలేనట్లుగా నన్ను చూశారు.

"ఎలా? ఈ ఎడారిలో నడిచి వెళ్ళడం సాధ్యపడుతుందా?" అడిగాడు చార్లెస్ ఫ్రెరిరా.

"వుయ్ విల్ సీ" అన్నాను నాలో నేను నవ్వుకొంటూ.

మేము సురక్షితంగా మానవ ప్రపంచంలోకి వెళ్ళడానికి వున్న ఆఖరి అవకాశం ఏమిటో ఇప్పుడే చెప్పి దాన్నికూడా పోగొట్టుకో దలచుకోలేదు.

గదిలో అందరూ తలో మూల కూర్చొని ఒకరినొకరు చూసుకొంటున్నారు. అప్పుడే 'వాచ్ డాగ్' డ్యూటీ ప్రారంభించారన్నమాట.

నా ఎత్తు పనిచేసినందుకు కొంత ఆనందం కలిగింది. ఇలా ఒకరినొకరు అనుమానంతో ప్రతిక్షణం కనిపెట్టడం వలన హంతకులు సడన్ గా ఏమీ చెయ్యలేరు.

# 10

మర్నాడు ఉదయానికి తుఫాను తగ్గుముఖం పట్టింది. గాలి ఉధృతం చాలావరకూ తగ్గిపోయింది. అప్పుడప్పుడూ వున్నట్టుండి వచ్చే గాలితెర తప్ప వాతావరణం ప్రశాంతంగా వుంది.

ఆరు గంటలకే సూర్యుడు ఎర్రటి కిరణాల్ని ప్రసారం చేస్తూ తూర్పున ఉదయించాడు. దూరాన నల్లగా మసి బారి ముక్కలైన విమాన శిధిలాలు కనిపిస్తున్నాయి.

వెంటనే శ్రీ మోహన్ ఘర్ కు ప్రయాణమైతే బహుశా పన్నెండు గంటలకల్లా అక్కడకు చేరుకోవచ్చు.

నేను అందర్నీ ప్రయాణానికి సిద్ధం కమ్మని చెప్పి బారెక్స్ ప్రక్కకు నడిచాను.

బారెక్స్ వెనుక చిన్న వెహికల్ షెడ్ వుంది.

ఎడారిలో కాలినడకన తిరగకుండా మేము వుపయోగించే ట్రక్ వుంది అందులో. "డెసర్ట్ రోవర్ ట్రక్"— త్రీటన్నర్. ఎడారిలో కూరుకొని పోకుండా నడవడానికి వీలుగా, యుద్ధంలో వుపయోగించే టాంక్ మాదిరి, అది 'చైన్' సహాయంతో నడుస్తుంది. కంపాస్, వాటర్ కూలింగ్ మిషను మొదలయినవన్నీ అందులో అమర్చి వుంటాయి.

సాధారణంగా ఎడారిలో బరువైన వస్తువుల్ని ఒక చోటనుండి మరో చోటకు తీసుకెళ్ళడానికి దాన్ని వుపయోగిస్తుంటాము. ఇప్పుడు మా బ్రతుకులు అది పని చేయడంమీద ఆధారపడివుంది.

దీనిగురించి ముందే తెలిసి వుంటే హంతకులు మమ్మల్ని చంపడానికి వెనుకాడేవాళ్ళుకాదు. డ్రైవర్ సీట్లో కూర్చొని ఇంజన్ స్టార్ట్ చేశాను. నక్కని కండిషన్లో వున్నట్లు శబ్దం వింటే తెలుస్తోంది.

టాంకునిండా పెట్రోలు పోసి బారెక్స్ ముందుకు తెచ్చి ఆపాను. బోనెట్ తెరిచి స్టార్టర్ ప్లగ్ పీకి జేబులో వేసుకొని లోపలకు నడిచాను.

అందరూ బధకంగావున్నారు. డాక్టర్ ఘోష్ ఓ పెద్ద చెక్కపెట్టెనిండా ఆపరేటస్, మందులు, బాండేజెస్

సర్దుతున్నాడు.

షేర్‌ఖాన్ చిన్న కిరోసిన్ స్టవ్, టీఆకు, పంచదార, కండెన్స్‌డ్ మిల్క్ తీసుకెళ్ళి ట్రక్కులో పెట్టాడు. నేను అందరివంకా ఓసారి చూసి తృప్తిగా తలాడించాను.

హంతకులు ఏమన్నా చేస్తే ఇప్పుడే చెయ్యడానికి ప్రయత్నిస్తారు.

"నా ఫ్రెండ్స్! దయచేసి ఎవరూ సడెన్‌గా కదలడంగాని, పరిగెత్తడంగాని చెయ్యకండి. దయచేసి అందరూ ఒకరివెంట ఒకరు లైనుగా వెళ్ళి ట్రక్‌లో కూర్చోండి" అన్నాను జాగ్రత్తగా చూస్తూ...

"ట్రక్! మైగాడ్! వేర్ ది హెల్" ఆశ్చర్యంగా అంటున్నాడు సుశీల్‌కుమార్.

నేను అవునన్నట్లు తలాడించాను.

ఒక్కొక్కరే వరసగా వెళ్ళి ట్రక్ వెనక బాడీలో కూర్చున్నారు. డాక్టర్ ఘోష్ కూడా వెనకే కూర్చున్నాడు.

షేర్‌ఖాన్ ఓ టార్పాలిన్‌ని పైన గూడులా ఏర్పాటు చేశాడు.

ఇదంతా జరుగుతున్నంతసేపు నేను ఊపిరి బిగబట్టినట్లు చూస్తూ నిలుచున్నాను ఏ క్షణాన హంతకులు కదులుతారోనని.

"ఫ్రెండ్స్! నా వుయ్‌గో!" అన్నాను డ్రైవింగ్ సీట్లో కూర్చుని తలుపు మూస్తూ.

ఎవ్వరూ కదిలిన శబ్దంలేదు. అప్పుడప్పుడూ వీస్తున్న గాలి శబ్దం తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది.

మెల్లిగా స్టార్టర్ ప్లగ్ పీకించి ఇంజన్ స్టార్ట్ చేశాను. ట్రక్ కదలగానే షేర్‌ఖాన్ కాబిన్‌లోకి ఎక్కి నా ప్రక్కనే కూర్చున్నాడు.

నేను చకచక గీర్లు మార్చి ట్రక్‌ని ముందుకు పోనిచ్చాను.

దాదాపు పన్నెండు మైళ్ళు ప్రయాణం చేశాము. మరో నాలుగుగంటలు గనక ఏ ఇబ్బంది లేకుండా గడిస్తే మనుష్య ప్రపంచంలో పడతాము.

ఉదయం ఎనిమిదింటికే ఎండ తీక్షణత ఎక్కువ యింది. మబ్బుల్లేని ఆకాశం స్వచ్ఛంగా కనిపిస్తోంది.

డ్రైవింగ్ చేస్తూనే అప్పుడప్పుడూ బయిట ఆకాశం కేసి చూస్తున్నాను. వాతావరణం బావుంది కాబట్టి జోధ్‌పూర్ నుండి రావలసిన సప్లయిస్ విమానం రావచ్చు.

వెనక కాబిన్ మీద ఎవరో బలంగా కొడుతూ చప్పుడు చేస్తున్నారు.

ఏమిటన్నట్లు షేర్ ఖాన్ వైపు చూశాను. షేర్ ఖాన్ కాబిన్ వెనకవున్న చిన్న కిటికీలాంటిది తెరచి వెనక బాడీలోకి చూశాడు. తలుపు తెరవగానే అవతల ఫెర్రిరా కంఠం వినిపించింది.

"స్టాప్ ది ట్రక్! షి యీజ్ గెటింగ్ పెయిన్స్" అరిచాడతను.

"షి యీజ్ వాట్?" అంటూండగానే విషయం అర్థమయింది నాకు.

మై బాడ్ లక్! మిసెస్ లాల్‌కు నెప్పులు ప్రారంభమయినాయి. ఈ ఇసుక ఎడారిలో మరో ప్రాణి ప్రపంచంలోకి వచ్చే ప్రయత్నం ప్రారంభించింది.

షేర్ ఖాన్ ట్రక్ బాడీలోకి తొంగి చూసి, నావైపు తిరిగి తలాడించాడు.

ట్రక్కు ఆపేశాను.

షేర్ ఖాన్ భుజంమీదనుండి ట్రక్ బాడీలోకి తొంగి చూశాను. మిసెస్ మున్నీలాల్ బాధతో మెలికలు

తిరుగుతోంది. డాక్టర్ ఘోష్ ఆవిడనాడి చూస్తూ ఏదో చెపుతున్నాడు. మిసెస్‌లాల్ ముఖంమీద స్వేదబిందువులు ధారకడుతోన్నయ్.

ట్రక్ దిగి వెనకకు వెళ్ళాము. డాక్టర్ ఘోష్ అందర్నీ క్రిందకు దిగమని చెపుతున్నాడు. మమ్మల్ని చూడగానే నెర్వస్‌గా నవ్వాడు.

అందరూ చకచకా ట్రక్‌లోంచి క్రిందకుదిగారు.

అందరూ క్రిందకు దిగగానే డాక్టర్ ఘోష్ తన చెక్క పెట్టె తెరచి రెండు దుప్పట్లు ట్రక్ నేలమీద పరచి మిసెస్ లాల్‌ను దానిమీద పడుకోబెట్టాడు.

ఆవిడను పరీక్ష చేసి షేర్‌ఖాన్ వైపు తిరిగి, "ఆపరేట్ చెయ్యాల్సిన అవసరం వుంటుందనుకొంటాను. స్టౌ వెలిగించి నీళ్లు వేడిచెయ్యి" అన్నాడు.

షేర్‌ఖాన్ వెంటనే స్టౌ వెలిగించి, టీ కాచడానికి తెచ్చిన పెద్దగిన్నెలో, ప్లాస్టిక్ కేన్లలోనుండి నీళ్ళు వంపి కాచడం మొదలెట్టాడు.

చున్నీలాల్ చిన్నపిల్లాడిలా గడగడలాడుతున్నాడు. డాక్టర్ ఘోష్, కామినీ సర్కార్‌వైపు తిరిగి దగ్గరకు రమ్మని సైగ చేశాడు.

"ప్లీజ్ హెల్ప్‌మి మిస్!" అన్నాడు ఆపరేషన్‌కు బాడీ అనుకూలంగా వచ్చేట్లు దుప్పట్లు ఎలా ఎత్తుగా పెట్టాలో చెపుతూ.

ఎ డాక్టర్ యీజ్ ఆల్‌వేస్ ఎ డాక్టర్ అనిపించింది.

పొరపాటున పెద్దగా గాలివీస్తే ఇరుకపడకుండా, పైనవేసిన టార్పాలిన్‌ను సందులేకుండా కట్టమని పురమాయించాడు నాకు.

ఓ పదినిముషాలు అందరమూ ట్రక్ బాడీని చిన్నసైజు ఆపరేషన్ థియేటర్‌గా మార్చడంలో మునిగిపోయాం.

బోస్, చాంద్‌సింగ్ నాకు చుట్టూ స్పేర్ బ్లాంకెట్స్ తెరలుగా కట్టడంలో సహాయం చేశారు.

మిస్ కామిని నీటిలో తెల్లని టవల్ తడిపి మిసెస్ లాల్ ఒళ్ళంతా తుడుస్తోంది.

డాక్టర్ ఘోష్ సిజర్స్, కత్తులు, ఫోర్‌సిప్స్, స్టెరిలైజ్ చేస్తున్నాడు.

చున్నీలాల్ క్రిందకు దిగి ట్రక్కుకు ఆనుకొని ముఖానికి పట్టిన చెమటలు తుడుచుకొంటున్నాడు.

టైము చూసుకొన్నాను. ఎనిమిదిన్నర కావస్తోంది.

ట్రక్‌లో వున్నవాళ్ళు తప్ప మిగిలినవాళ్ళు రెండుమూడు గుంపులుగా కూర్చొని మాట్లాడుకొంటున్నారు.

నేను ట్రక్ బాడీ నీడలో ఇసుకలో కూలబడ్డాను. మిసెస్ లాల్ మూలుగులు వినిపించడంలేదు. బహుశా ఎనెస్తీషియా ఇచ్చివుండాలి. పి. యస్. రావు నా దగ్గరికి వచ్చి ప్రక్కనే కూలబడ్డాడు.

"మిష్టర్ సురేష్! ఆపరేషన్ సక్సెస్ అయినా మనం వెంటనే ఇక్కడినుండి కదలడానికి వీలవదనుకొంటాను" అన్నాడు నర్వస్‌గా నావైపు చూస్తూ.

నిజమే! ఆ విషయం అంతవరకూ తట్టలేదు నాకు.

అప్పుడే మేజర్ ఆపరేషన్ చేసిన మనిషిని ఆ ట్రక్కులో తీసుకెళ్ళడం ప్రమాదం. ట్రక్ కదలికకు శరీరంలో భాగాలన్నీ కదలి వేసినకుట్లు విడిపోయే ప్రమాదంవుంది. అవునన్నట్లు తలవూపాను.

"మరి ఏం చేద్దామని అనుకొంటున్నారు?" నా ముఖాన్నే పరీక్షగా చూస్తూ అడిగాడు.

నేను చిత్రంగా భుజాలెగురేశాను. "కొంతమంది వెనక్కి వుండిపోవాలనుకుంటాను, ముందు మేము వెళ్ళి సహాయం తెచ్చేవరకు" చెప్పాను.

అంతలో ఏదో చప్పుడు వినిపించింది. గిరగిర తిరిగే బ్లేడ్స్ గాలిని కోస్తున్న చప్పుడు. హెలికాప్టర్ ఎగురుతున్నప్పుడు వినబడే శబ్దం.

చటుక్కున లేచి నిలబడి శబ్దం వస్తున్నవైపు ఆకాశంలోకి చూశాను.

పడమటి దిక్కునుండి ఓ హెలీకాప్టర్ గజేంద్రుణ్ణి రక్షించే విష్ణుమూర్తి వాహనంలా మావైపు వస్తోంది.

చిట్టచివరికి దేవుడు మా ప్రార్థన విన్నట్లున్నాడు. విమానం కాలిపోయే ముందు మేం ప్రసారంచేసిన మెసేజ్ అధికారులకు అందినట్లుంది. ఆనందంతో ఎగురుతూ గంతులు వేయాలనిపించింది.

# 11

అందరూ ఒక్క ఉదుటున లేచి క్రిందకు దిగుతోన్న హెలీకాప్టర్ వైపు పరుగుపెట్టారు.

యఫ్. హెచ్. 1100 యుటిలిటీ హెలీకాప్టర్ అది. క్రిందకు దిగుతోన్న హెలీకాప్టర్ మీద 'పి. ఎ.' అన్న అక్షరాలుచూసి పరిగెత్తే వాణ్ణల్లా చటుక్కున ఆగిపోయాను.

'పి. ఎ' అన్న మాటలకు పాకిస్థాన్ ఆర్మీ అని అర్థం. ఒక్కసారి గుండె ఝల్లుమంది.

నా కళ్ళను నమ్మలేనట్లు అలాగే చూస్తూ వుండిపోయాను.

అందరూ ట్రక్కుకు కాస్త దూరంలో భూమికి పదడుగుల ఎత్తులో గాలిలో అటూ ఇటూ వూగుతూ క్రిందకు దిగుతోన్న హెలీకాప్టర్ ను చూసి ఆనందంతో కేకలు వేస్తున్నారు. హెలీకాప్టర్ బ్లేడ్స్ ప్రొపల్షన్ వల్ల ఇసుక దుమారంలా లేస్తోంది.

ఢాం!!! పిస్తోలు పేలిన శబ్దం!

హెలీకాప్టర్ క్రిందకు దిగగానే వినబడిన శబ్దానికి అందరూ అరుపులు ఆపి ఒక్కక్షణం తలలు త్రిప్పి వెనక్కు తిరిగారు.

చాంద్ సింగ్ చేతిలో పిస్తోలు జనంమీదకు గురిపెట్టబడి వుంది. అతని ప్రక్కనే చార్లెస్ ఫెర్రిరా నవ్వుతూ నిలబడివున్నాడు. ఇద్దరి మెడలచుట్టూ నల్లని మఫ్లర్లు వేలాడుతోన్నయ్.

అందరూ మంత్రించబడిన మనుషులకుమల్లే వాళ్ళిద్దరి వంకా చూస్తూ వుండిపోయారు. వాళ్ళకు మాకు మధ్య కనీసం ఆరేడు గజాలైనా దూరం వుంటుంది.

సో! దీసార్ ది మర్డరర్స్! వీళ్ళేనన్నమాట హంతకులు! దేనికీ దౌర్జన్యం?

"డోన్ట్ మూవ్ మైడియర్ ఫ్రెండ్స్! ఎవరైనా పిచ్చి ప్రయత్నాలుచేస్తే కాల్చి చంపడానికి వెనుకాడనని మరచిపోకండి."

చాంద్ సింగ్ కంఠంలో కరుకుదనానికి ఒక్కక్షణం ఒళ్లు జలదరించింది.

వెనక హెలీకాప్టర్ తలుపు తెరచిన చప్పుడయింది.

"కవర్ దెమ్!" అన్నాడు ఫెర్రిరా ఎవర్నో ఉద్దేశించి.

ఎవరో తుపాకిబోల్టు తెరచిమూసిన శబ్దమయింది.

మెల్లిగా తలత్రిప్పి వెనక్కు చూశాను. ఖాకీ యూనిఫారమ్‌లోవున్న ఇద్దరు వ్యక్తులు సబ్ మెషిన్ పిస్టల్స్ మామీద గురిచేసి నిలబడివున్నారు.

తలమీద టోపీలు, భుజాలమీద ఏరకమైన గుర్తులు లేకపోయినా, వాళ్లు పాక్ ఆర్మీకి చెందిన వాళ్ళని చెప్ప డానికి ఆ ఖాకీ యూనిఫామ్ చాలు.

తలత్రిప్పి మళ్ళీ చాంద్ సింగ్ వంక చూశాను. ఈ

హఠాత్ సంఘటనకు బుర్ర పనిచెయ్యడం మానేసింది.

"వాడిచేతిలో పిస్తోలు సర్వీస్ పిస్తోలు. బహుశా పెలట్ దగ్గరనుండి లాక్కొని వుంటాడు" అన్నాడు రావ్ పెదిమల చివరినుండి.

చాంద్ సింగ్ మా అందరివంకా నవ్వుతూ చూశాడు. అతని కళ్లుమాత్రం నల్లరాతి ముక్కల్లా అతికఠినంగా కనిపిస్తోన్నయ్.

"దయచేసి అందరూ వరసగా నిలబడండి" చాంద్ సింగ్ గొంతు మిలటరీ ఆఫీసరు గొంతులావుంది.

"వాటీస్ దిస్ నాన్ సెన్స్ మిష్టర్ సింగ్" అంటున్నాడు మెహ్రా.

"షటప్! డూ వాట్ ఐ సే!" అరిచాడు చాంద్ సింగ్.

అందరూ అతని పిస్తోలువంకే భయంగా చూస్తూ వరసగా ఒకరిప్రక్క ఒకరు నిలబడ్డారు. చాంద్ సింగ్ మావంక ఓసారిచూసి తలాడించాడు. నాకు అంతా అయోమయంగా వుంది.

"వెరీగుడ్! ఇప్పుడు అసలు విషయానికొద్దాం. ఓ. యస్. ఫార్ములా కాగితాలు మీలో ఎవరిదగ్గరున్నయ్?" అన్నాడు అందరివంకా పరీక్షగా చూస్తూ.

అందరూ గుడ్లప్పగించి వాళ్ళవేపే చూస్తున్నారు. దట్సిట్. ఓ. యస్. ఫార్ములా కాగితాలకోసం ప్లేన్ను హైజాక్ చేసారన్న మాట. అంటే ఇక్కడవున్న తొమ్మిదిమంది ప్రయాణీకుల్లో ఎవరిదగ్గరో ఆ ఫార్ములా కాగితాలున్నాయి. ఏమిటా ఓ. యస్. ఫార్ములా?

చాంద్ సింగ్ వైపే చూస్తున్న నేను ఒక్కక్షణం నిలుచున్నపాటునే బిగుసుకుపోయాను.

ట్రక్కులోపల డాక్టర్ ఘోష్, కామినీలతోపాటు షేర్ ఖాన్ కూడా వున్నాడు. ట్రక్కుకు మాకు మధ్య

చాంద్ సింగ్, ఫెర్రిరాలు నిలబడివున్నారు.

ట్రక్కుకు కట్టిన టార్పాలిన్ మధ్యనుండి చాంద్ సింగ్ మీదకు దూకపోతున్న షేర్ ఖాన్ ను చూడగానే ఒక్క క్షణం గుండె కొట్టుకోడం మానేసింది.

ఫెర్రిరా నా చూపు గమనించి వుండాలి. తలత్రిప్పి చూసి ఒక్కసారి అర్చాడు.

"వాచవుట్ దేశాయ్!"

చాంద్ సింగ్ మెరుపులా వెనక్కు తిరిగి పిస్తోలు పేల్చాడు.

ట్రక్ లోనుండి మీదికి దూకబోతున్న షేర్ ఖాన్ చిన్నగా అరచి దబ్బున యిసుకలో పడిపోయాడు. అతని తొడమీద బుల్లెట్ చేసిన గాయంలోనుండి రక్తం రివ్వున చిమ్మింది.

"టేక్ కేరాఫ్ హిమ్ జైస్వాల్!" అన్నాడు క్రూరంగా నవ్వుతూ మావైపు తిరిగి.

వీళ్ళ అసలు పేర్లు చాంద్ సింగ్, చార్లెస్ ఫెర్రిరాలు కావన్నమాట. చాంద్ సింగ్ పేరు దేశాయ్ అని, ఫెర్రిరా పేరు జైస్వాల్ అని వాళ్ళు పిల్చుకున్న దాన్నిబట్టి అర్థమయింది.

జైస్వాల్ షేర్ ఖాన్ ను యీడ్చుకొచ్చి మాముందు పారేశాడు. మిస్. కామినినికూడా వరసలో నిలబెట్టాడు. ఎందుకో డాక్టర్ ఖాన్ ను మాత్రం తీసుకురాలేదు.

"నౌ, టెల్ మి! ఫార్ములా ఎవరి దగ్గర వుంది. ఆ ఫార్ములా ఇచ్చేస్తే ఎవరిదారిన్న వాళ్లు వెళ్ళిపోవచ్చు మీకు తొందర్లో ఎవరినించి సహాయం వచ్చేదారిలేదు. చెప్పకపోతే అందర్నీ వరసపెట్టి కాల్చి చంపేస్తాను.'.

దేశాయ్ కంఠంలో కఠినత్వం ఎలాంటి ధైర్యవంతుడికైనా వణుకు పుట్టిస్తుంది.

ఎవ్వరూ మాట్లాడలేదు. అంతా రాళ్ళనుళ్ళే నిలబడ్డ ఆ దుండగులవంకే గుడ్లప్పగించి చూస్తున్నారు.

"ఆల్ రైట్! ఒక్క నిమిషం టైమిస్తున్నాను. ఆలోగా ఆ ఫార్ములా బయట పడకపోతే కుడిప్రక్క నుండి మొదటివ్యక్తి కాలులో ఈ పిస్తోలు గుండు వుంటుంది" అరిచాడు దేశాయ్.

అందరం అప్రయత్నంగా కుడిప్రక్కకు చూశాము. అందరికంటూ చివర అబ్దుల్ గఫూర్ నిలబడి వున్నాడు. గఫూర్ ముఖంమీద చెమట ధారలుగా కారుతోంది.

దేశాయ్ చేతిగడియారంవైపు తీక్షణంగా చూస్తూ నిలబడ్డాడు. చకచకా సెకన్లు దొర్లిపోతున్నాయ్.

ఎటూ పారిపోయే అవకాశంలేదు. ఈ ఎడారిలో ఎటూ తప్పించుకుపోలేము. అందరూ ఊపిరి బిగబట్టి వాళ్ళిద్దర్నే చూస్తున్నారు.

హఠాత్తుగా దేశాయ్ పిస్తోలు గఫూర్వైపు గురి పెట్టాడు.

"ఒన్ మినిట్ యీజ్ ఓవర్!"

ఎవ్వరూ మాట్లాడలేదు. మరుక్షణం పిస్తోలు పేల్చిన శబ్దం చెవులు చిల్లులుపడేలా చేసింది.

అబ్దుల్ గఫూర్ పెద్దగా కేకపెట్టి నిలబడ్డచోట కూల బడిపోయాడు.

గుండెల్లో బాధ, అసహాయతా, కోపం సుళ్లు తిరగ సాగాయి.

"యూ హార్ట్‌లెస్ బాస్టర్డ్! స్టాపిట్!! ఫర్ గాడ్స్ సేక్ స్టాపిట్!" అరిచాను పిచ్చాళ్ళా.

దేశాయ్ క్రూరంగా నవ్వాడు. "గో సురేష్! ఆ కాగితాలు ఇచ్చెయ్యమని వాళ్ళకు చెప్పు. అప్పుడు అందరికీ ఈ బాధ తప్పుతుంది. లేకపోతే అందర్నీ వరుసగా

చిత్రవధ చేస్తాను."

"ఆల్ గ్రైట్ ఏమిటా ఫార్ములా?" అడిగాను.

గుండు దెబ్బతిన్న షేర్‌ఖాన్ మూలుగుతున్నాడు. అబ్దుల్ గఫార్‌కు స్పృహపోయినట్లుంది షాక్ వల్ల.

"ఓ.. యస్. ఫార్ములా కాగితాలు. సబ్‌స్టిట్యూట్ ఫార్ములా. పెట్రోలుకు బదులు ఇంధనంగా వాడ్డానికి చవగ్గా తయారుచేయగల రసాయనం ఫార్ములా. ఈ విమానంలో ప్రయాణంచేస్తున్న వాళ్ళలో ఒకరిదగ్గర వున్నట్లు మాకు తెలిసింది. ఆ రసాయనాన్ని ఓ ఇండియన్ సైంటిస్ట్ కనుక్కొన్నాడు. ఆ ఫార్ములాని విమానంలో బొంబాయి దగ్గర టెక్నికల్ లాబ్‌కు పంపుతున్నట్లు తెలిసింది. ప్రయాణీకుల్లో ఎవరో ఒకరు ఆ ఫార్ములా తీసుకెళుతున్నారు. త్వరగా ఆ కాగితాలు మాకిస్తే మీకు, మాకు శ్రమతగ్గుతుంది."

మెగాడ్! పెట్రోలుకు బదులుగా ఇంధనంగా వుపయోగపడే కెమికల్! ఈ సైంటిఫిక్ డిస్కవరీగాని బయటపడితే ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోనే గొప్ప మార్పు వస్తుంది.

"అయితే ఈ ఎడారిలో విమానాన్ని ఎందుకు దింపారు?" పి. యస్. రావు కంఠంలో జిల్లా అధికారి వుండాల్సిన హోదా లేదు.

"జస్ట్ అవర్ బేడ్ లక్! విమానాన్ని హైజాక్ చేసి బార్డర్ అవతల పాకిస్తాన్‌లో దింపి, మా పని పూర్తి చేసుకోవాలని మా ప్లాను. కాని హైజాక్ చేసిం తరువాత మధ్యలో ఈ ఇసుక తుఫాను అడ్డొచ్చింది. ఇసుక ఇంజన్లలో దూరి ఇంజన్ పాడయింది. బోర్డర్ దాటి అవతలకు వెళ్ళే అవకాశం లేదు. అంచేత ఈ ఎడారిలో తప్పనిసరిగా లాండింగ్ చేశాను."

"చేశాను అంటున్నావు?"

"అవును నేనే లాండింగ్ చేశాను. పైలెట్లను బెదిరించడానికి మా దగ్గర ఆయుధాలు లేవు. అంచేత వాళ్ళు కూడా స్పృహ పోగొట్టి, విమానం కంట్రోల్ లోకి తీసుకొన్నాము. కాని భారత భూభాగంలో దిగిం తరువాత వాళ్ళు బ్రతికుండడం మాకు ప్రమాదం. స్పృహ పోగొట్టేముందు వాళ్ళు మమ్మల్ని చూశారు. అలాగే ఎయిర్ హోస్టెస్ కూడా, అందరికన్నా ముందు స్పృహ లోకి వచ్చి మమ్మల్ని చూసింది."

అందరూ చెవులప్పగించి వింటూ వుండిపోయారు.

"మేట్! ఆలస్యం అయిపోయింది" అరిచాడు హెలికాప్టర్ పైలెట్.

"రైటో! ఇక ఆ ఫార్ములా ఇస్తే మా దారిన మేం పోతాం ... లేకపోతే ఈ సారి మరొకరి గుండెల్లో బుల్లెట్ దూరుతుంది" అన్నాడు పిస్తోలు పైకెత్తి గురి పెడుతూ.

దేశాయ్ అన్నంత పనీ చేస్తాడనడంలో సందేహం లేదు.

"కాంట్ యూసీ రీజన్!" అరిచాను... "మనుషుల ప్రాణాలకన్నా మీకు ఫార్ములా ఎక్కువా? దయ చేసి ఆ ఫార్ములా వాళ్ళకిచ్చేయండి."

ఎవ్వరూ మాట్లాడలేదు.

"డామ్ యువర్ ఇంటిలిజన్స్! సీక్రెట్స్ లీక్ కాకుండా చూసుకోవాలి. ఈ స్థితికి వచ్చాక మీ గురించి అందరి ప్రాణాలు పోగొట్టడం అవివేకం. ఎవరి దగ్గర వున్నా య్యో దయచేసి ఇచ్చెయ్యండి" అరిచాడు చంచల్ బోస్.

ఒక్కొక్కళ్ళని వెతికి ఎందుకు తీసుకోవడంలేదో అర్థంకాలేదు నాకు. బహుశా మామూలుగా గుర్తుపట్ట

డానికి వీల్లేకుండా వుండివుండాలి ఆ ఫార్ములా.

ఆ ఫార్ములా దాస్తున్న వ్యక్తి స్థితి అర్థంచేసుకోగలను. కర్తవ్యానికి, మానవత్వానికి అతని మనసులో జరుగుతోన్న సంఘర్షణ వూహించుకోగలను.

మిస్. కామినీ సర్కార్ మీదకు పిస్తోలు గురి చేసి ట్రిగర్ మీద వేలు పెట్టాడు దేశాయ్.

"ఆల్ రైట్! ఇస్తాను!" అన్నారెవరో.

అందరూ అటు చూశారు.

గోపాల్ పంధు ఒకడుగు ముందుకు వేసి నిలబడ్డాడు.

అది వరకెప్పుడు సీక్రెట్ ఏజంటును చూడలేదు నేను. ఇంత సామాన్యంగా వుంటాడా అనిపించింది. ఒక్క క్షణం రిలీఫ్‌గా ఊపిరి పీల్చాను.

దేశాయ్ పిస్తోలును గోపాల్ మీదకు గురిపెట్టాడు. "గుడ్! ఇలా ఇవ్వు!"

గోపాల్ పంధు జేబులోంచి మెల్లిగా మనీపర్సుతీశాడు. తెరచి ఓ పదిరూపాయల కట్ట దేశాయ్ కాళ్ళ ముందు పడేలా విసిరేశాడు. ఓ పదో, ఇరవయ్యో నోట్లుండొచ్చు.

"వాటీజ్ దిస్?" అన్నాడు దేశాయ్ నోట్ల వంక నొసలు చిట్లించి చూస్తూ.

"నోట్లమధ్య తెల్లని భాగంలో 'ఇన్ విసిబుల్ ఇంక్'లో వ్రాసి వుంది ఫార్ములా. లైటర్‌తో వేడి చేయి అక్షరాలు కనిపిస్తాయి."

దేశాయ్, ఫెర్రిరాకు సైగచేశాడు. ఫెర్రిరా లైటర్ తీసి ఒక నోటును వేడిచేశాడు. నోటులో తెల్లని భాగం మీద చిన్నచిన్న అంకెలు, గుర్తులు కనిపించసాగినయ్.

దేశాయ్ నవ్వి తలవూపి "థాంక్స్ ఫ్రెండ్"అన్నాడు ఒక్కొక్క అడుగే జాగ్రత్తగా హెలీకాప్టర్ వైపు వేస్తూ.

వెళ్ళే ముందు ఎవరైనా అడ్డుపడతారని జాగ్రత్త పడుతున్నాడన్నమాట. అందరూ ట్రక్ ప్రక్కనే గుంపుగా కూర్చున్నాం.

ట్రక్ లోపల డాక్టర్ ఘోష్ ఒక్కడే ఆపరేషన్ చేస్తున్నాడని తెలుసు. మిసెస్ లాల్ బలంగా శ్వాస పీలుస్తున్న చప్పుడు వినిపిస్తోంది.

మనసులోనే డాక్టర్ ఘోష్‌కు నమస్కారం చేశాను. ఒక ప్రక్క ప్రాణాలు పోతోంటే మరో ప్రక్క క్రొత్త ప్రాణిని బయటికి తెచ్చే ప్రయత్నంలో అచంచలంగా మునిగిపోయాడు డాక్టర్ ఘోష్. అంచేత డాక్టర్ ఘోష్‌ను బయటికి లాగలేదేమో వాళ్లు.

# 12

జైస్వాల్, దేశాయ్, ఇద్దరూ హెలికాప్టర్ లోకి ఎక్కి కూర్చున్నారు.

దేశాయ్ బయటికి వంగి కాకీ యూనిఫాం మనుషులకు ఏదో చెప్పాడు. వాళ్ళు తల వూపి మిషిన్ పిస్టల్స్ మా వైపు తిప్పారు.

మై గాడ్! పనిపూర్తయింతరువాత నిర్దాక్షిణ్యంగా అందర్నీ చంపేస్తున్నాడు దేశాయ్.

"వాచవుట్! వాళ్లు ఫైర్ చేస్తున్నారు!" అన్నాను ఎగిరి నిలబడి ట్రక్కు వెనక్కి పరిగెడుతూ...

టపటప మెషిన్ పిస్టల్ ప్రేలిన శబ్దం వినిపించింది. గుంపుగా వున్న అందరూ చెల్లాచెదరయ్యారు. ఎవరో గట్టిగా అరచిన శబ్దం...

కామినీసర్కార్, విసూ చక్రవర్తి ట్రక్ వెనకాలకు పరిగెత్తుకొచ్చారు. చంచల్ బోస్, గోపాల్ ట్రక్ క్రింద నుండి దొర్లుకొంటూ ఇవతలకొచ్చారు.

మళ్ళీ పిస్టల్ పేల్చిన శబ్దం...

పిస్తోలు శబ్దంతోపాటు ఎక్కడో దూరంగా మరో శబ్దం. మేఘం ఆగకుండా ఉరిమినట్లు వస్తోంది శబ్దం.

హెలీకాప్టర్ కదులుతుందేమో ననుకొన్నాను. కాదు. క్రిందగా ఎగురుతూ వస్తున్న రెండు జట్ విమానాలు చేసే శబ్దం అది. ప్రక్కలమ్మట ఇండియన్ ఎయిర్ ఫోర్స్ గుర్తులు కనిపిస్తున్నాయి.

జోధ్‌పూర్ స్టేషన్ వేవ్ లెంగ్తుమీద మేము రాత్రి ప్రసారంచేసిన మెసేజ్ ఎవరో శ్రోత విని మర్నాడు ప్రొద్దున్న అధికారులకు తెలియచేశాడు అని తర్వాత తెలిసింది.

ఒక్క గంటముందు అధికారులకు ఆ వార్త తెలిస్తే నాలుగు ప్రాణాలను రక్షించి వుండేవాళ్లు.

హెలీకాప్టర్ హడావిడిగా పైకిలేచి పడమటి దిక్కుకు ఎగిరిపోసాగింది.

దూరంగా ఆకాశంలో ఏదో పెద్దశబ్దం వినిపించింది.

అంతే! యఫ్. హెచ్. 1100 హెలీకాప్టర్ మంటల్లో మండుతూ నల్లని పొగలు చిమ్ముతూ తల్లక్రిందులుగా క్రిందకు పడిపోయింది.

ట్రక్‌లోనుండి కవ్వున పసిపిల్ల ఏడ్చిన శబ్దం వినిపించింది.

సన్నని మందహాసం నా పెదిమలమీద మెరిసింది. ప్రపంచానికి మరో ప్రాణి. డాక్టర్ ఘోష్‌కు మరో విజయం. లేచి ఉత్సాహంతో ట్రక్ వెనక్కు నడిచాను.

—: ఐ పో యి ం ది :—

# ఫ్యామిలీ డాక్టర్

## సుజనశ్రీ

డాక్టర్ నిరంజనరావు డిస్పెన్సరీ తలుపు తాళంవేసి 'సువేగా' స్కూటరు స్టార్ట్ చేశాడు.

ఇవాళ ఎందుకో అతడు చాల నిరుత్సాహంగా ఉన్నాడు. గత మూడునాలుగు రోజులనుంచి అతడి డిస్పెన్సరీకి ఒక్క పేషెంటన్నా రాలేదు.

స్కూటర్‌కి తాళంవేసి బార్‌లోకి నడిచాడు. ఒక మూలగా ఖాళీగావున్న టేబుల్ వెనుక్కని అక్కడ కూలబడ్డాడు.

"బ్రాండీ! సోడా! చిప్స్!"

"యస్ సర్!" అంటూ అతివినయంగా సలాంచేసి వెళ్ళిపోయాడు వెయిటర్.

బాక్స్‌లోనుంచి పాశ్చాత్య సంగీతం నెమ్మదిగా స్ప్రెడందుకుంటోంది.

వెయిటర్ వినయాన్ని చూసిన నిరంజనరావు డబ్బులోనే ఉన్నది మహాత్యం అంతా అనుకుని నిట్టూర్చాడు. ప్రపంచంలోని సర్వసుఖాలనూ తనచుట్టూ త్రిప్పగలిగే మంత్రదండం డబ్బు!

వెయిటర్ తెచ్చిన వాటిని మెల్లగా సేవిస్తూ మ్యూజిక్‌కి లయగా చేతివ్రేళ్లు ఆడిస్తూ సముద్రంలోని కెరటాల్లా ఆలోచనా కెరటాల్లో మునిగి తేలుతూన్నాడు. అతడి మనస్సు గతంలోకి ప్రయాణించింది.

నిరంజనరావుని అతని స్నేహితులు నిరంజన్ రాయ్ లేదా డాక్టర్ రాయ్ అని మారుపేరుతో ముద్దుగా పిలిచేవారు మెడికల్ కాలేజీలో. అతని తండ్రి లాయరు. అతనికీ ప్రాక్టిస్ అంతంత మాత్రంగానే ఉండేది. సంపాదనకూ ఖర్చుకు బొటాబొటిగా సరిపోతుండేది.

తను ఎటూ తన స్వంతశక్తి మీద ధనవంతుడు కాలేక పోయాడు. కనీసం తన కొడుకన్నా సంపాదనపరుడై లక్షలు ఆర్జించాలన్న ఆశయంతో, ముందు చూపుతో అనేక కష్టాలకు ఓర్చి తనకొడుకుని యం. బి. బి. యస్. చదివించాడు నిరంజనరావు తండ్రి.

నిరంజనరావు తండ్రి, కొడుకు పెళ్ళిచేయకుండానే గతించాడు. ప్లీడరైన తండ్రీ, డాక్టరైన కొడుకూ ఇద్దరూ దరిద్రదేవతకరాళ హస్తాల్లోంచి బయటపడలేకపోయారు.

పైవేటు ప్రాక్టీసులో లక్షలకు లక్షలు ఆర్జించవచ్చనే ఆశతో, ఆశయంతో అతడు ప్రభుత్వ నౌకరీని కాదని తిరస్కరించాడు. కాని, ప్రాక్టీసు అనుకున్న విధంగా సాగటంలేదు.

జీవితంలో అనుకున్నది సాధించలేక పోయాననే

విరక్తితో అతడు బ్రహ్మచారిగానే మిగిలిపోయాడు. తండ్రినుంచి సంక్రమించిన ఇల్లు వుంది. అందులోనే ముందుప్రక్క డిస్పెన్సరీ, వెనక పోర్షన్ తన నివాసానికి ఏర్పరచుకున్నాడు.

ఐదు రోజులక్రితం కాబోలు ఇద్దరు పేషెంట్లుమాత్రం వచ్చారు. ఆ తర్వాత మళ్ళీ ఎవరూ రాలేదు.

పోనీ ఎవరయినా అందమైన ఐశ్వర్యం కలిగిన విడో, భర్తృవిహీన రెండో వివాహానికి మారు మనువుకి దారికినా చేసుకుందామని పేపర్లలో మేట్రిమోనియల్ కాలమ్స్ వాడికి ప్రపోజల్స్ పంపాడు. కాని అతడి దురదృష్టమేమో అవీ కలిసిరాలేదు ఏ ఒక్కటీ.

ఆలోచనల్లోంచి తేరుకుని టైమ్ చూసుకున్నాడు.

రాత్రి పదయింది.

రెండో ఆట సినిమాకయినా పోదామని బేరర్ ట్రేలో బిల్లూ, టిప్ పడేసి నిర్లక్ష్యంగా లేచాడు.

బార్లోంచి బయటకు వస్తుండగా అతడికి ఒక జంట ఎదురుపడ్డారు. చూట్టానికి ఎంతో ముచ్చటైన జంటగా కనబడ్డారు. ఐశ్వర్యవంతుల్లాగ ఉన్నారు. ఆ వ్యక్తి ఎంత అదృష్టవంతుడోగదా అని మనసంతా అసూయ నింపుకుని స్కూటర్ తాళం తీశాడు.

వెనకనుంచి 'బాయ్' పరుగెత్తుకొచ్చాడు.

నిరంజనరావు కంగారుపడ్డాడు, తను బిల్లు సరిగా చెల్లించలేదా ఏమిటి, లేకపోతే తనవెనుకే వాడెందుకు పరుగెత్తుకొస్తాడు అనుకున్నాడు.

"సార్! సార్! మిమ్మల్ని ఆ సార్ పిలుస్తున్నారు సార్?" అన్నాడు బేరర్.

"ఎవరు?" సందేహంగా అడిగాడు మళ్ళీ.

"అదేసార్! అమ్మగార్ని వెంటపెట్టుకుని ఇప్పుడే

లోపలకు వచ్చారుగదా! వాట్ సార్!"

తనను తానే నమ్మలేనట్టుగా అతడు స్కూటర్ లాక్ చేసి మళ్ళీ లోపలకు నడిచాడు. తనను రమ్మన్న వ్యక్తి తప్పకుండా పొరబడి ఉంటాడు. తన్ను చూసి ఎవరో తన ఫ్రెండని భ్రమపడి ఉంటాడు. పూర్ ఫెలో!

అయినా వెళ్ళి వచ్చినందువల్ల తప్పేంలేదు గదా! బెదిబై! అతని ప్రక్కనవున్న అందాలరాసిని మరోసారి చూడవచ్చుగదా అన్నఆశతో వాళ్ళుకూర్చున్న టేబుల్ దగ్గరకు వెళ్ళాడు.

## 2

"హల్లో మిస్టర్ రాయ్! ఎన్నాళ్ళకెన్నాళ్ళకూ? హౌఆర్ యూ?" అంటూ ఆ వ్యక్తి తనవంకే చూస్తూ అన్నాడు.

నిరంజనరావు ఉలిక్కిపడ్డాడు.

తనను రాయ్ అనిపిలిచే వారెవ్వరూ లేరు. తను స్టూడెంట్ గా ఉన్నప్పుడు తనకు మారుపేరు అది! అయితే ఇతగాడు కాలేజిమేట్ అయియుండాలి అనుకున్నాడు, అతడ్ని గుర్తుకు తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ.

"నన్ను గుర్తుపట్టలేదా? అవున్లే! మనం విడిపోయి పదేళ్ళకుపైగా అయివుంటుంది. నేను! రాఘవరావ్ ని!" అన్నాడు అతడు.

కుర్చీలాగి వాళ్ళమధ్యలో కూర్చున్నాడు. తన కెదురుగా అందాలరాసి కూర్చుని ఉంది. ఎడమచేతి ప్రక్కగా రాఘవ కూర్చుని ఉన్నాడు.

"ఓ! రాఘవా! నిన్ను గుర్తుపట్టలేకపోయాను సుమీ!" చివరకు అన్నాడు నిరంజనరావ్.

"సుజీ! మీట్ మై క్లాస్ మేట్! డాక్టర్ నిరంజన

రావ్? ఈమె నా ఫ్రెండ్! మిసెస్ సుజాతా కమలా కరం!'' అంటూ ఇద్దర్నీ పరిచయం చేశాడు రాఘవ.

నిరంజన్‌రావ్ వేపు తన చేయి చాపింది సుజాత. "గ్లాడ్ టూ మీట్ యూ!'' అంటూ కరచాలనం చేసింది.

ఆమె చిరునవ్వు అతనిమీద వెన్నెలలు కురిపించి నట్లయింది.

"అన్నట్టు లోగడ నీ వెక్కడో మేజిస్ట్రేట్ పని చేస్తున్నావని చెప్పాడే మీ నాన్న!''

"అది చాలాకాలం క్రితం మాటం డాక్టర్! మా తండ్రిగారు చాలాకాలం క్రిందటే గతించారు. అప్పుడే మేజిస్ట్రేట్ పదవికి రాజీనామా ఇచ్చేశాను. ఇప్పుడు ప్రైవేట్, ప్రాక్టీసు చేస్తున్నాను!''

"సివిలా క్రిమినలా?''

"మొదట్లో సివిల్ కేసులే చూస్తుండేవాణ్ని. రాను రాను క్రిమినల్ కేసుల్లోనే ఎక్కువ లాభించటం వల్ల ఇప్పుడు క్రిమినల్ లాయర్నే అని చెప్పుకోవాలి! సుజీ! వీడూ నేనూ చిన్నప్పుడు స్కూల్‌లో స్నేహితులమే కాదు! వాళ్ళనాన్న మా నాన్నగూడా మంచి స్నేహితులు!''

"ఐసీ!'' అంది సుజాత సిగరెట్ వెలిగిస్తూ.

"అన్నట్టు నీ ప్రాక్టీసు ఎలా వుంది! ఆ పాత ఇంట్లో నేనా ఉండటం! పెళ్ళి చేసుకున్నావా?''

"అదేమిటి? బయలుదేరబోతున్న రైలెక్కేవాడిలా అన్ని ప్రశ్నలూ ఒక్కేసారే వేస్తే ఎలా? వన్ బైవన్! మనం లీజర్లీగా మాట్లాడుకోవచ్చు! నేను వివాహం చేసుకోలేదు! ఐయామ్ స్టిల్ ఎ బాచిలర్!'' అన్నాడు నిరంజనరావు.

సుజాత సానుభూతి గా చూసింది. "ఆ దేం?" అనడిగింది.

నీలాంటి అందమైన వనిత దొరకలేదు! అని సమాధానం చెబుదామనుకున్నాడు. కాని ఎక్కువ పరిచయం లేని వ్యక్తితో అలా మాట్లాడితే తన ఫ్రెండ్ కి కోపం రావచ్చని ఆతడూరుకున్నాడు.

"ప్రాక్టీసు ఒక మాదిరిగా ఉంది. అదే ఇంట్లో నే ఉంటున్నాను. ముందువేపు డిస్పెన్సరీ, వెనుక పోర్షన్ రిసిడెన్స్!"

"దట్సాల్ రైట్ బోయ్! రేపే నిన్ను నీ డిస్పెన్సరీలో కలుస్తాను! ఫ్రెండ్లీ విజిట్ మాత్రమే! నీ పేషెంట్ గా మాత్రం కాదులే!" అని నవ్వాడు.

"యూ ఆర్ వెల్ కమ్! యూ టూ మేడమ్!" అంటూ అక్కడ్నుంచి లేచాడు నిరంజనరావు.

వాడి ప్రక్కన ఉన్న స్త్రీ ఎవరో ఆమె పూర్తి సమాచారం ఏమిటో రేపు వాడ్ని మరచిపోకుండా అడగాలి అనుకున్నాడు స్కూటర్ స్టార్ట్ చేస్తూ.

అసలు రాఘవ మొదటినుంచీ చురుకైనవాడు. ఆడపిల్లలతో స్నేహం అంటే వాడికి మంచి నీళ్ళప్రాయం. ఎటువంటి పొగరుబోతు స్త్రీతోనైనా ఇట్టే మాట కలిపేసేవాడు.

రాఘవ ఇప్పటికైనా పెళ్ళి చేసుకున్నాడో లేదో! ప్రపంచంలో మగాడికి సుఖాన్నివ్వగల వస్తువుల్లో స్త్రీ గూడా ఒకటి అని వాడి అభిప్రాయం. అంతేకాదు, బెల్లంచుట్టూ చీమలు మూగినట్టు డబ్బున్న వాడి చుట్టూ ఆడవాళ్ళు మూగుతారని అనేవాడు.

అటువంటి అభిప్రాయాలున్నవాడు పెళ్ళిచేసుకుని ఒక స్త్రీ చేతిలో కీలుబొమ్మగా మారతాడా? తనకు నమ్మకం లేదు.

# 3

మర్నాడు పది గంటలకు రాఘవరావు డిస్పెన్సరీకి వచ్చాడు కారులో.

వీడి ప్రాక్టీస్ వెలిగిపోతూ వుండాలి అనుకున్నాడు ఆ కారు చూడగానే.

"ఏమిట్రోయ్! హాస్పిటల్ అంతా బోసిపోతూ ఉంది!" అన్నాడు రాఘవ డిస్పెన్సరీని కలయచూస్తూ.

రాఘవ తత్వం మొదటినుంచీ అంతే. ముందు కొంచెం బాధ కలిగేలా మాట్లాడినా తర్వాత తనవల్ల అయిన సాయం చేస్తాడు.

"లేదు లేరా! నీ వొస్తున్నావని పేషెంట్లెవరినీ రావద్దన్నాను. అంతే! అది సరే! నీవు పెళ్ళి చేసుకున్నావా? పిల్లలెంతమంది?" ఆత్రంగా అడిగాడు.

"అపరా నీ నాయనమ్మ ప్రశ్నలూ నువ్వూను! స్కూల్లో ఎట్లా వుండేవాడివో అచ్చం అవే మాటలూ అవే ఆలోచనలూ! డిగ్రీ వచ్చిందేమోగాని నీవు మాత్రం వీసమెత్తు మారలేదుసుమా! నేను పెళ్ళి చేసుకోలేదు. సరా?"

నిరంజనరావు తన పరిస్థితినీ వివరించాడు. తన ఆశయాలూ అన్నీ విపులంగా చెప్పాడు. తను జీవితంలో ఎలా అపజయాన్ని పొందాడో వివరించి చెప్పాడు.

"ఏమిట్రోరా! గడచిన జీవితమే హాయి అనిపిస్తూంది. నా పరిస్థితి ఇలానే ఇంకో రెండేళ్ళు ఉంటే ఏదో ఒక పాయిజన్ తిని చచ్చిపోవల్సిందేమో!"

"ఛా! ఏమిటిరా అంత నిరాశపడతావ్! జీవితంలో అందరికీ అవకాశాలు వెతుక్కుంటూ రావు. వాటికోసమే మనం వెతకాల్సి ఉంటుంది. ఆ అవకాశాల వెంట పరు

గత్తి అందుకోవాల్సి ఉంటుంది. నా ఉద్దేశ్యంలో నీకు అంతగా ప్రాక్టీసు రాకపోవడానికి కారణం! నీ డిస్పెన్సరీ చాల పాతకాలం నాటిదిలా ఉంది. దాన్ని మోడరన్ గా మార్చెయ్!”

“సరేలే! మింగ మెతుకు లేదు! మీసాలకు సంపెంగ నూనె! ఈ స్టెతస్కోప్ పాడయిపోయింది. అది కొత్తది కొందామంటేనే డబ్బులేదు!”

“మూడు! డబ్బులేదు, డబ్బులేదు అని బీద అరుపులు అరవకు! కావాలంటే నీకు ఇరవయి వేలు ఇస్తాను. అప్పుగానే అనుకో! డిస్పెన్సరీ రూపమే మార్చెయ్. నీ గీత మారిపోకపోతే నా తల తెగ్గొయ్యి!”

“ఏమిటీ? ఇరవయ్ వేలే! ఏదన్నా బ్యాంక్ కి డైరక్టరువా నువ్వు?” ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసి అడిగాడు నిరంజనరావు.

“అదంతా నీకెందుకు? ఇవాళ పదో తారీకు గదా? రేపు లేదు, ఎల్లుండి మా ఇంటికిరా! డబ్బు అరేంజ్ చేస్తాను! సరా? ఇదుగో నా అడ్రసు!” అంటూ రాఘవరావు తన జేబులోంచి విజిటింగ్ కార్డు తీసి టేబుల్ మీద పెట్టాడు.

“అది కాదురా!”

“అది కాదు! ఇది కాదు! నీ అనుమానాలన్నీ అవతలపెట్టెయ్. ఆపదలో ఇరుక్కున్నవాళ్ళని తప్పించి డబ్బు సంపాదించటమే నా వృత్తి. నీ విషయంలో అది ఎగ్జెంప్షన్. నిన్ను ఆపదల్లోంచి కాపాడటానికి నీకే డబ్బు ఇస్తాను సరా!”

“ఒరే రాఘవా! నువ్వు మనిషివి కాదురా! దేవుడివి! పదేళ్ళనాడు విడిపోయిన మనం ఈ రకంగా కలుసు

కోపటం నా అదృష్టం!'' అన్నాడు నిరంజనరావు ఆనందంతో.

# 4

సరిగ్గా పన్నెండో తారీకున డాక్టర్ నిరంజనరావు తన స్నేహితుడింకెళ్లాడు. రాఘవరావు ఆఫీసు ఎంతో నీట్‌గా ఉంది. పైగా అతగాడి రూమ్ ఏర్‌కండిషన్డ్ చెయ్యబడింది.

లాయరన్నవాడు ఆ మాత్రంగా ఉన్నాడంటే వాడి సంపాదన చెప్పకోదగినంతగా ఉందన్నమాట.

''కమాన్ డాక్టర్! పంక్చువల్‌గా వచ్చావ్!'' అన్నాడు రాఘవరావు కుర్చీ చూపిస్తూ.

''డాక్టర్లంకదా! ఆ మాత్రం టైమ్ ప్రకారం నడవక పోతే పేషెంట్లు కొందరు టిక్కెట్టు పుచ్చుకోగలరు'' నవ్వుతూ అన్నాడు నిరంజనరావు.

''మనం ఇప్పుడే బ్యాంక్‌కి వెడదాం! వన్ మినిట్'' అంటూ తన గుమాస్తాని కేకేసి ఏదో చెప్పబోయాడు రాఘవరావు.

''ఒరేయ్! నీకు నన్ను చూస్తే నవ్వులాటగా ఉందా? పర్సనల్ ష్యూరిటీ మీద ఏ బ్యాంక్ లోన్ ఇస్తుంది? ఉన్న ఇల్లేమో తాకట్టు బాకీలో ఉన్న విషయం నీకూ తెలుసుగదా!''

''నా హామీ మీద ఇప్పిస్తాను సరా! అంతే కాదు! నీ బాకీ త్వరలో తీర్చుకునేందుకు వీలుగా నీకు నలుగు రైదుగురు మాంఛి క్లయింట్స్‌ని కూడా అప్పజెబుతాను. ఆ దెబ్బతో నీవు చిన్న చిన్న పేషెంట్స్‌తో తిప్పలు పడక్కర్లేదు.''

నిరంజనరావు కళ్లు కృతజ్ఞతతో మెరిసాయి!

# 5

రాఘవరావు చేసిన సహాయంతో తన డిస్పెన్సరీని మోడరన్ గా తీర్చిదిద్దాడు నిరంజనరావు. కొన్నికొన్ని చిల్లర బాకీలు తీర్చుకున్నాడు.

డబ్బు ఇప్పించటమే కాదు, అతను చెప్పినట్టుగా మాంఛి ధనవంతుడికి ఫామిలీ డాక్టరుగా అయ్యే అవకాశం వచ్చింది.

అతడే కమలాకరం. కమలాకరం కోటీశ్వరుడు. స్వతహాగా వయసు చెల్లినవాడే అయినా పరువంలో ఉన్న అమ్మాయిని ముసలితనంలో పెళ్ళాడాడు. అతడికి ఎగుమతి, దిగుమతి వ్యాపారాలెన్నో ఉన్నయ్. ఆ మహానగరంలో ఓ పెద్ద హోటలుకి అతడు ఓనరు.

ఇవిగాక ఇంకా ఎన్నిరకాల వ్యాపారాలున్నయ్యో ఇతరులకు తెలీదు. అందరికీ తెలిసిందల్లా అతడికి నాలుగు కారులున్నయ్. పూర్తిగా ఎయిర్ కండిషన్డ్ చేయబడ్డ మూడంతస్థుల భవనం, అంతులేని ఐశ్వర్యం. అందమైన పడుచు పెళ్ళాం!

అతనో చిన్నసైజు కుబేరుడనవచ్చు.

అతగాడికి బ్లడ్ ప్రెషర్, గుండెపోటు ఇలాంటి ధనవంతులకు వచ్చే రోగాలున్నాయ్. అందుకని ప్రతిరోజూ అతన్ని పరీక్షించి ట్రీట్ మెంట్ ఇవ్వడానికి అతడికో ఫ్యామిలీ డాక్టరున్నాడు. అతడికీ బాగా వయసు ముదిరిపోయింది. అతడు విశ్రాంతికై రిటైర్ అవాలనుకోవటం వల్ల కమలాకరానికి మరో కొత్త డాక్టరు కావాల్సి వచ్చాడు.

రాఘవరావే నిరంజనరావుని పరిచయం చేశాడు.

"మాలాయర్ గారు మీగురించి ఎంతో ఇదిగా చెప్పారు.

అఫ్ కోర్స్! నేనూ మీ గురించి వాకబు చేశాననుకోండి!"
అన్నాడు కమలాకరం, నిరంజనరావుతో.

"పోనీ మీరెవరయినా హార్ట్ స్పెషలిస్టుని ఎందుకు నియమించుకోకూడదు?" అని అడిగాడు నిరంజనరావు అమాయకంగా.

'యూ ఫూల్! సిరిరా మోకాలొడ్డినట్లు నీకొచ్చిన అవకాశాన్ని మరెవరికో కట్టబెడతానంటావేం?' అన్నట్టు రాఘవరావు అతనివంక కొరకొర చూశాడు.

"స్పెషలిస్టు అవునా, కాదా అన్నదికాదు ముఖ్యం. మా ప్రాణం కోట్లవిలువ చేస్తుంది. అనేకమంది నేను ఎప్పుడు చచ్చిపోతానా అని కనిపెట్టుకు కూర్చుని ఉంటారు. అందువల్ల నా జాగ్రత్తలో నేనుండాలి. నాకు వైద్యం చేసేవాడు నమ్మకమయిన వాడుగా ఉండాలి. మీ గురించి చెడుగా నేను ఏమీ వినలేదు. అందుకే మీకు ఈ ఆఫర్!"

"థాంక్స్" చెప్పాడు నిరంజనరావు, మహదానందంతో.

ఆ రోజునుంచీ డాక్టర్ నిరంజనరావు, కమలాకరానికి ఫ్యామిలీ డాక్టరయ్యాడు.

"నీ కొత్త ఎప్పాయింట్ మెంట్ సందర్భాన్ని పురస్కరించుకుని రేపు సాయంత్రం హోటల్ సవేరాలో పార్టీ ఏర్పాటు చేస్తాను!" అన్నాడు రాఘవరావు.

"ఎవరెవరు అతిథులు?"

"ఇంకెవరూ? మన నలుగురమే! నువ్వూ, నేనూ, మిస్టర్ కమలాకరం, మిసెస్ కమలాకరం!"

చివరిపేరు విన్న తర్వాత నిరంజనరావులో ఉషారు వచ్చింది.

# 6

ట్రిమ్‌గా డ్రెస్ చేసుకుని మర్నాడు టైమ్‌కి సరిగ్గా హాజరయ్యాడు నిరంజనరావు.

రాఘవరావు, సుజాత ఇద్దరే ఎదురయ్యారు అక్కడ.

టేబుల్ ముందు మూడో కుర్చీని ఇవతలికిలాగి సుజాతకు ఎదురుగా కూర్చున్నాడు నిరంజనరావు. బ్రాందీ ఇచ్చే మత్తుకన్న, సుజాత కళ్ళల్లోకి చూస్తుంటే ఇంకా ఎక్కువ నిషా వచ్చేట్టుంది.

రాఘవరావే ఆర్డరిచ్చాడు.

"కమలాకరంగారు రాలేదా?" అని అడిగాడు నిరంజనరావు. తీరా అడిగేశాక ఎంత చవటప్రశ్న వేశానా అని నాలుక కొరుక్కున్నాడు.

"ఆయనేదో అర్జెంటు బిజినెస్‌మీద ఎక్కడికో వెళ్ళారు. ఆయన రాకపోవటం మీకేమన్నా డిసప్పాయింట్ అయిందా?" సుజాత అడిగింది.

"అబ్బే! లేదు! లేదు!"

"ఫర్ యువర్ హెల్త్!" అంటూ గ్లాసు సుజాత గ్లాసుని తాకించి నోటిదగ్గర పెట్టుకున్నాడు నిరంజనరావు.

"నా హెల్త్ బాగోలేకపోయినా ఫర్వాలేదు? అవున్నే! నీవు వాళ్ళ ఫ్యామిలీ డాక్టరువుగదా ఎంతైనా? ఏ గూటి చిలక ఆ గూటి పలుకులే పలుకుతుంది" రాఘవరావు అన్నాడు నవ్వుతూ.

సుజాత కిలకిల నవ్వింది.

గ్లాసు అంచులమీదుగా ఆమెవంకే చూస్తున్నాడు డాక్టర్.

కమలాకరం మనిషి ఎనుబోతులాగుంటాడు. అటువంటి వాడికి ఇంత అందమైన భార్య. బ్యూటీ అండ్ ది బీస్ట్

లాగ. నిజంగా కమలాకరం ఆడవాళ్ళని సెలెక్ట్ చెయ్యటంలో తన రసజ్ఞతను నిరూపించుకున్నాడు.

రాఘవరావు జోక్స్ వేస్తూ నవ్విస్తున్నాడు. సుజాత నవ్వుతోంది. ఆమె అందాన్ని కళ్ళతోనే త్రాగుతూ ఆ నిషాలో మధ్యమధ్యలో తనూ నవ్వుతున్నాడు రాఘవరావు జోక్స్‌కి.

జంటలు జంటలుగా ఫ్లోర్‌లోకి వెళ్ళి డాన్స్ చేస్తున్నారు మెంబర్లు. రాఘవరావు లేచి సుజాత వేపు చేయి జాపాడు. తన నాజూకైన చేతిని అతడికి అందించి తనూ లేచింది.

ఇద్దరూ ఫ్లోర్‌లోకి వెళ్ళారు. వాళ్ళిద్దరివంకే చూస్తూ గ్లాసులోని ద్రవాన్ని నెమ్మదిగా సిప్ చేస్తూ కూర్చున్నాడు. వాళ్ళిద్దరూ ఏవేవో సన్నగా మాట్లాడుకుంటున్నారు. మధ్యమధ్యలో నవ్వుతున్నారు.

రాఘవరావు వచ్చి మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు. సుజాతకూడావచ్చి తన కెదురుగా కూర్చుంటుందని అనుకున్నాడు నిరంజనరావు.

అయితే ఆమె కూర్చోలేదు. నిరంజనరావు దగ్గరకు వచ్చి తన చేతిని జాపింది.

అదృష్టదేవత తన్ను ఆహ్వానిస్తున్నట్లుగా భావించాడు. ఆ చేతిని అలాగే మృదువుగా పట్టుకుని లేచాడు. ఫ్లోర్‌లోకివెళ్ళి ఆమె నడుముచుట్టూ చేయివేసి స్టెప్స్ వేస్తుంటే అతడు పైపై లోకాల్లోకి వెళుతున్నట్టు ఫీలయ్యాడు.

"రాఘవరావు చిన్నప్పట్నుంచే తెలుసా మీకు?" ఆమె అడిగింది.

"మే మిద్దరం క్లాస్ మెట్స్‌ము! చాల స్నేహంగా తిరిగే వాళ్ళం!"

"అలాగా?"

"మీలాంటి అందమైన వాళ్ళ స్నేహం సంపాదించటం అతడి అదృష్టం!"

ఆమె నవ్వింది. "అలా ఎందుకనుకోవాలి! మీరు మాత్రం స్నేహితులుకారా?"

"అఫ్ కోర్స్ అవుననుకోండి!"

"అంతేకాదు. ఇంకో రహస్యం చెప్పనా?"

"చెప్పండి!"

"అటువంటి చొరవగల వాళ్ళంటే భర్తచాటున తిరిగే ఆడవాళ్ళు భయపడతారు. మీలాంటి బుద్ధావతారాలు అయితే అటువంటి భయం వుండదు."

తనను పరిహసిస్తున్నదో, కాంప్లిమెంట్ చేస్తున్నదో అతడికి అర్థంకాలేదు. అసలు అతడి జీవితంలో స్త్రీలతో ఎలా మెలగాల్సింది అతడికి తెలీని సమస్య. ఆల్‌జీబ్రా కన్నా కష్టమైన ఈక్వేషన్.

"స్త్రీ మనసు మహాసముద్రంకన్న లోతైనదంటారు!" అన్నాడు.

"ఓ! మీకు కవిత్వంకూడా వచ్చే!"

మ్యూజిక్ ఆగిపోయింది. పాతజంటలు తిరిగిపోతుంటే కొత్తవాళ్లు మళ్ళీ మరో రౌండ్‌కి సిద్ధమవుతున్నారు.

సుజాత, నిరంజనరావులు వచ్చి కుర్చీలలో కూర్చున్నారు.

రాఘవరావు మరో మారు డ్రింక్స్‌కి ఆర్డరిచ్చాడు. వాచీవంక చూసుకొన్నాడు.

"సుజీ! నేను మళ్ళీ మీ ఇంటిదాకా రాలేను. డాక్టర్ నిన్ను మీ ఇంటిదాకా ఎస్కార్ట్ వస్తాడులే! నాకు రాత్రి గూడ నిద్రలేదు. రేపు కోర్టులో ఆర్గ్యుమెంట్ కేసొకటి ఉంది. ఇంటి కెళ్ళి మాంఛి నిద్రతీస్తేతప్ప, రేపు కేసువ

ఎటెండ్ కాలేను!"

"నీ చెప్పేదూ ఇంతే!" చిరుకోపంగా అంది సుజాత.

"ఏమంటారు డాక్టర్! ఆమెను ఇంటిదాకా దిగబెట్టి మీరింటికి వెళ్ళండి."

"దాందేముంది. నీ వింతగా చెబితే నేను కాదని ఎలా అనగలను" అంటూ ఆమెవంక చూశాడు ఆమె అంగీకారంకోసం.

ఆమె అలాగే చిఱునవ్వులు చిందిస్తోంది.

"సరే పదండి డాక్టర్!" అని లేచింది సుజాత.

రాఘవరావు బిల్ పేచేసి లేచాడు. నిరంజనరావు స్కూటర్‌ని వేసుకుని వెళ్ళిపోయాడు.

కారులో డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. అతడి ప్రక్కనే సుజాత కూర్చుని ఉంది.

మలుపులు తిరుగుతూ కారు ముందుకు సాగిపోతోంది. సుజాత అతనికి దగ్గరగా జరిగింది. ఒకచేతిని అతడి భుజంపై వేసింది. తన తలను అతడి భుజంమీద ఆన్చింది. నిరంజనరావు కారుని ఆపేశాడు.

"అదేం? ఆపారు!" అనడిగింది సుజాత మత్తుగా అతడి కళ్ళల్లోకి చూస్తూ.

ఆమె ముఖాన్ని రెండు చేతుల్తో తన వేపుకు త్రిప్పుకుని ఆమె పెదిమలమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు నిరంజనరావు.

"యూ సిల్లీ బాయ్ ఇందుకా కారు ఆపింది?"

కారు మళ్ళీ స్టార్టయింది.

"మీ ఆయన ఊళ్లో లేడా?" నిరంజనరావు అడిగాడు.

"లేకేం? ఈపాటికి నా కోసం ఎదురుచూస్తుంటారు!"

"ప్చ్!" అని పెదవి విరిచాడు నిరంజనరావు.

ఆమె నవ్వింది. "ఎందుకు అలా అడిగారు?"

"మీ వారు మళ్ళీ ఈ వారంలో ఎక్కడికి క్యాంప్ వెళ్ళరా?

"ఎల్లుండినుంచి ఆయన ఊరికెళ్తారు. మూడు రోజుల దాకా రారు!"

"నాకు ఒక రోజు పర్మిషన్ ఇప్పిస్తారా?"

"దేనికి?"

"మీతో తీరిగ్గా చాలా విషయాలు మాట్లాడాలి?"

ఆమె సీరియస్‌గా అయింది. "మీరేదో పెద్దమనుష్యులు గదా అని గౌరవం యిస్తుంటే మీరు మితిమీరి పోతు న్నారు. ఇందాక బలవంతాన ముద్దుపెట్టుకున్నారు. ఇప్పు డేమో ఇంకా హద్దుమీరి మాట్లాడుతున్నారు."

"సారీ మేడమ్! మీ అందం నన్ను నిషాలో ముంచేసింది, నేను అతిగా ప్రవర్తించానేమో! ఎక్స్క్యూజ్ మీ!" అన్నాడు నిరంజనరావు షాక్ తిన్నవాడిలా. రోడ్డుమీదకే చూస్తూ సీరియస్‌గా డ్రైవ్ చేయసాగాడు.

అంతలోనే మళ్ళీ సుజాత నవ్వు వినిపించింది.

"నిజంగానే తీసుకున్నారా నా మాటలు! మీరెంత ధైర్యవంతులో కనిపెడదాం అని అలా సీరియస్‌గా అన్నాను. అంతే! ఎంతైనా మీరు ఫ్యామిలీ డాక్టరు. నన్ను సంపూర్ణంగా పరీక్షించే అధికారం మీకు ఉంది! సరేనా? సోమవారంనాకు నేను ఫ్రీ! వుయ్ కన్ హావ్ ఫన్!" అంది ఆమె.

కారు గేటు దాటి బంగళాముందు ఆగింది.

"కారు తీసుకు వెళ్ళండి. రేపుదయం డ్రైవర్ని పంపి తెప్పించుకుంటాను!" అంది సుజాత.

"థాంక్యూ వెరీమచ్!"

"సుజాత నిరంజనరావు మొహంలోకి ఓ క్షణం పరీక్షగా చూసింది. "నీ అమాయకత్వం చూస్తే నాకు

నిజంగా జాలేస్తుంది. నీవు చాలా కష్టాల్లో పడబో తున్నావ్. జాగ్రత్తగా వుండు'' అంటూ సుజాత గబ గబ లోపలకు వెళ్ళిపోయింది.

కారు డ్రైవ్ చేసుకుంటూ డాక్టర్ నిరంజనరావు ఇంటి దోవపట్టాడు. సుజాత మాటలు అతడికి అర్థంకాలేదు. తను ఇప్పుడు హాపీగా వున్నాడు. చేతినిండా డబ్బు వుంది. ప్రాక్టీసుకూడా మెరుగైంది. మరి తనకు కష్టా లేమిటి? సుజాత ఏదో తమాషాకు అలా అని వుంటుందని సరిపెట్టుకున్నాడు. అయినా, మళ్ళీసారి సుజాతను కలుసుకున్నప్పుడు ఆ విషయం అడగాలని తీర్మానించు కున్నాడు.

ఇంటి ముందు ఖాళీ జాగాలో కారు పార్క్ చేసి ఇంటి తలుపు తాళం తీసి, లైటు వెలిగించాడు. కోటు విప్పి బెడ్ మీదకు విసిరేశాడు. బూటు లేసులు విప్పుకుని తలపైకెత్తాడు.

అంతే! నోరు తెరుచుకుని ఆశ్చర్యంతో నిలబడి పోయాడు.

ఎదురుగా పాతికేళ్ళ యువతి కుర్చీలో కూర్చుని వుంది నిద్రపోతున్నట్టుగా.

''ఏయ్ మాడమ్! ఎవరు నువ్వు!'' అని అరిచాడు.

ఆమె పలకలేదు. అతడు దగ్గరకు వెళ్ళి ఆమెని కది లించి లేపుదామని ఆమె మీద చెయ్యి వేశాడు. ఆమె ఒళ్ళు చల్లగా ఐస్‌లా ఉంది.

ఆమె చనిపోయి ఉంది. అతడికి ఒళ్ళంతా చెమటలు పోశాయి. సుజాత చెప్పిన అపాయం ఇదేనా?

## 7

పోలీస్ జీప్ వచ్చి ఇంటిముందు ఆగింది. నిరంజనరావు గేటులోనే ఇన్‌స్పెక్టర్ని రిసీవ్ చేసుకున్నాడు.

"ఈమెను మీరు ఇదివరలో ఎన్నడయినా చూశారా?"

"లేదండీ! ఎన్నడూ చూసి ఎరగను!"

"పోనీ ఆమె ఎవరో ఏమిటో ఆచూకీ తెలుసా?"

"లేదు సార్!"

"అయితే ఈమె మీ పేషెంట్ కాదన్నమాట!"

"ముమ్మాటికీ కాదు."

"మీ కన్సల్టేషన్ కోసం కొత్తగా వచ్చిన పేషెంటేమో!"

"అయితే అయివుండచ్చు. కాని ఆమెతో ఇదివరలో నాకెలాంటి పరిచయం లేదని దృఢంగా చెప్పగలను."

"ఆమెకు మీ ఇంట్లో ఏం పని?"

"ఆమె మీకు ఎంతవరకు తెలుసో, నాకూ అంతవరకే తెలుసు సార్!"

"మీరు చెప్పేది నిజమయితే ఇదంతా అయోమయంగా తయారవబోతోంది. ఒక అపరిచిత వ్యక్తి మీ ఇంట్లో చనిపోయి ఉండడం ఎన్నో అనుమానాలకు దారితీస్తుంది. మీరు బయటకు వెళ్ళేటప్పుడు ఇంటికి తాళం వేసుకుని వెళ్ళారు కదూ?"

"అవునండీ తాళం వేసే వెళ్ళాను!"

"ఈ తాళం డూప్లికేట్ కీ ఎవరి దగ్గరన్నా ఉందా? అంటే మీరెవరికన్నా ఇచ్చారా?"

"లేదండి! దాని తాలూకు డూప్లికేట్ నా డ్రాయర్లో భద్రంగా ఉంది."

"చాలా ఆశ్చర్యంగా ఉందే! ఆమె చనిపోయి ఎంతసేపయివుంటుందని మీ అభిప్రాయం! అహఁ! మీరు గూడ డాక్టరే కదా అని?"

"ఆమె చనిపోయి మూడునాలుగు గంటలై ఉంటాలి."

"రాత్రి మీరు ఎన్నింటికి ఇల్లు వదలి బయటకు

వెళ్ళారు?"

"రాత్రి ఏడుగంటలకే వెళ్ళిపోయాను. స్టెరిలింగ్ స్ట్రీట్‌లో ఒక పేషెంట్‌ని విజిట్ చేశాను. ఆ తర్వాత హోటల్ సవేరాకు వెళ్ళాను, నా ఫ్రెండ్ ఒకతను పార్టీ ఇస్తే! నేను తిరిగి వచ్చేసరికి తెల్లవారుజామున నాలుగయింది!"

"అంటే మీరు లేనప్పుడు ఎవరో ఈమెని ఇక్కడకు తెచ్చి పడేసి ఉండాలి!"

"అవచ్చు!"

"మీకు పార్టీ ఇచ్చిన ఫ్రెండ్స్ పేరు చెప్పండి!"

"వాళ్ళని అనవసరంగా ఇందులోకి లాగటం ఎందుకు సార్?"

"వాళ్ళని ఇరికించేదేముంది డాక్టర్? మీరు వాళ్ళతో రాత్రంతా గడిపినట్టు సాక్ష్యం ఉంటే మీరే ఈ కేసు లోంచి బయట పడతారు."

నిరంజనరావు చెప్పాడు రాఘవరావు పేరూ, సుజాత పేరూ, వాళ్ళ అడ్రసులూ.

"మీరు ఈమెను చూసిన తర్వాత ఎంత సేపటికి మాకు ఫోన్ చేశారు?"

"ఎంతో సేపా? సెకండ్స్‌లోనే!"

"చూడండి డాక్టర్! మీరు అబార్షన్ కేసులు చూస్తుంటారా?"

అంత సీరియస్‌గా ఉన్నా నిరంజనరావు అతడి ప్రశ్నకు నవ్వాడు.

"ఏం? నా ప్రశ్న మీకు నవ్వు తెప్పిస్తున్నదా?"

"అవును! కానీ నేను అబార్షన్ కేసులు ఎప్పుడూ టేకప్ చేయలేదు! ఒకవేళ ఎవరన్నా వచ్చి ఉన్నా వాళ్ళని ఏ లేడీ డాక్టరు దగ్గరకో పంపించే వాడ్ని."

మరో సార్జంట్ ఇల్లూ, డిస్పెన్సరీ వెదికి వచ్చాడు.

"ఏమీ దొరకలేదు సార్!"

"ఆమె ఒంటిమీద ఎలాంటి గాయాలు లేవు. ఆమె చావుకు కారణం ఏమయి వుంటుంది?"

"అది మీ మెడికల్ ఎక్స్‌పర్ట్ చెప్పవలసిన విషయం?"

"అఫ్‌కోర్స్! పోస్టుమార్టమ్ రిపోర్టుకోసం ఆగాలను కోండి! పోతే మీరొకసారి స్టేషనుకు వచ్చి స్టేట్‌మెంట్ ఇవ్వాల్సి ఉంటుంది."

శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపి వ్రేలిముద్రలు ఎక్కడన్నా దొరుకుతాయేమో అని చూశారు. కాని ఎక్కడా ఏమీ దొరకలేదు, నిరంజనరావు వ్రేలిముద్రలు తప్ప.

"నే కాస్త బయటికి వెళ్ళొస్తాను. ఈ అయిదు నిముషాల్లో మీరు బాగా ఆలోచించండి."

"ఏమాలోచించను?"

"అదే! మీరు నిజమే చెబుతుంటే! ఎవరో దొంగ రాస్కెల్ మీ మీద పగ తీర్చుకోటానికో లేక, మీ గుడ్ నేమ్ పాడు చెయ్యటానికో ఇది చేసి ఉంటాడు. వాళ్ళెవరో అంతుపడతారేమో ఆలోచించండి."

ఇన్‌స్పెక్టర్ బయటికి వెళ్లాడు.

కుర్చీలో కూర్చుని టేబుల్ మీద మోచేతులు ఆన్చి రెండు చేతుల్లో తలపెట్టుకున్నాడు డాక్టర్ నిరంజన రావు.

అతడి మనసు ఆలోచనల్లోకి జారుకుంది.

సరిగ్గా నిన్న సాయంత్రం కమలాకరం అర్ధరాత్రి పూట వచ్చి లేపాడు తనను. అతని వెంట ఎవరో స్త్రీ ఉంది. మరో యువకుడు రౌడీలాంటివాడు ఉన్నాడు.

ఇద్దరిలో ఎవరూ పెదవి తెరిచి మాట్లాడలేదు. ఆ

స్త్రీకి భుజంలో బుల్లెట్ దిగింది. మైనర్ ఆపరేషన్ చేసి దాన్ని తీశాడు. డ్రెస్ చేసి, ఇంజెక్షన్ ఇచ్చాడు. అతను చేసేదంతా కమలాకరం పరీక్షగా చూస్తూ కూర్చున్నాడు.

"చాలా త్వరగానూ, నీట్ గానూ చేశారు డాక్టర్!" అన్నాడు చివరకు.

"కాని ఈమెకు ఈ గాయం ఎలా తగిలిందో చెప్పనే లేదు మీరు?"

"చూడు డాక్టర్! మనం ఇప్పుడు చాలా క్లోజ్ ఫ్రెండ్స్ మి! అవునా?"

"కాదని ఎవరన్నారు? కాని చట్టం ఏమంటుందో తెలుసా? ఎవరికైనా బుల్లెట్ గాయాన్నికాని, తుపాకీ గాయాన్నిగాని ట్రీట్ చేసినప్పుడు పోలీసులకు తెలియ బరచటం డాక్టర్ల విధి! లేదా మా రిజిస్ట్రేషన్ ఊడి పోతుంది."

"అది నాకూ తెలుసు! కాని ఈ కేసులో మీకు ఎటువంటి ట్రబుల్ ఉండదు! సరేనా? మీరసలు ఈ బుల్లెట్ కేసుని ట్రీట్ మెంట్ చేసిన విషయమే మరచి పొండి. దానికితగ్గ ప్రతిఫలం ఉంటుంది గూడ!" అంటూ కమలాకరం నోట్లకట్ట నొకదాన్ని బల్లమీద పెట్టాడు.

వాటివంక చూశాడు నిరంజనరావు. వెయ్యి రూపా యలు అవి. అయినా అతడు వాటిని తీసుకోలేదు. "ఈమె విషయం మీరు చెప్పక తప్పదు!"

"ప్చ్! అసలు విషయం నీకు ముందే చెప్పి ఉండా ల్సింది" అని స్వగతంలా అనుకున్నాడు కమలాకరం. "నాకు రెండుమూడు పెద్ద నగరాల్లో 'పోష్' హోటల్లు న్నాయి. అవంతా బ్లాక్ మనీతో రన్ అవుతూన్నవే! వాటిలో కేబరే డాన్సులుగూడ ఉంటయ్. ఈ సంఘటన

అలాంటి చోటే జరిగింది.

"అప్పుడప్పుడు మస్తుగా తాగేసిన ప్రేక్షకుడు కలభా చెయ్యటం మామూలే. అందుకు మా మనుషులు రెడీగా ఉంటారు. కాని ఒక్కోసారి రెచ్చిపోయిన ఆ వ్యక్తి రివాల్వరు తీయటంగూడ చేస్తుంటాడు. అలా కలభా అయినట్లు పోలీసులకు తెలిస్తే హోటలు లైసెన్సు రద్దవుతుంది. ఇదివరకటి డాక్టర్ ఇలాంటి కేసుల్ని ఎన్నిటినో రెండో కంటికి తెలియకుండా పూర్తిచేశాడు. అతడెన్నడూ రిస్క్‌కి గురికాలేదు. నీవూ అలానే చేయాలి!"

"అలా వీల్లేదు."

"సరే! బాగా ఆలోచించుకో డాక్టర్! ఆ తర్వాత నీ ఖర్మ!" అంటూ కమలాకరం విసురుగా లేచి బయటకు వెళ్ళిపోయాడు.

టేబుల్ మీద నోట్లకట్ట అలానే మిగిలిపోయింది. దాన్ని తీసి డ్రాయర్లో పడేశాడు విసుగ్గా.

అయితే మర్నాడు నిరంజనరావు పోలీసులకు ఫోన్ చెయ్యలేదు. బ్యాంక్‌కి వెళ్ళి ఆ డబ్బుని డిపాజిట్‌లో వేసి వచ్చాడు.

# 8

అయితే! ఈ గుర్తుతెలియని శవం కమలాకరం చేసిన గారడీయా? ఆమె అతగాడి నైట్‌క్లబ్స్‌లో మనిషి అయి ఉండాలి. ఆమెకూ వాళ్ళకూ ఏదో పేచీవచ్చి వుంటుంది. ఆమెను తెలివిగా విషంయిచ్చి చంపి ఉంటారు. తను లేనప్పుడు తెచ్చి తన ఇంట్లో పడేసిపోయారు.

లేదా? సుజాతతో పరిచయాన్ని సహించలేని రాఘవరావు పనా ఇది? తనకు ఆపద ఎటునుంచి రాబోతుంది? ఏది ఏమైనా తను చేతులారా ధన వ్యామోహంతో సాలెగూటిలో ఇరుక్కున్నట్లనిపించింది మొదటిసారిగా

అతనికి.

ఇన్స్పెక్టర్ రాకతో అతడి ఆలోచనలకు అంతరాయం కలిగింది.

"ఏమన్నా గుర్తుకు వచ్చినవా?"

"లేదు!" నింపాదిగా అన్నాడు నిరంజనరావు.

"మీ ఆఫీసులో ఎటువంటి అనుమానాస్పదమైన ఆధారాలు కనిపించలేదు. ఆమె పర్సులో ఆమె చిరునామా ఉన్న కార్డు దొరికింది. ఆమె పేరు కె. రాజ్యలక్ష్మి అని ఉంది. ఆ పేరుగల వ్యక్తులు ఎవరన్నా మీ పేషెంట్లు ఉన్నారా?"

"ఒకరిద్దరు ఉండొచ్చు!"

"మీరు ఎకౌంట్స్ మెయిన్ టెయిన్ చేస్తారా?"

"డామ్ కరెక్టుగా!"

"అయితే వాటిని వెరిఫై చెయ్యాలి!"

టెలిఫోన్ మ్రోగింది. ఇన్స్పెక్టర్ రిసీవ్ చేసుకున్నాడు. క్రేడిల్ మీద రిసీవర్ని పెట్టేస్తూ అన్నాడు. "ఆమె ఎల్. ఎస్. డి. డోస్ ఎక్కువగా సేవించటం వల్ల చనిపోయిందట. అంతేకాదు, ఆమె అలాంటి ద్రవ్యాల్ని రెగ్యులర్ గా తీసుకునే వ్యక్తి అయివుండొచ్చని మా డాక్టర్ అభిప్రాయంట. సరే! మీ ఫార్మల్ స్టేట్ మెంట్ ఇవ్వండి."

స్టేట్ మెంట్ రాసి సంతకం చేసి, ఇన్స్పెక్టర్ చేతికిచ్చాడు నిరంజనరావు.

అతని ఎకౌంట్ పుస్తకాలు తిరిగేశారు పోలీసులు.

రాజ్యలక్ష్మి అనే పేరుగల వాళ్ళు ముగ్గురున్నారు అతడి పుస్తకాల్లో. వాళ్ళ అడ్రసులు తీసుకుని కానిస్టేబుల్స్ వెళ్ళిపోయారు.

ఇన్స్పెక్టర్ నిరంజనరావుతో మాట్లాడుతూ ఉండ

గానే వాళ్లు తిరిగి వచ్చారు.

"మేం వెరిఫై చెయ్యటానికి వెళ్ళిన ముగ్గురు వ్యక్తులూ అదే రాజ్యలక్ష్మి అనే పేరుగల ఆ ముగ్గురూ బ్రతికే ఉన్నారుసార్! తర్వాత లాయర్ రాఘవరావుగార్ని కూడ కనుక్కొని వచ్చాం. డాక్టర్ గారు నిన్న రాత్రంతా వారితోనే ఉన్నట్లు చెబుతున్నారు."

"దట్సాల్ రైట్! ఈ హత్యతో మీకేం సంబంధం లేదని ఇంతవరకూ దొరికిన సాక్ష్యాలు ఋజువు చేసినయ్. ఇక ఆ చనిపోయిన వ్యక్తి ఎవరు, ఎందుకు చనిపోయింది, ఇక్కడకు ఎలావచ్చి చేరింది, అనేవి మేము సాల్వ్ చెయ్యాల్సినవి. మీకు ఏదైనా సమాచారం దొరికితే మాకు వెంటనే తెలియజేయటం మర్చిపోవద్దు!" అంటూ ఇన్స్పెక్టర్ వెళ్ళిపోయాడు.

తను హఠాత్తుగా ఇరుక్కుపోయిన ఈ సంఘటనలో మ్రాన్పడిపోయాడు నిరంజనరావు.

## 9

కారు డోర్ తెరుచుకుని వయ్యారాలు ఒలకబోస్తూ సుజాత వచ్చింది.

"హలో! గుడ్ మార్నింగ్ మేడమ్! ఏమిటిలా వచ్చారు?"

"మా వారు ఇవాళ ఊరికి వెళ్తున్నారు. రాఘవరావు కేసు ఏదో సెషన్స్‌కి వచ్చింది ఇవాళల్లా రాలేనని కబురు చేశాడు. అన్నట్టు ఇవాళేగా మిమ్మల్ని రమ్మన్నాను!" అంది సుజాత కుర్చీలో కూర్చుంటూ.

"ష్యూర్! ష్యూర్! ఎ ప్లెజంట్ ఈవెనింగ్ ఎహేడ్!"

"మీరు పేషెంట్ల గొడవలో నన్ను మర్చిపోతారేమో

చెప్పిపోదామని వచ్చాను. వెళ్ళిరానా? మావారి ప్రయాణానికి ఏర్పాట్లు చూడాలి! టా! టా!" అంటూ వెళ్ళిపోయింది సుజాత.

నిరంజనరావు తన డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళి గబగబా మరో తడవ షేవ్ చేసుకుని స్నానం చేసి భోజనం పూర్తిచేశాడు. నాలుగు గంటలకు అలారం పెట్టుకుని బెడ్ మీద వాలిపోయాడు.

సాయంత్రం స్కూటర్లో మెజిస్టిక్ హోటల్‌కి పోతూండగానే దోవలో రాఘవరావు కలిశాడు.

కూల్ డ్రింక్స్ సిప్ చేస్తూ అడిగాడు నిరంజన్‌రావు.

"కమలాకరంతో నీకు పరిచయం అయి ఎంతకాలం అయి ఉంటుంది?"

"చాలాకాలం అయింది! ఎందుకు?

"సుజాతతో!"

"సుమారు మూడేళ్ళ క్రితంనుంచి. ఆమె ఒక పాష్ హోటల్లో కేబరే డాన్సరుగా ఉండేది."

"ఆమెకూ నీకూ రహాస్య సంబంధం ఉందా?"

"ఓరి ఇడియట్! ఇదా నీ అనుమానం! ఆమె భర్త ముసలివాడు. అందుకే ఆమెకు కొంత ఫ్రీడమ్ ఇచ్చాడు. అయినా ఎన్నడూ మేం అతనికి పట్టుబడలేదు. ఎందుకైనా మంచిది. నువ్వూ జాగ్రత్తగా మసలుకో. ఆమె అందాన్ని తాగేసేలా చూస్తూంటావ్. కమలాకరం కళ్ళబడితే తెలుసుగా అతగాడి సంగతి!"

"నీకూ కమలాకరానికి ఎలా పరిచయం? అతదేదన్నా క్రిమినల్ కేసులో ఇరుక్కుని నీ దగ్గరకు క్లయింట్‌గా వచ్చాడా?"

"నీ తెలివి మండిపట్టే ఉంది! నేను క్రిమినల్ లాయర్నయినంత మాత్రాన నా క్లయింట్సంతా నేరస్థులే

నంటావా?'' రాఘవరావు సిగరెట్ వెలిగించాడు.

''ఒకసారి అతనికి తెలిసిన వ్యక్తిని అరెస్టుచేశారు పోలీసులు ఏదో కేసులో. అతను ఒకరిద్దరు లాయర్లను సంప్రదించాడు అతని విడుదలకోసం. వాళ్లు లాభంలేదని పెదవి విరిచారు. ఆకేసు నేను చేపట్టి అతడ్ని విడుదల చేయించాను. అప్పట్నుంచి అతడి లాయర్నయిపోయాను. సంవత్సరానికి ఇంత అని ముట్టచెబుతాడు ఫీజు క్రింద! అయినయ్యా నీ అనుమానాలు? ఇంకా ఏమన్నా ప్రశ్నలున్నాయా?''

నిరంజనరావు తనకు అంతగా సహాయం చేసిన మిత్రుడ్ని అనుమానించినందుకు నొచ్చుకున్నాడు.

''సారీ మిస్టర్ రాఘవా?'' అన్నాడు.

''మనలో మనకి సారీ ఏమిటిరా?''

రాఘవరావు వెళ్ళిపోయాక నిరంజనరావు సిగరెట్ వెలిగించి, స్కూటర్ స్టార్ట్ చేసి బయలుదేరాడు.

# 10

''డార్లింగ్! నిన్ను ఎన్నో ప్రశ్నలు అడగాలని వుంది'' సుజాతను తన కౌగిలిలో బిగిస్తూ అన్నాడు నిరంజనరావు.

ఆమె మత్తుగా అతనివేపు చూసింది ''ఊఁ! అడుగు'' అంది.

''ఆ రోజు నీవు అన్నావ్ గుర్తుందా? నీవు చాలా కష్టాల్లో వున్నావ్! అని. దానర్థం ఏమిటి?''

''ఓ, అదా! దానికి చాలా హిస్టరీ వుంది! ఏదీ ఇంకో గ్లాసు నింపు!'' అంటూ ఖాళీగ్లాసుని చూపించింది.

నిరంజనరావు బీర్ బాటిల్ అందుకుని ఆమెకు మరో గ్లాసు నింపాడు. ఆమె గ్లాసు ఖాళీ చేసి స్టూల్ మీద పెట్టింది.

"డార్లింగ్! సిగరెట్!" అంది గోముగా.

విధేయతగల నౌకరులా నిరంజనరావు లేచి స్టాండ్ దగ్గరకు నడిచాడు. ఇద్దరికీ వంటిమీద బట్టలేవు. వారి బట్టలు ఆ స్టాండుమీద చోటు చేసుకున్నాయి.

తన ప్యాంటు జేబులోంచి 'ఫిల్టర్ కింగ్' సిగరెట్టు ప్యాకెట్ తీశాడు. ఓ సిగరెట్ తన పెదాల మధ్య పెట్టుకుని లైటర్ వెలిగించాడు. ఆ తర్వాత దాన్ని తీసి సుజాత పెదాలమధ్య పెట్టేశాడు.

"యూ సిల్లీ బోయ్!" అంటూ ఆమె గబగబ నాలుగు దమ్ములు లాగి తన నోట్లోంచి తీసి దాన్ని మళ్ళీ నిరంజన రావు నోటికందించింది.

"నిజం చెప్పాలంటే నీవే కారు! నేనూ కష్టాల్లో ఉన్నాను."

"ఈ వేదాంతం కట్టిపెట్టి అసలు పాయింటుకురా డార్లింగ్!"

"నేను కాలేజీలో బి. యే. చదువుతూండగా మా నాన్న చనిపోయాడు. మాకు ఉన్న ఆ స్తల్లా ఒకే ఒక ఇల్లు. నేను చాలా కష్టాలకోర్చి చదువు పూర్తయిందని పించాను. డిగ్రీ చేతికొచ్చేటప్పటికే నేను టైప్ రైటింగ్, షార్ట్ హాండ్ పరీక్షలు ప్యాసయి ఉన్నాను. నాకున్న చదువుతో సెనోగా చేరి నన్నూ నా తల్లినీ పోషించు కోవాలనుకున్నాను. కాని ఎక్కడికి వెళ్ళినా నా అందాన్ని చూసి నా జీవితాన్ని కాటువేయాలని చూసే వాళ్ళేగాని నా పొట్ట నేను పోషించుకోనిచ్చేదు మీ మగవాళ్ళు."

"ఎక్కడైనా జరిగే కథే ఇది! ఆ తర్వాత?"

"నేను చిన్నప్పట్నుంచీ దారిద్ర్యంలో పుట్టి పెరి గాను. అందుకని సహజంగా నా కోరికలు ఐశ్వర్యం

గురించి భోగభాగ్యాల మీద నే ఉండేది. నా కలలన్నీ లక్షాధికారి అయిన భర్తమీద బంగళా, కారు వీటి చుట్టూనే పరిభ్రమించేవి.

"అనేక ప్రైవేటు కంపెనీలలో స్టెనోగా పని చేస్తూనే నా కావలసిన భర్తకోసం గాలంవేస్తూ వచ్చాను. అయితే అప్పటివరకూ ఏ మగవాడికీ లొంగలేదు. మగవాడికి ఒళ్ళప్పగించిన ఆడది దీపంలోకి ఉరికిన పురుగులాగ నాశనమవుతుందని నాకు తెలుసు.

"ఆ తరువాత కొన్నాళ్ళకు మా తల్లి చనిపోయింది.

"అప్పులు తీర్చడం కోసం ఇల్లు అమ్మివేశాను. ఆ తర్వాత మహిళా సంఘం సెక్రటరీ ఒకామె క్లబ్‌లో రిసెప్షనిస్టుగా ఉండమని కోరింది. అక్కడే నేను డాన్సర్‌గా, కాబరే డాన్సరుగా మారిపోయాను. ఎందుకు? నా ఖర్చులకు సరిపోను ఆదాయం రాకటానికి!

"వారాని నాలుగువందల రూపాయలు వచ్చేవి. మద్రాసు, హైదరాబాదు, మైసూరు, బెంగుళూరు, బొంబే అన్ని చోట్ల డాన్సు చేశాను. కార్లలో షికార్లు, బ్రహ్మాండమైన డిన్నర్లూ, బహుమానాల పేరిట వచ్చే నగలూ, ఆభరణాలూ. నా సంపద పెరుగుతోసాగింది.

"సరిగా అప్పుడే మైసూరులో కమలాకరం తారసపడ్డాడు. అతనితో రెండేళ్ళ కాంట్రాక్టు రాశాను అతని క్లబ్బులో డాన్సర్‌గా. నేను ఈ వృత్తిలో ఉన్నా నేను ఉన్నత విద్య చదివినదాన్నని కొంతమంది గౌరవించేవారు. కమలాకరంగూడా వాళ్ళలో ఒకడు.

"నేనంటే అతడికి గోజుగోజుకీ మోజు పెరిగిపోయింది. చివరకు పెళ్ళాడమని ప్రపోజ్ చేశాడు. నేను చెప్పిన షరతులన్నిటికీ ఒప్పుకున్నాడు."

"ఏమిటి నీ షరతులు?"

"పది లక్షలరూపాయలు నా పేర బ్యాంక్‌లో వేసే టట్టు మొదటిది. కాని అతడు ఇరవై లక్షలు కోరాడు అప్పటికప్పుడే. అతగాడు వయసు మళ్ళినవాడు. హార్ట్ ఎటాక్ వచ్చి హఠాత్తుగా హరీ అంటే నా గతేమిటని అడిగేను?"

"పెళ్ళి మాటలప్పుడే చావులూ, హఠాన్మరణాల గురించి ప్రస్తావనా?"

"నా మాటలకు అడ్డంరాకు! చెప్పేది విను ముందు! దానికి అతడు తన వీలునామాలో నాకు సగం ఆస్తిని అతని తదనంతరం నాకు వచ్చేట్టు రాశాడు. అన్నట్టు చెప్పటం మరిచాను. అతడు బ్యాంక్‌లో వేసిన ఇరవై లక్షలూ అతని తదనంతరమే తీసుకోవాల్సి ఉంది."

"సరిసరి! అంటే కమలాకరం చనిపోయిన తర్వాతనే నీకు ఆ ఆస్తి సంక్రమిస్తుందంటావ్!"

"కరెక్ట్! ఆ ఆస్తికోసమే అది నా చేతికి ఎప్పుడొస్తుందా అని ఆతృతపడుతున్నాను."

"అంటే కమలాకరం ఎప్పుడు చనిపోతాడా అని కాచుకుని ఉన్నావా?"

సుజాత అతనికి దగ్గరగా జరిగింది. అతని నోటిదగ్గరగా తన పెదిమలుంచి అంది:

"నిరంజన్! నేనంటే నీకు ప్రేమ ఉందా? నేను ఎల్లప్పుడూ నీ దాన్నిగా కావాలని ఉందా?"

"ఏమిటి డార్లింగ్ నువ్వనేది?"

"అందం, ఐశ్వర్యం గల భార్య కావాలంటే!" ఆమె మరీ దగ్గరగా అయింది. "కమలాకరానికి టిక్కెట్టిచ్చెసెయ్. అతడి పర్సనల్ డాక్టరువు గదా నీవు!"

నిరంజనరావు బిత్తరపోయాడు. బిక్కు బిక్కుమంటూనే మరో సిగరెట్ వెలిగించాడు.

అతడి చేతిలోని ప్యాకెట్ అందుకుని తనే సిగరెట్ వెలిగించుకుంది సుజాత.

"ఏం డార్లింగ్! ఒక్కసారే భ్రమాన్వడిపోయావ్! అన్నట్లు రాజ్యలక్ష్మి నాకు తెలుసు. ఆమె ఒకానొక క్లబ్‌లో డాన్సర్! ఆమెకు 'మారుజువానా' అలవాటుంది. క్లబ్‌లో డాన్స్ అయిపోయాక ఆ రోజు పెద్ద మోతాదులో వేసుకుని పడుకుంది. డోస్ ఎక్కువై ఆమె చనిపోయింది. ఆమెను ఎలా 'డిస్పోజ్' చెయ్యాలా అని ఆలోచిస్తూన్న నా భర్తకు నిన్ను ట్రాప్ చెయ్యడానికి ఆ శవాన్ని నీ ఇంట్లోకి జేరవేయించాడు.

"ఒక వేళ అతను చెప్పిన షరతులకు లోబడి నువ్వు ఫ్యామిలీ డాక్టర్‌గా ఉండటానికి ఒప్పుకోలేకపోతే నిన్ను ఇలాంటి కేసుల్లో ఇరికించడమో, లేక స్వర్గానికి టిక్కెట్టు ఇప్పించటమో జరుగుతుంది.

"ఇప్పుడు నువ్వా ఈ వలయంలోకి వచ్చేశావ్! నీ జీవితాంతం కమలాకరానికి బానిసగా ఉండాల్సిందే. లేదా అతడి చేతిలో మరణించటమో జరుగుతుంది. కనుక నీకు ఇప్పుడు ఇదే మంచి అవకాశం! నీ చేతిలో అతడు చావటమో, లేదా అతడి చేతిలో నీవు చావటమో! నే చెప్పేది అర్థమయిందా?"

"అయింది! కమలాకరం తన మార్గంలో ఎదురుతిరిగిన వాళ్ళని ఎలా డిస్పాచ్ చేస్తాడంటావ్?"

"అతనిమీద అనుమానం రాకుండా చేస్తాడు. మేడ మీదనుంచి నువ్వు క్రిందపడతావ్ కాలుజారి! లేదా సరిగ్గా రైలు వస్తున్నప్పుడే ప్లాట్‌ఫారంమీద నిల్చున్న నీవు పట్టాలమీద పడిపోతావ్! లేదా రోడ్డుమీద పోతూన్నప్పుడు ఏదో లారీవచ్చి నీ మీదుగా పోతుంది. అప్పులతో జీవితంమీద విరక్తి కలిగి ఎండ్రిన్ త్రాగి

నట్టుగా ఉత్తరం నీ జేబులో ఉండంగా నీవు పరలోక యాత్ర చేస్తావు! ఇలాంటివే ఎన్నో!"

"అబ్బ! నాకు ఇంకా భూమ్మీద నూకలుండడంవల్ల నే కమలాకరాన్ని ఎదిరించలేదు."

"అదిసరే! జరిగిపోయినదాన్ని గురించి అనుకుని ప్రయోజనం ఏమిటి? రాబోయే ఆపదగురించి ఆలోచించు!" ఆమె అతని మెడచుట్టూ చేతులువేసి తనదగ్గరకు లాక్కుంటూ అంది మళ్ళీ. "మనం త్వరపడాలి డార్లింగ్. ఏదో ఒక నిర్ణయానికి రావాలి? అతడు మనల్ని వదిలిపోయిన మరుక్షణం మనిద్దరం పెళ్ళాడుదాం! బోలెడంత ఐశ్వర్యం మనది! నా అందం నీది! నీ బలం నాది! నీలాంటి, భార్యమాటకు ఎదురాడని భర్త అంటే నాకు భలే ఇష్టం!"

"ఈ పని రాఘవ్ చేత చేయించవచ్చు కదా?"

"అతడో బ్రూట్. అతడికి కావాల్సింది డబ్బుగాని, నేనుకాదు. అందుకే నీవంటే నా కిష్టం!"

అతడు మౌనంగా ఉండిపోయాడు. సిగరెట్ పీకను యాష్ట్రేలో పడేసి ఆమెవైపుగా జరిగాడు. అతడి చేతుల్లో ఆమె మైనపు ముద్దలా అయిపోయింది.

# 11

"అయ్యగారు మిమ్మల్ని పిలుచుకురమ్మన్నారు సార్!" అన్నాడు డ్రైవరు.

మెడికల్ ఛెస్ట్ తీసుకుని డాక్టర్ నిరంజనరావు కారులో కూర్చున్నాడు.

కమలాకరం ఆఫీసులో తనగదిలో కూర్చుని ఏవో ఎకౌంట్ బుక్స్ చూస్తున్నాడు.

ఎయిర్ కండిషన్డ్ గదిలో చల్లగా ప్రాణానికి హాయిగా

ఉంది. దైవం అనుకూలిస్తే ఈ చల్లని వాతావరణానికి తనూ త్వరలోనే అధిపతి కాగలడు అనుకుంటూ కమలాకరం వంక అసూయగా చూశాడు.

"మీరు రేపటిదాకా రారని అన్నారు ఇంట్లో. అందుకే డైలీ చెకప్ కి రాలేదు!"

"అఫ్ కోర్స్! నేను రేపే రావాల్సింది. వెళ్ళిన పని త్వరలో అయిపోయింది. అందుకని వచ్చేశాను ఇవాళే! నాకేం కంప్లయింట్ లేదులెండి! మీరిచ్చిన క్యాప్సుల్స్ వాడాను! అవిచాలా బాగా పనిచేసినయ్!"

"థాంక్యూ సార్!"

"పోతే ఇప్పుడు మిమ్మల్ని ఎందుకు పిలిచానో తెలుసా? ఈ నెలాఖరులో నేను ఫారిన్ వెడుతున్నాను. షుమారు ఈ ట్రిప్ నాలుగయిదు వారాలు పట్టవచ్చు!"

"ఏదేశం?"

"ఫ్రాన్స్! విమాన ప్రయాణంలోను, అక్కడి సరికొత్త వాతావరణంలోను నాలో బ్లడ్ ప్రెజర్ హెచ్చు వచ్చు. లేదా గుండెపోటు రావచ్చు. కనుక నా ఫామిలీ డాక్టర్ వెంట ఉండాలని అనుకుంటున్నాను. అందుకని నీవూ నా వెంట రావాల్సి ఉంటుంది!"

"మరి ఇక్కడ నా ప్రాక్టీసు!"

"మిష్టర్ నిరంజనరావ్! ఒక్కోసారి నీవు చిన్నపిల్లవాడికన్నా ఎక్కువ తెలివితక్కువగా మాట్లాడుతావ్! కమలాకరాన్ని ట్రీట్ చేసే డాక్టరువు నీవు. నీకు డబ్బుకు లోటేముంది ఇక్కడ? నీ ప్రాక్టీసుమీద నీ జీవితంలో ఇంత సంపాదించలేవు!"

"ఒకవేళ నేను మీతో రావటానికి ఇష్టపడకపోతే?"

"ఇక్కడ అంతా నా ఇష్టప్రకారమే పనులు జరగాలి! నీ ఇష్టాయిష్టాలతో ప్రమేయంలేదు. నీవు ఉద్యోగివి

నేను యజమానిని! ఆ విషయం మరిచిపోకు డాక్టర్!''

''ఆల్ రైట్ సర్! మీ ఆజ్ఞలు జారీ చెయ్యండి. నేను శిరసావహిస్తాను,'' షేక్స్పియర్ ముఖం పెట్టి నిదానంగా అన్నాడు నిరంజనరావు.

''అలా దారికిరా! నీవు ఫారిన్ లో నా వెంట ఉన్నందుకు అదనంగా మరో పదివేలరూపాయలు ఫీజుక్రింద ఇస్తాను. నీ ప్రయాణ ఖర్చులు ఇతర సదుపాయాలూ అన్నీ నేనే భరిస్తాను.''

''సరేసర్!'' తలవూపాడు ఏదో నిశ్చయానికి వచ్చిన వాడిలా.

# 12

డాక్టర్ నిరంజన్ రావు రివాల్వర్ ని లోడ్ చేసి, దానికి సైలెన్సర్ ని బిగించి, కసిగా పరుపువేపుగా కాల్చాడు. చడీచప్పుడు లేకుండా బుల్లెట్ వెళ్ళి పరుపులో దూరింది.

సరిగ్గా అదే సమయానికి దబదబ తలుపు బాదిన చప్పుడయింది. కంగారుగా రివాల్వర్ ని కోటుజేబులో వేసుకున్నాడు.

''అబ్బ! ఎంత సేపు తలుపు తట్టేది! ఇంట్లో ఎవ తెనన్నా తెచ్చిపెట్టుకున్నావా ఏం?'' అంటూ సుజాత సుడిగాలిలా లోపలకువచ్చి పడింది.

''ఓ నువ్వా? ఎవరో అనుకుని గాభరాపడ్డాను!''

''రెండు రోజుల్నుంచి ఎక్కడా మనిషిజాడేలేదు! ఏమయిపోయావు డార్లింగ్!''

''నీవు నా కప్పగించిన పని నెరవేర్చటానికి తగిన సన్నాహాల్లో మునిగిపోయాను!''

''నిజంగా?'' అంటూ ఆమె సంతోషంతో అతడ్ని కౌగిలించుకుని ముద్దుల వర్షం కురిపించింది. నిరంజనరావు

ఆనందానికి అవధుల్లేవు. కోటు జేబులోంచి రివాల్వరు తీసి చూపించాడు.

"ఇల్లు తాళం వేసిరా! ఈ ఆనందాన్ని బయట ఎక్కడన్నా ఎంజాయ్ చేద్దాం!" అంది ఆమె.

"కమలాకరం ఊళ్ళో లేడా?"

"ఉంటే నేనిలా వస్తానా?"

"ఎలాగైనా నీవు రొమాంటిక్ లేడీవికదా!" అంటూ రివాల్వరుని జాగ్రత్తగా పదిలపరచి, ఇల్లు తాళం వేసి, కారులో సుజాతతో బయలుదేరాడు నిరంజనరావు.

హోటల్ ఇంపీరియల్ లో రూమ్ బుక్ చేసుకున్నారు.

"డార్లింగ్!" అంటూ జుట్టులోకి వేళ్ళు పోనిస్తూ సుజాత అతడ్ని తన మీదకు లాక్కుంది.

టైమ్ రాత్రి పదకొండు గంటలవుతుంది.

"నిన్ను ఇవాళ ప్రత్యేకం పని గట్టుకుని ఎందుకు తెచ్చానో తెలుసా?"

"దేనికి?"

"కమలాకరాన్ని ఎక్కడ దెబ్బతీయాలో చెప్పటానికి. జాగ్రత్తగా విను. ప్రతి శనివారం కమలాకరం చిన్న సూట్ కేస్ తో హోటల్ నవయుగలో మొదటి అంతస్తు మొదటి గది, గది నెంబరు 101లోకి వెళతాడు సరిగ్గా ఏడుగంటలకు. ఆ తర్వాత కరెక్ట్ గా అయిదు నిముషాలకు అదే రకం సూట్ కేసులో మరో వ్యక్తి అదే రూమ్ లోకి వెళతాడు. ఆ వ్యక్తి ఏదో నైట్ క్లబ్ కి మేనేజర్ అయివుంటాడు.

"అతడి చేతిలోని సూట్ కేసులో ఆ వారంలో ఎల్. యస్. డి, మార్జువానా మొదలైనవి అమ్మిన తాలూకు కలెక్షన్ ఉంటుంది. కమలాకరం దగ్గిరవున్న సూట్ కేసులో కొత్త ప్యాకట్లలో మరో వారానికి సరిపడే

'సరుకు' ఉంటుంది. ఇద్దరూ తమతమ బ్రీఫ్ కేసుల్ని మార్చుకుంటారు. కమలాకరం త్వరత్వరగా క్యాష్ లెక్క చూసుకుని "యస్! ఓకే!" అంటాడు! ఆ తర్వాత ముందు కమలాకరం వెళ్ళిపోతాడు. మరో అయిదు నిముషాలకు ఆ వచ్చిన మేనేజర్ వెళ్ళిపోతాడు."

"ఆ రూమ్ వీళ్ళకోసమే ఖాళీగా ఎలా వుంటుంది. మరెవరన్నా అందులో బసచేస్తే?"

"ఆ అవకాశంలేదు. ఎందుకంటే ఆ రూమ్‌కి నెలసరి అద్దె చెల్లిస్తాడు కమలాకరం!"

"అయితే వారానికి ఒక రోజే వెడతాడా? మరి మిగతా రోజులు ఎక్కడకు వెడతాడు?"

"అలానే ఒక్కో రోజు ఒక్కో ఊళ్ళో ఒక హోటల్‌లో ఆ ఊరి క్లబ్ మేనేజర్ కలుసుకుంటాడు."

"అందుకా ఎప్పుడూ క్యాంప్‌లమీద తిరుగుతూంటాడు."

"అవును. నీవు కూడా శనివారంనాడు సరిగ్గా ఆరు గంటల యాభై అయిదు నిముషాలకు హోటల్ నవయుగకు వెళ్ళాలి. కమలాకరం తన రూమ్‌కి సరిగ్గా ఏడుగంటలకు వస్తాడు. అతడి వెనకాలే నీవూ వెళ్ళి నీ డ్యూటీ అయిదు నిముషాల్లో ముగించుకు వచ్చేయాలి. ఆ తర్వాత క్లబ్ మేనేజర్ వస్తాడు. అప్పటికి నీ పని పూర్తిచేసుకుని బయటకు వచ్చేయాలి. తెలిసిందా?"

"తెలిసింది!"

"మేము సరిగ్గా అదే టయిమ్‌కు హోటల్ మేనేజర్‌కి ఫోన్ చేస్తాము. 101 నెం. గదిలో హాతకి జరిగిందని, వెంటనే క్లబ్ మేనేజర్ని అరెస్టు చేస్తారు."

"అంతేకాదు! ఈ హోటల్లోనే నీవు చిన్న విందు ఇవ్వాలి ఆరోజు ఏడుగంటలకు. నలుగురైదుగురు గెస్ట్‌లు కూడా ఉంటారు. ఫోన్‌లో నాతో మాట్లాడినట్లు

నటించు. ఆ తర్వాత నేను ఏదో సీరియస్ కేస్ ఎటెండ్ అవుతున్నట్టు, మరో అయిదు నిముషాల్లో వస్తానని అతిథు లకు చెప్పా. ఆ తర్వాత నేను అక్కడ ప్రత్యక్షమవు తాను. అంటే నేను డిస్పెన్సరీలో ఉన్నట్టు ఎలిబీ ఉంటుంది."

"గుడ్ అయిడియా! ఏమో అనుకున్నాను నీ బుర్ర కూడ పని చేస్తోందే!"

"నీ స్నేహం మరి!" అన్నాడు నిరంజనరావు హుషా రుగా.

"స్నేహం సంగతేమోగాని ఒకటిమాత్రం గుర్తుం చుకో. ఒకవేళ నీ తలరాత బాగోక నీవు పట్టుబడినా లేక ఫెయిల్ అయినా నా పేరు బయటికి రాకూడదు! నీవే కనికరం పీడ వదిలించుకోవడానికి నిర్ణయించు కుని చేసినట్టు చెప్పాలి!"

"డార్లింగ్! నా ప్రాణంపోయినా నీ పేరు బయట పెడతానా?"

సుజాత మత్తుగా అతన్ని తన చేతుల్లో పెనవేసింది.

## 13

రోజూలాగే తెల్లవారింది. నిరంజనరావు నిద్రలేచి దేవుని పటానికి దణ్ణం పెట్టాడు. స్నానంచేసి డ్రెస్ వేసుకుంటూండగా కాలింగ్ బెల్ మ్రోగింది.

తలుపు తీయంగానే ఎదురుగా ఇన్స్పెక్టర్ రాజా రావు కనుపించాడు.

"గుడ్ మార్నింగ్ డాక్టర్!" అన్నాడు నవ్వుతూ.

"గుడ్ మార్నింగ్ ఇన్స్పెక్టర్! ప్లీజ్ గెట్ ఇన్!" అంటూ సోఫా చూపించాడు.

"విశేషాలేమైనా ఉన్నాయా సార్! రాజ్యలక్ష్మి కేసు క్లోజ్ అయిందా?"

"ఇంకా లేదు. అఫ్‌కోర్స్ ఆమె ఆత్మహత్య చేసుకున్న దన్నమాట నిర్వివాదాంశం! కాని ఆమె మీ ఇంట్లోకి ఎలా వచ్చిందన్నది తేలాలి గదా? అంతవరకూ కేసు క్లోజ్ చెయ్యటానికి వీల్లేదు."

"అవునవును!"

"ఆ రాత్రి మీరు ముగ్గురూ అంటే మీరూ, రాఘవ రావూ, సుజాత హోటల్ మెజిస్టిక్‌లో ఉన్నామని చెప్పారు కదూ?"

"అవును!"

"సుజాతకూ రాజ్యలక్ష్మికీ పరిచయం ఉన్నట్టు మాకు దాఖలాలు దొరికినయ్!"

"అలాగా! ఆ విషయం నాతో ఆమె ఎన్నడూ అనలేదే?"

"సుజాత మీ పేషెంటా?"

"కమలాకరం, అతని భార్య సుజాత ఇద్దరూ నా పేషెంట్లే. నేను వాళ్ళ ఫామిలీ డాక్టర్ని!"

"ఆమె చాలా అందగత్తె కదూ? ఆమె అంత ముసలి మొగుడ్ని ఎందుకు ఎన్నుకుందో!"

"తెలీదు ఇన్స్పెక్టర్! బహుశా అతని ధనంచూసి చేసుకుని ఉండవచ్చు!"

"అవునా? పోతే ఆమె మీ పేషెంటేనా? లేక ఇంకా సన్నిహితత్వం ఉందా?" ఆ ప్రశ్న అడుగుతూ అతని కళ్ళలోకి సూటిగా చూశాడు ఇన్స్పెక్టర్.

ఇన్స్పెక్టర్ ఇలాంటి ప్రశ్న అడుగుతాడని నిరంజన రావు కలలో గూడ ఊహించలేదు.

"అంటే ఆమెకూ నాకు అక్రమసంబంధం ఉందనా మీరు అడగడం!" కొంచెం తడబడ్డాడు నిరంజనరావు.

"అఫ్‌కోర్స్! అంతే! కాని ఈ ప్రశ్న మిమ్మల్ని అడగ

డానికి నాకే బాధగా ఉంది."

"నిజమే ఇన్స్పెక్టర్! ఎవరికైనా అలా అనుమానించటానికి అవకాశం ఉంది. కాని నాకూ జీవితంలో కొన్ని ప్రిన్సిపల్స్ ఉన్నయ్. ఆమెకూ నాకూ ఎలాంటి అక్రమ సంబంధంలేదు. పైగా కమలాకరం తన భార్యను వేయి కళ్ళతో కనిపెట్టుకుని ఉంటాడు. ఆమె మీది మోహంతో ఒక సంపన్నుడయిన పేషెంట్ని వదులుకోలేను."

"మిమ్మల్ని అలా ఎందుకడిగానంటే ఒకవేళ సుజాత మీ ఇంటికి తరచుగావస్తూ ఉండివుంటే మీ ఇంటితాళం డూప్లికేట్ ఆమె సంపాదించే అవకాశం ఉంది. దాని సాయంతోనే రాజ్యలక్ష్మి మీ ఇంట్లో ప్రవేశపెట్టబడి ఉండచ్చు."

"అలాంటిదేమీ జరుగలేదు ఇన్స్పెక్టర్."

"కమలాకరంకి మీరు ఎన్నాళ్ళనుంచి ట్రీట్మెంట్ ఇస్తున్నారు?"

"నాలుగు నెలలనుంచి!"

"అంతకుముందు వారితో పరిచయం లేదా?"

"లేదు!"

"మిమ్మల్ని కమలాకరానికి ఇంట్రడ్యూస్ చేసింది ఎవరు?"

"లాయర్ రాఘవరావు. అతడ్ని చిన్నప్పట్నుంచీ ఎరుగుదును. మా ఫాదర్, అతని ఫాదర్ గూడ చాలా డియరెస్ట్ ఫ్రెండ్స్!"

"థాంక్యూ డాక్టర్! మీ టైమ్ చాలా తీసుకున్నానేమో! వస్తాను! సీ యూ ఎగైన్!" అంటూ ఇన్స్పెక్టర్ రాజారావు లేచాడు.

నిరంజనరావుతో కరచాలనం చేసి, బయటపడి వెళ్ళి జీప్ ఎక్కాడు ఇన్స్పెక్టర్ రాజారావు.

నిరంజనరావు విజయోత్సాహంతో సోఫాలో వెనక్కి కూలబడ్డాడు. ఎంతో నేర్పుగా పోలీసు ఇన్స్పెక్టర్ని బోల్తా కొట్టించాడు. తనలో హంతకుడికి కావాల్సిన నేర్పు ఇప్పుడిప్పుడే పెరుగుతుంటోంది, అని తనని తనే అభినందించుకున్నాడు.

## 11

డిస్పెన్సరీలో వెయిట్ చేస్తున్న పేషెంట్లను డిస్పోజ్ చేసి పన్నెండు గంటలకే ఇంట్లోంచి బయలుదేరాడు నిరంజనరావు. తనకు తెలిసిన డాక్టర్లను ఒకరిద్దరిని పరామర్శించాడు. ఆ తర్వాత రాఘవరావు కారు అడిగి తీసుకున్నాడు.

"అన్నట్టు చెప్పటం మరిచిపోయాను. ఇవాళ సాయంకాలం ఏడుగంటలకు సుజాత పార్టీ ఇస్తున్నది ఇంపీరియల్ లో. నాకు ఫోన్ చేసి నిన్నూ రమ్మని చెప్పమంది. నేనే వద్దామనుకున్నాను. నీవే వచ్చావ్!"

"ఓ.కే! ఒకటి రెండు అర్జెంటు కేసుల్ని చూసుకుని సరిగ్గా టైమ్కి వస్తాను నేను!" అంటూ కారేసుకుని బయలుదేరాడు.

అతడి కోటుజేబులో రివాల్వరు ఉంది. చేతులకు ప్లాస్టిక్ గ్లోవ్స్ ఉన్నాయ్.

రియర్వ్యూ మిర్రర్లో తనను ఎవరన్నా ఫాలో అవుతున్నారేమో అని చాలాసేపు పరీక్షించాడు. కాని ఎవరూ అనుమానించతగ్గ వాళ్ళు కనుపించలేదు.

నవయుగ హోటల్కు ఫర్లాంగు దూరంలో కారు ఆపాడు. లాక్ చేసి ఫుట్పాత్ మీద నడుచుకుంటూ వెళ్ళి నవయుగ హోటల్కి ఎదురుగావున్న మరో చిన్న హోటల్లోకి దూరాడు. ఒక మూలగా టేబుల్ ముందు కూర్చుని రోడ్డుమీదకే దృష్టినిలిపాడు. వెయిటర్ కి ఏవో

ఆర్డర్ ఇచ్చి వాటిని ఆరగించాడు.

సరిగా ఏడుగంటలకు కమలాకరం తనే కారు డ్రైవ్ చేసుకుంటూ వచ్చాడు. కారుదిగి లాక్ చేసి నవయుగలోకి వెళ్ళాడు.

నిరంజనరావు బిల్లు చెల్లించి తనూ నవయుగలోకి నడిచాడు,

కమలాకరం మేడమెట్లెక్కి 101 నెం. గదిలోకి వెళ్ళాడు. అతడు లోపలకు వెళ్ళి తనవెనుకే తలుపు వేసుకున్నాడు.

నిరంజనరావు గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నయ్. కాని ఎంతో నిదానస్థుడిలా మెట్లెక్కాడు. 101 నెం. గదిముందు నిలబడి ఒకసారి వెనక్కి చూశాడు. మేడ మెట్లు మలుపుగా ఉండటంవలన ఎవరూ తనని గమనించే అవకాశంలేదు.

ఒక చేయి కోటు జేబులోనికి పోనిచ్చి మరో చెయ్యి తలుపు నాబ్ మీద వేసి తలుపు తెరిచాడు. లోపలకు అడుగుపెడ్తూనే తలుపుని తన వెనకాల మూసేశాడు.

మెరుపులా కోటు జేబులోని చెయ్యి బయటకు వచ్చింది. ఆ చేతిలో సైలెన్సర్ అమర్చబడిన రివాల్వర్ ఉంది.

ఎదురుగా కుర్చీలో కమలాకరం తనవంకే చూస్తూ రాయిలా కూర్చుని ఉన్నాడు. అతడిచేయి సోఫా ప్రక్కన వాలింది.

నిరంజనరావ్ చేతిలో రివాల్వర్ ఎవరో లాగేసినట్టుగా అయింది. క్షణంలో అది గాలిలో లేచివెళ్ళి పైకప్పుకి అతుక్కుంది.

కమలాకరం లేచివచ్చి అతడి చేయిని మెలితిప్పాడు. ఎదురుగా మరో సోఫాలో కూలదోశాడు.

"వెల్‌కమ్ డాక్టర్! మనం ఇలా కలుసుకోవటం నాకు చాలా ఆనందంగా ఉంది! ఎందుకంటే మనుష్యుల్ని గురించి నేను వేసే అంచనాలు ఎన్నడూ తప్పుకావు!" అంటూ సోఫా ప్రక్కగావున్న బటన్ నొక్కాడు.

పైన సీలింగ్‌లో మాగ్నెట్‌కి అతుక్కుపోయిన రివాల్వరు ఊడి క్రిందపడింది.

కమలాకరం దాన్ని దొరకపుచ్చుకున్నాడు.

"ఇడియట్! తిన్న ఇంటి వాసాలనే లెక్కపెట్టే రోగ్! ఇప్పుడు చెప్పు! నీకేం శిక్ష విధించాలో నీవే చెప్పు! ఇప్పటికైనా నా తడాఖా తెలిసిందా?"

"కమలాకరం! ఆవేశపడకండి! మీకు గుండె నొప్పి రావచ్చు మళ్ళీ!"

"నాకు కాదురా! నీకు వస్తుంది గుండెపోటు."

అంతలోనే డోర్ నాబ్ మళ్ళీ తిరిగింది. అది చూసి కమలాకరం సైలెన్సర్ తీసి సోఫాలోని దిండు క్రింద దాచేశాడు.

తలుపు తెరుచుకుని ఆజానుబాహుడైన ఒక వ్యక్తి లోపలకు వచ్చాడు. అతడి చేతిలో నల్లటి ఆటోమేటిక్ పిస్టల్ మెరుస్తోంది.

నిరంజనరావు అతడి చేతిలోని పిస్టల్ గూడ పై కప్పున ఉన్న మాగ్నెట్‌కి అతుక్కుంటుందేమోనని ఆశగా చూశాడు. కాని అదేం జరగలేదు.

కమలాకరాన్ని చూస్తూ "ఎక్స్క్యూజ్ మి సార్! ఇక్కడ అంతా సవ్యంగానే ఉందని ఆశిస్తాను!" అన్నాడు.

"ఏమిటి సంగతి సర్‌ప్రైసింగ్! ముందు ఆ పిస్టల్‌ని జేబులో పెట్టుకో. వాటిని చూస్తేనే నాకు గుండె దడ వస్తుంది. అసలే నేను హృద్రోగిని!"

"అలా గీసార్!" అంటూ అతడు నిరంజనరావు వైపు అనుమానంగా చూశాడు.

"ఇతడు నా ఫ్యామిలీ డాక్టర్! నేనే పిలిపించాను!"

"థాంక్యూ సార్! ఇంతకు ముసుపు ఒక నిముషం క్రిందటే ఎవరో అజ్ఞాత వ్యక్తి మాకు ఫోన్ చేసి 101 నెం. గదిలో పిస్తోలు పేలిన చప్పుడు తమకు వినిపించిందనీ, కనుక ఏదో హత్య జరిగి ఉండాలనీ చెప్పాడు. వెంటనే మేం ద్వారాలన్నీ మూసేశాం. లిఫ్ట్ని సయితం ఆపు చేశాం. నిజంగా హత్యగనుక జరిగితే హంతకుడు బయిటకు పోలేడు. బోనులో పడ్డ ఎలకలా మాకు దొరికి పోతాడు."

"మా స్టాఫ్ని చూస్తుంటే నాకు అందుకే చాలా ముచ్చట వేస్తుంది. ప్రాంప్ట్ సర్వీసు. ప్రతి విషయం లోనూ చాలా అప్రమత్తతతో ఉంటారు! థాంక్యూ మిస్టర్ సింగ్!" అన్నాడు కమలాకరం.

నరేంద్రసింగ్ సెల్యూట్ చేసి వెళ్ళిపోయాడు. అతడు మెట్లు దిగుతూండగానే అతడికి బ్రీఫ్ కేస్ తీసుకుని వస్తూ మేనేజర్ ఎదురుపడ్డాడు.

డోర్ తెరుచుకుని లోపలకు వచ్చిన మేనేజర్ గదిలో కమలాకరంతోబాటు మరో వ్యక్తిని చూసి ఆగి పోయాడు.

"మే ఐ కమిన్ సర్?" అంటూ వినయంగా అడిగాడు.

"కమిన్ మిస్టర్ డేవిడ్!" అంటూ తన సీటు వెనకాల చాటుగా ఉంచిన బ్రీఫ్ కేస్ని తీసి అతగాడికిచ్చాడు.

ఆ బ్రీఫ్ కేస్ని అందుకుని తను తెచ్చిన దాన్ని కమలాకరానికి ఇచ్చాడు.

"ఇవాళ్టికి లెక్క చూడకుండానే తీసుకుంటున్నాను. నాకు అవతల చాల అర్జంటు పనులున్నాయ్! అంతా కరక్టుగానే ఉందికదూ?"

"కరక్టుగానే ఉందిసార్!"

"ఆల్ రైట్! తర్వాత ఇక ఈ రూమ్ మార్చేస్తున్నాను. వచ్చేవారం మరోచోట కలుసుకుందాం. ఆ ప్లేస్ ఏదో నీకు మరోసారి తెలియజేస్తాను."

"అలాగే సార్!" అంటూ అతడు వెళ్ళిపోయాడు.

అతడు అటు వెళ్ళంగానే కమలాకరం సైలెన్సర్ని చేతిలోకి తీసుకున్నాడు.

నిరంజనరావు ముఖంలో కత్తివాటు వేసినా నెత్తురు చుక్క లేదు. అతడి నోరు ఎండిపోయింది.

కమలాకరం ప్రక్కనే ఉన్న కప్ బోర్డులోంచి విస్కీ తీసి రెండు గ్లాసుల్లో పోశాడు.

"నీకు నోరుకూడ ఎండిపోయినట్టుంది! ఇందు! తీసుకో!" అన్నాడు.

నిరంజనరావు గ్లాసు ఆత్రంగా అందుకుని గడగడ ఒక్క గుటకలోనే త్రాగేశాడు.

"చదరంగంలో పావుని వాడినట్టుగా వాడుకున్నారు వాళ్ళు నిన్ను!"

"ఎవరు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"నిన్ని పనికి ఎవరు పురికొల్పారో నీకే తెలీదా?"

అతను మాట్లాడలేదు.

"నా ప్రియమైన భార్య, ఆమె బాయ్ ఫ్రెండ్ రాఘవరావుగదూ నిన్నీ పనికి పురమాయించింది?"

"రాఘవరావా?"

"అవును! వాడే! వాడు తెర వెనుక ఉండి సుజాతను ఎర చూపించి నిన్ను గోతిలోకి దింపాడు. దానికి ఎంత

ఐశ్వర్యం ఉన్నా చాలదు. గుడ్డలిప్పుతుని డాన్సు చేసే బిచ్చని తీసుకువచ్చి కనకపు సింహాసనంమీద కూర్చో బెడితే దాని గుణం ఎక్కడికి పోతుంది?"

"రాఘవరావా సార్ ఇందులో విలన్?"

"అవును. అతడికి నాకు చాలాకాలంనుంచి పరిచయం ఉంది. అతడు నా లాయర్. కంపెనీలో అతడికీ చిన్న వాటావుంది. అతడే నిన్ను నాకు పరిచయం చేశాడు. నీకు సహాయం చేస్తున్నట్టుగా నాటకమాడి ఫ్యామిలీ డాక్టరుగా నియమించాడు. సుజాత తన అందంతో నిన్ను ఇంకా తెలివిమాలినవాడ్ని చేసేసింది."

గుడ్లప్పగించి వింటున్నాడు నిరంజనరావు.

"నన్ను హత్య చేసి వచ్చిన అనంతరం సుజాత నిన్ను అక్కల ఆ సిత్తో వివాహమాడతానని చెప్పిందికదూ? ఆ మాటలు విన్నే నీవు నన్ను చంపటానికి తయారయావ్! డాక్టర్! నీ కన్న పసిపిల్లవాడు నయం! వాళ్ళ ప్లాన్ని తేలికగా అర్థం చేసుకునేవాను.

"నీవు నా రూమ్లోకి ప్రవేశించి నన్ను షూట్ చేసే సమయానికే వాళ్లు తెలివిగా హోటల్ యజమాను లకి ఫోన్ చేశారు. అంటే నీవు హత్య చేసిన మరుక్షణం హోటల్ వాళ్ళు నిన్ను బంధించేవాళ్ళు. నీకు వురిశిక్ష పడేది. తర్వాత రాఘవరావు సుజాత ఒకటైపోయేవాళ్లు."

నిరంజనరావు నమ్మలేనట్లుగా చూశాడు కమలా కరాన్ని.

"నేను ప్రతి చిన్న విషయంలోనూ జాగ్రత్తగా ఉంటాను. నా గది తలుపుకి సరిగ్గా పైన సీలింగ్కి మూడు అడుగుల వ్యాసంగల రౌండ్ మాగ్నెట్ వుంది. నా సీట్ ప్రక్కనే బటన్ నొక్కితే మాగ్నెట్ 'ఆన్' అవుతుంది. ఆగంతకుడి చేతిలో గాని లేదా మరో భాగంలో

దాచుకున్న రివాల్వరు, కత్తిలాంటి వస్తువేదయినా వెళ్ళి దానికి అతుక్కుంటుంది. అందుకే నీ ప్లాన్ ఫలించ లేదు."

"సుజాత మిమ్మల్ని హత్య చెయ్యమన లేదు. ఆ పనికి నాకై నేనే పూనుకున్నాను." అన్నాడు నిరంజనరావు.

"ఈ ప్రపంచంలో నీ అంతటి ఇడియట్ ఇంకొకడు ఉండడు. వాళ్ళ నిజరూపాలు నీ కళ్ళతో నీవే చూద్దువు గాని, పద."

అంటూ అతడి చేతిని తన చంకలో ఇరికించుకుని బయటకు నడిచాడు కమలాకరం.

అతడి రెండో చేతిలో సైలెన్సర్ రెడీగా ఉంది. అది అందరికీ కనిపించకుండా దానిమీద తన కోటు కప్పాడు కమలాకరం.

# 15

కారు కమలాకరం ఇంటికి కొంచెం దూరంలో ఆగింది.

"దిగి నడిచి వెళ్దాం! కారుని చూసి వాళ్ళు మనం వచ్చి నట్టు గుర్తించి జాగ్రత్తపడవచ్చు!" అన్నాడు కమలా కరం.

"మేమ్ సాబ్ ఆగయా?" కమలాకరం గూర్ఖాని అడి గాడు.

"అయా సైసాబ్!" అంటూ వాడు సలాం చేస్తూ చెప్పాడు.

"నేను లోపల ఉంటాను. కాని రాఘవరావుగాని, మేమ్‌సాబ్ గాని అడిగితే రాలేదని చెప్పు" ఉరిమాడు కమలాకరం.

"అలాగే సాబ్!" బిత్తరపోయాడు వాడు.

ఇద్దరూ వెళ్ళి డ్రాయింగ్ హాల్లో మెట్ల క్రిందుగా చీకటి నయ్యారంలో రెండు కుర్చీలు లాక్కుని కూర్చున్నారు.

"ఊపిరిగూడ గట్టిగా పీల్చకు. వాళ్లు మనని పని గట్టాగో మనకి దొరక్కుండా పారిపోతారు."

నిరంజనరావు తలవూపాడు. అతడికి నోట్లో నాలుక ఉండచుట్టుకుపోయినట్టయింది. మాటే రావటంలేదు. మనసు రాయిలా మొద్దుబారిపోయింది. అంతా ఏదో కలలాగ వుంది అతడికి.

పావుగంట గడిచింది. డ్రాయింగ్ హాల్ ఎంట్రెన్స్ తలుపు తెరుచుకుని వగరుస్తూ చెమటలు కారుస్తూ రాఘవరావు, సుజాత లోపలకు వచ్చారు. సుజాత విసుగ్గా తన చేతిలోని హ్యాండ్ బ్యాగ్ ని సోఫాలోకి విసిరేసింది. విచారంగా కూలబడింది.

"ఏదో పొరబాటు జరిగివుండాలి!" అన్నాడు రాఘవరావు ఆలోచనగా.

"అవును. ఈ పాటికి ఇక్కడికి పోలీసులు వచ్చి ఉండాల్సింది. శవాలూ, పత్రికా విలేఖరులూ, ఫోటో గ్రాఫర్లతో ఇల్లు సందడిగా ఉంటుందనుకున్నాం!" సుజాత అంది.

"ఏంజరిగి ఉంటుందంటావ్! ఆ బుద్ధావతారం రివాల్వర్ ని పట్టుకోవడానికి భయపడి పారిపోయి ఉంటాడా? లేక ఎక్కడైనా తప్పటడుగు వేశాడా కొంపదీసి!" అన్నాడు.

"అలా పారిపోయి ఉండడు. వాడ్ని నా అందంతో మెడదాకా ఊబిలో ముంచాను. ఛస్తే నానుంచి దూరం కాలేడు."

"లేదా ఆ ముసలాడు వాడ్ని ఎలకని పట్టేసినట్టు

పట్టుకుని ఉంటాడు. ఎగ్రికల్చర్ డిపార్టుమెంటుకు ఫోన్ చేసి పిలిపించి వాడ్ని క్షమా చేయించి ఉంటాడు. లేకపోతే ఈ సరికి ఆయనన్నా రావాలికదా?" రాఘవ రావు కంగారుగా అన్నాడు.

"పోతే పోనీ! పీడా విరగడ అవుతుంది! వాడు వచ్చినా నా పేరు బయటపెట్టడు! సరా!" సుజాత అను నయంగా అంది.

"మన పేర్లు రాకుండా ఉంటే బ్రతికిపోయామన్న మాటే! లేకపోతే ముసలాడు మనల్నికూడా ఖైదులెక్కి స్తాడు. వాడసలే పరమ కిరాతకుడు."

"అసలు డాక్టర్ 101 నెం. గదికి వెళ్ళేసరికే కమలా కరం తనరహస్య ప్రదేశం అతడికెలా తెలిసిందా అని ఆశ్చర్యపోతాడు. అంతేకాదు. హోటల్ కి ఎవరు ఫోన్ చేశారో కూడా ఆరాతీస్తాడు."

"నీవా విషయాల గురించి ఏమీ చెప్పద్దు. కమలాకరం నిన్ను ఏదడిగినా నాకేమీ తెలియదని చెప్పు!"

"ఇదేమన్నా కోర్టు అనుకున్నావా, నాకు ఏమీ తెలియదంటే కేసు కొట్టివేయటానికి! కమలాకరం మన చర్మం ఒలిపించి చెప్పులు కుట్టిస్తాడు. నాకెందుకో భయంగా ఉంది రాఘవా?"

"ఎందుకు భయం! నేనున్నానుగదా!" అంటూ ఆమె దగ్గరగా జరిగి ఆమె నుదుటిమీద ముద్దుపెట్టుకున్నాడు.

నిరంజనరావు చేతులు బిగుసుకున్నాయ్. పెదిమలు కొరుక్కున్నాడు.

"ఇస్తుంటే సంధిమంత్రంలా నీకూ ఇప్పుడే లవ్ కావాల్సి వచ్చిందా?" అంటూ సుజాత రుసరుసలాడింది.

"శాస్త్ర మొహం తుడుమనుని కొంచెం నవ్వు పులు ముకో నువ్వాన. కమలాకరం రాగానే శాస్త్ర ప్రేమ

నటించు. లేకపోతే మనమీద అనుమాన పడగలడు,"
రాఘవరావు చెప్పాడు.

అప్పటిదాకా ఓర్పుగా వింటున్న కమలాకరం లేచి నిలబడ్డాడు. అతడి కుడిచేయి పైకిలేచింది. ఆ తర్వాత ఏదో బుల్లెట్ గాలిలో దూసుకుపోయిన శబ్దం వినిపించింది. మళ్ళీ వెంటనే మరొకటి.

సోఫాలో కూర్చుని కబుర్లు చెబుతున్న రాఘవరావూ, సుజాతా ఇద్దరూ అరుస్తూ నేలకు ఒరిగిపోయారు. వాళ్ళ శరీరాల్లోంచి నెత్తురు పారింది. సోఫాలో రెండుచోట్ల నెత్తురు మడుగు అయింది.

కమలాకరం లేచి వాళ్ళదగ్గరకు వచ్చాడు.

"డాంగ రాస్కెల్స్! వీళ్ళని నమ్మినదెవరు?" అంటూ రాఘవరావు కణతకు రివాల్వర్‌ని నొక్కిపెట్టి మరో షాట్ పేల్చాడు. ఆ తర్వాత సుజాత కణతదగ్గర మరో షాట్.

నిరంజనరావు ఆ రెండు శవాల్ని చూసి బెంబేలుపడి పోయాడు.

అసలు కమలాకరం ఆ స్థితిలో ఉండాల్సిన వాడని అనుకున్నాడు. కాని విధి మరోలా నిర్ణయించింది.

"కదలకుండా అక్కడే కూర్చో డాక్టర్! మరో క్షణంలో నా అనుచరులువచ్చి వీటిని క్లీన్ చేసేస్తారు, ఒక చిన్న ట్రేస్ కూడ దొరక్కుండా! అసలు నేనిప్పుడు ఊళ్ళో లేనని రుజువు చేసుకుంటాను.

"ఇకపోతే వీటిని ఎలా డిస్పోజ్ చేస్తానంటావా? రేపుదయం ముగ్గురు వ్యక్తులు సముద్రంలో చేపలు పట్టాలని బోటులో వెళతారు. బోటు తిరగబడి పోతుంది. ఆ ముగ్గురూ సముద్రంలో పడిపోతారు. వారి ఆచూకీ అధికారులకు దొరకే లోపల సముద్రంలోని జలచరాలు

ఆశవాల్ని తినేస్తయి. ఆ స్త్రీపంజరాల్ని ఎవరూ గుర్తించ లేరు!''

''ఆ మూడో వ్యక్తి ఎవరు?'' నిరంజనరావు అనుమానంగా అడిగాడు.

కమలాకరం వికటంగా నవ్వాడు. ఇన్నాళ్ళూ నిరంజనరావు అతడ్ని మంచివాడుగా ఉండగా చూశాడు. ఇప్పుడు అతనిలో కర్కశత్వాన్ని చూస్తున్నాడు.

''ఇంకెవరు? నీవే! నీవుచేసిన స్వామిద్రోహానికి అదే తగిన శిక్ష. బోటులోంచి తప్పించుకు వద్దామని ఆశపడుతున్నావేమో! అక్కడ తీరంలో నా అనుచరులు కాచుకుని కూర్చుంటారు!''

కమలాకరం టెలిఫోన్ వైపు నడిచాడు.

నిరంజనరావు నరాల్లో విద్యుత్తు ప్రవహించింది. అతడి మనస్సు తేలుకుట్టినట్టుగా బాధతో విలవిల్లాడి మేలుకుంది. నిరంజనరావు హైస్కూల్లో ఫుట్ బాల్ ఆటలో ప్రావీణ్యం సంపాదించాడు. గోల్ ఎక్కడో గురిచూసి బంతికీ గోల్ కీ మధ్యదూరం ఎంత ఉందో క్షణాల్లో అంచనావేసి బంతిని తన్నేవాడు.

వెంటనే తన శరీరాన్ని బంతిలా కుంచించుకున్నాడు. శరవేగంతో గాలిలో ఎగిరి పిస్టల్ నుంచి బయటకు దూసుకుపోయే బుల్లెట్ లా వెళ్ళి కమలాకరాన్ని ఢీకొన్నాడు.

కమలాకరం క్రిందపడిపోయాడు. అతడి చేతిలోని సైలెన్సర్ దూరంగా పడింది. నిరంజనరావు పరుగెత్తి కెళ్ళి దాన్ని చేతిలోకి తీసుకుని నిటారుగా నిలబడ్డాడు.

అయితే పడిపోయిన కమలాకరం మళ్ళీ లేవలేదు. అతడి కళ్ళు తననే చూస్తున్నయ్. కనురెప్పలు ఆడటంలేదు. కనుగ్రుడ్లు కదలాడటంలేదు.

దగ్గరకు వెళ్ళి అతడి చేయిపట్టుకుని నాడి పరీక్షించాడు డాక్టర్ నిరంజనరావ్! అప్పటికే కమలాకరం గుండె కొట్టుకోవటం మానివేసింది.

శవాన్ని దాటుకుని వెళ్ళి రిసీవరెత్తి డయల్ చేశాడు.

"హలో ఇన్స్పెక్టర్ రాజారావ్ స్పీకింగ్!" వినిపించింది అవతలినుంచి.

## 16

డి. యస్. పి. ఆఫీసురూంలో నిరంజనరావు కుర్చీలో కూర్చుని ఉన్నాడు. అతడి ముఖంలో ఏ రకమైన భావాలూ లేవు.

ఇన్స్పెక్టర్ రాజారావు తనకెదురుగావున్న డి.యస్. పికి కేసునంతా చెబుతున్నాడు.

"కమలాకరం చట్టవిరుద్ధమైన వ్యాపారం ఏదో చేస్తున్నాడని మాకు చాలా కాలంగా అనుమానంగా ఉంది సార్! అయితే అక్కడ అందుకు తగిన సాక్ష్యాలు ఏవీ మాకు లభించలేదు. డాక్టర్ నిరంజనరావు నాకు ఫోన్ చేశాడు. జరిగిన సంగతి క్లుప్తంగా చెప్పాడు. అయితే అతడు చనిపోయినట్టు తెలిస్తే మిగతా నేరస్థులు, అతడి సహచరులు ఎక్కడికక్కడ మాయమవుతారు. అందుకని మేమంతా బిజినెస్ మెన్లా సూటూ బూట్లతో, బ్రీఫ్ కేసులు చేత్తో పుచ్చుకుని అతడి ఇంటికి వెళ్ళాం.

"కమలాకరానికి గుండెపోటు వచ్చిందనీ, డాక్టరు పర్యవేక్షణ క్రింద ఉన్నాడనీ అతడ్ని ఎవరూ కలవటానికి వీల్లేదని ప్రకటించాం. అతగాడికి ఒకరోజులో వచ్చిన ఫోన్ కాల్స్ అన్నిటినీ ట్రేస్ చేశాం. ప్రతి స్టేట్ హెడ్ క్వార్టర్స్కీ మెసేజీలు పంపాం.

"అదే ఆధారంగా అతడి వ్యాపార సంస్థలన్నిటి

మీదా ఒకరోజున అన్ని ప్రదేశాల్లోనూ రెయిడ్ జరిపారు. నేరసులు తగిన ఆధారాలతో దొరికారు. విదేశాలనుంచి పెద్ద ఎత్తున దిగుమతి అయిన మత్తుపదార్థాలను పోలీసు వారు హాండ్ ఓవర్ చేసుకున్నారు! ఇదంతా డాక్టర్ నిరంజనరావు ఇచ్చిన సమాచారం వల్లనే వీలయింది."

"వెల్ డన్ డాక్టర్! మీ సహాయానికి ప్రభుత్వం నుంచి పెద్ద మొత్తంలో బహుమతి రావచ్చుగూడా!" అన్నాడు డి. యస్. పి. అతడికేసి చూస్తూ.

"అయితే నన్ను అరెస్ట్ చేయటంలేదా?"

"అరెస్టా? మీరు ఏ నేరం చేశారని?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

"కమలాకరాన్ని హత్యచేయటానికి ప్రయత్నించాను గదా?" ఆశ్చర్యంగా అన్నాడు నిరంజనరావు.

"ఓ! అదా! కానీ మీరు హత్యచేయలేదు! మీ కధను ప్రాసిక్యూషన్ వారు ఒప్పుకోకపోవచ్చు. పైగా మీ సహాయంవల్ల దేశానికి ద్రోహంచేస్తున్న నేరసుల ముఠాను అరెస్టు చేయటానికి వీలయింది! కనుక యూ ఆర్ నౌ ఫ్రీ, డాక్టర్!" అంటూ భుజంతట్టాడు డి. యస్. పి.

డాక్టర్ నిరంజనరావు హాయిగా వూపిరి పీల్చాడు.

—:ఐ పో యిం ది:—

# తొమ్మిదేళ్ళ క్రితం హంతకుడు?

మిస్. మధుబాల

రాత్రి తొమ్మిదన్నర అయివుంటుంది.

నేనిక్కడ భానుపురిలో యస్. ఐగా చార్జి తీసుకుని రెండు రోజులయింది. మా ఇంచార్జి భుజంగరావు క్వార్టర్లో మకాం వేశాను. ఆయనకు నలభయి అయిదేళ్ళుంటాయి. నాకు ఇల్లు దొరికేవరకు తన క్వార్టర్లో వుండమంటూ వీలయినంత త్వరలో ఇల్లు చూసుకోమని హెచ్చరించా డాయన.

నా బెడ్ పై వెనక్కి వాలి పుస్తకం చదువుకుంటున్నాను.

ఇంతలో బయటనుండి ఎవరో తలుపు దబదబ బాదుతూ "సార్...సార్!! తలుపు తీయండి అర్జెంటు"

అంటూ అరుస్తున్నాడు.

"ఎవడ్రా అరిచేది!" భుజంగరావు బిగ్గరగా అరిచారు.

"నేను వెంకోజీని. తలుపు తెరవండి సార్!" బయట నుండి వెంకోజీ అనే కానిస్టేబుల్ అరుస్తున్నాడు.

"ఎందుకురా ఆ అరుపులు రాత్రుళ్ళు నిద్రకూడా పోనీయవా?" అంటూనే భుజంగరావు తలుపు తీసారు. అప్పటికి నేనూ అక్కడకు చేరుకున్నాను.

"సార్;" వెంకోజీ కంగారుగా అన్నాడు "ఎవరిదో ఫోన్ వచ్చింది."

"అబే! ఫోన్ వస్తే పోలీస్ స్టేషన్‌లో వాళ్ళందరూ చచ్చారా?"

"అదికాదు సార్; నన్ను హెడ్ గారు పంపించారు. ఫోన్ చేసినతను బాగా గాయపడినట్లున్నాడు. మీతో ఏదో ముఖ్యమయిన విషయాలు చెప్పాలంటున్నాడట."

"ఎవడికో సగం రాత్రి వేళాకోళం తోచివుంటుంది. తన పేరేమిటో చెప్పాడా!"

"ఏమీ చెప్పడం లేదుసార్! కేవలం మీతో మాట్లాడాలంటున్నాడు."

"వాడు ఉఫ్...విజయ్! నువ్వు వెళ్ళి వాడేంమాట్లాడాలనుకుంటున్నాడో విను" నా వైపు తిరిగి ఆదేశించారాయన.

నేను వెంకోజీవెంట పోలీస్ స్టేషన్ చేరుకున్నాను. ఫో నందుకుని "హల్లో! నేను ఇన్‌స్పెక్టర్ విజయమోహాన్ని మాట్లాడుతున్నాను. మీ రెవరు? మీ కేం కావాలి?" అడిగాను.

"ఇ...న్స్...ఇన్స్...పెక్టర్!" అవతలనుండి చిన్న మూలుగుతో కూడిన స్వరం వినిపించింది.

"అవును" నేను వెంటనే అన్నాను. "చెప్పు; ఏం

చెప్పాలనుకుంటున్నావ్? ఎందుకలా మూల్గుతున్నావ్ ఏమయిందో చెప్పూ?"

"నా...పొట్ట...లో కత్తి దిగబడి వుంది ఇన్స్పెక్టర్...హుఁ! నేను చచ్చి...పోతున్నాను."

"నువ్వెక్కడినుండి మాట్లాడుతున్నావు?"

"గోఖలేరోడ్...గోఖలేరోడ్...అమ్మా!"

"నిన్ను చంపాలనుకుంది...నిన్ను పొడిచింది ఎవరో చెప్పగలవా?" ఆతృతగా అడిగాను.

"వద్దు...ప్లీజ్!...వద్దు... నన్ను చంపొద్దు... హుఁ! అమ్మా..."

అంతే— ఆ తరువాత అటువైపునుండి లైన్ కట్ అయింది. అతను హంతకుని గూర్చి చెప్పబోతున్నపుడు తిరిగి అతనిపై దాడి జరుపబడిందని స్పష్టంగా అర్థమయిపోయింది.

నేను వెంటనే ఇరువురు కానిస్టేబుల్స్ వెంకోజీని, యాకూబ్ని వెంట పెట్టుకుని గోఖలేరోడ్ వైపు సాగిపోయాను.

మేము ఘటనాస్థలానికి చేరుకునేసరికి పదిన్నర పైనే అయింది. అప్పటికి గోఖలేరోడ్లోని షాపులన్నీ మూసివేయబడి వున్నాయి.

అంతలో ఒక వ్యక్తి కంగారుగా "హత్య...హత్య" అని అరుస్తూ మా వైపు పరుగెత్తుకు వచ్చాడు.

అతన్ని ఆపి ఎందుకింత కంగారుగా పరుగెత్తుతున్నావని నేనడిగినందుకు జవాబుగా అతను "నేను నా స్నేహితుడికి ఫోన్ చేయడానికి ఫోన్ బూత్లోకి వెళ్ళాను. బూత్లో ఒకతను నెత్తురు మడుగులో పడివున్నాడు. ఒక కత్తి కడుపులోను, మరొకటి వీపులోనూ దిగబడి వున్నాయి...ఉఫ్..." చెప్పి బరువుగా వూపిరి పీల్చి

వదలసాగాడతను.

“ఫోన్ బూత్ ఎక్కడుంది?” అదెక్కడుందో తెలియనందువల్ల అడిగాను.

“ఆయియే సాబ్! మై బతాదూంగా” అంటూ యాకుబ్ దారితీశాడు. అతణ్ణనుసరించాను.

ఆ వ్యక్తిని వెంట పెట్టుకుని బూత్ వద్దకు చేరుకున్నాను.

బూత్ తలుపు సగానికి తెరుచుకుని వుంది. వీధిలో వున్న లాంప్ పోస్టు వెలుగు మందంగా బూత్‌లోకి ప్రసరిస్తోంది.

అతని శరీరం పైన బాగా నలిగి మాసిపోయిన పాంటు, షర్టు వున్నాయి. అస్తవ్యస్తంగా వున్న చింపిరి జుట్టు, దట్టంగా పెరిగిన గడ్డం, కళ్ళచుట్టు నల్లని వలయాలు, చూడగానే అతను ఏ త్రాగుబోతో, లేక పిచ్చివాడో, అనిపిస్తుంది. ఇంచుమించు నలభయ్యేళ్ళుంటాయతనికి.

ఒక కత్తి పొట్టలో దిగబడివుంది. అది బహుశా ఫోన్ చేయడానికి ముందు పొడిచి వుంటాడు హంతకుడు. రెండవది ఫోన్ చేస్తున్నప్పుడు పొడిచి వుంటాడు. అది వీపులో బలంగా దిగబడివుంది. సూటిగా గుండెల్లోకి దిగబడి వుండాలది.

చేయవలసిన తతంగమంతా జరిపి, తరువాత మొదటగా శవాన్ని చూసిన వ్యక్తి స్టేట్‌మెంట్ తీసుకోడానికి అతణ్ణి వెంకోజీ వెంట స్టేషన్‌కి పంపాను. శవాన్ని ఫోటోలు అవీ తీసిన తరువాత పోస్టుమార్టమ్‌కి పంపాను.

ఆ రాత్రి రెండుగంటల ప్రాంతంలో నేను ఇన్స్పెక్టర్ గారింటికి చేరుకుని నిద్రపోయాను.

రెండవరోజు వుదయం స్టేషన్‌కి వెళ్ళి ఆ వ్యక్తి స్టేట్‌మెంట్ తీసి చదవసాగాను.

కొద్దిసేపటికి పేపర్ బోయ్ ఆ రోజు పేపరు తీసుకు-

వచ్చాడు. అతను నా చేతిలో హంతుని ఫోటో చూసి "అరే...!" అన్నాడు.

"ఏం ఇతను నీకు తెలుసా?" కుతూహలంగా ప్రశ్నించాను.

"మనిషి తెలుసు సార్, పేరు తెలియదు."

"ఎవరతను?"

"అదికూడా తెలీదు సార్! బహుశా పిచ్చివాడై వుండాలి. ఎప్పుడో వస్తాడు... నెలా రెండు నెలలు ఈ వూళ్ళో వుంటాడు. ఆ తరువాత మాయమవుతాడు. అతనేం చేసేది ఏ వూరినుండి వచ్చేది తెలియదు."

"ఇక్కడ ఎవరిని కలిసేవాడు."

"భవానీ నగర్‌లో వుంటున్న కలప కాంట్రాక్టర్ విద్యాసాగర్ బాబుతో చాలా సార్లు చూశాను."

ఆ పేపర్ బోయ్ అంతకంటే ఎక్కువ చెప్పలేక పోయాడు.

## 2

భవానీనగర్ ప్రాంతం చేరడానికిముందు ఒకవైపు విశాలమయిన మైదానముంది. మరోవైపు పెద్ద చెరువు. చెరువు గట్టువెంట కొంత మేర మామిడి తోట దట్టంగా వుంది.

ఆ చెరువువద్దకు చేరుకోగానే నా కాళ్లు ముందు కెళ్ళనని మొండికేసాయి. తొమ్మిదేళ్ళ క్రితం నేను నిలబడివున్న చోటే ప్రేమ శవం బయటపడింది. అప్పుడు నేను మా రఘునాధరావు బాబాయిని చూడటానికి వచ్చాను. ఆ విషయమే ఆలోచిస్తూ నిలబడ్డాను.

"ఏమిటోసార్; చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నారు" యాకూబ్ నన్ను గమనించి అడిగాడు.

"యాకూబ్ మియాఁ! నీవు నన్ను గుర్తుపట్టలేదా?"

అతను నన్ను పరీక్షగా చూసి తలగోక్కుని "ఊహుఁ!" అన్నాడు.

"ప్రయత్నం చేయి. నేనిదివరకోసారి ఇక్కడకు వచ్చాను."

యాకూబ్ నన్ను మళ్ళీ పైనుండి క్రిందివరకు పరికించి చూసి "ఊహుఁ! జ్ఞాపకం రావడంలేదు హుజూర్" అన్నాడు.

"గుర్తుచేసుకో యాకూబ్ మియాఁ! తొమ్మిదేళ్ళక్రితం ఇక్కడ ఇంచార్జిగా రఘునాధరావుగారుండేవారు. వారి ఇంట్లో విజయ్ అనే ఒక అబ్బాయి..."

"అరెరే; విజయ్‌మోహన్ బాబూ! అల్లాదయా మయుడు బాబూ! మిమ్ముల్ని మళ్ళీ చూస్తానని నేననుకోలేదు. ప్చ్. ఆ రోజులే వేరు" అంటూ అతను ఆనందపడిపోసాగాడు. ఇల్లు దొరికింతరువాత నా శ్రీమతిని తీసుకువస్తానని చెప్పాను.

"అదిసరే; నడుస్తూన్న వాణ్ణిలా నేనిక్కడ ఎందుకు ఆగిపోయానో తెలుసా?" అడిగాను.

"లేదు బాబూ! మీరెందుకు ఆగారో నాకెలా తెలుస్తుంది?"

"సీతా కేసు జ్ఞాపకం వుందా? ఆ కేస్‌లో బాబాయ్, ఊరువాలు పరుగులతో పనిచేశాడు. అయినా ఫలితం లభించలేదు."

"ఏ కేస్ బాబూ!" యాకూబ్ నా కేసి విచిత్రంగా చూస్తూ అడిగాడు.

"అరే, అదికూడా మరచిపోయావా! ఈ చెరువులోనే కదా ఒక అమాయకురాలయిన అమ్మాయి శవం దొరికింది. శవంతోపాటు పచ్చరంగు సూట్‌కేస్ కూడా దొరికింది.

రుందా?"

"ఓహ్! అదా బాబూ! అది మరవాల్సిన కేసా, దొంగ
రా పట్టుకోవడానికి వచ్చాము. తీరా మా చేతికి శవం
భించింది. అవును ఇదే చెరువులో. అదిగో అక్కడకదా
శవం బయటపడింది."

"అవును. నాకిప్పుడు ఆ విషయం జ్ఞాపకంవచ్చి ఆగి
యాను" నేను చెప్పసాగాను. "ఆ కేస్ ఎక్కడి
క్కడే ఆగిపోయింది. 'రోజ్ విల్లా' అనే ఆ ఎర్ర
గళాలో వుండే హంతకుడు సదానంద్, బాబాయి
త ప్రయత్నించినా దొరకనే లేదుకదా!"

"అవును సార్" యాకూబ్ ఒకసారి దీర్ఘంగా
ారుస్తూ అన్నాడు. "మీ బాబాయిగారు ఇక్కడ
్లనులో వున్నంత కాలంలో ఆయనసాల్వ్ చేయలేక
యిన కేస్ అదొక్కటే!"

"పదపోదాం," అంటూ ముందుకు కదిలాను.

మా ఇద్దరి సంభాషణను కుతూహలంగా విన్న మరో
రు కానిస్టేబుల్స్ కూడా మాతోపాటు సాగారు.

## 3

విద్యాసాగర్ ని చూడగానే నాలో సద్భావన కలిగింది.
మనిషికి యాభయి ఏళ్ళుంటాయేమో! ఎప్పుడూ నవ్వు
నే వుంటాడు. ఆయన గుబురు మీసాల్లో అక్క
డ నెరిసిన వెంట్రుకలు ఒకవింత అందాన్నిస్తాయా
ను.

"అరే! నీవు రఘునాధరావుగారి అన్నయ్యగారి
బ్బాయివా. వెల్! నీవూ మీ చిన్నాన్నలాగే ఇన్స్
పె అయ్యావన్నమాట. మీ చిన్నాన్న నేనూ
స్నేహంగా వుండేవాళ్ళమోయ్."

యాకూబ్ నన్ను పరిచయం చేయగానే నాతో చేయి కలుపుతూ ఆయన అన్నమాట లివి.

నేను చిన్నగా నవ్వి వుండిపోయాను.

"ఇంతకూ నావద్దకు ఏ పనిమీద వచ్చినట్లో చెప్పలేదు" మామూలు మర్యాదల తరువాత ఆయన అడిగాడు.

"ఈ ఫోటో చూడండి. ఈ వ్యక్తిని మీరు గుర్తించగలరేమో చెప్పండి," జేబులోంచి ఫోటో తీసి ఆయనకిస్తూ అడిగాను.

ఆయన ఆ ఫోటోని పరీక్షగా చూశాడు. చూస్తూండగానే ఆయన ముఖభావాల్లో పరివర్తన వచ్చింది.

"యస్; తెలుసు" గంభీరంగా అన్నాడాయన. "ఇంతకీ విషయమేమిటి? ఫోటోలో మనిషి పడివున్న తీరు అదీ చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది."

"మీ అనుమానం నిజమే విద్యాసాగర్ గారూ!"

"అంటే?"

"అతను హత్యచేయబడ్డాడు."

"నిజమా!" ఉలిక్కిపడి కూర్చున్న చోటినుండి కొంచెంగా లేచి తిరిగి కూర్చుంటూ అన్నాడు. "మే గాడ్ బ్లెస్ హిజ్ సోల్. అతను అంత మొండివాడు కాకుంటే బాగుండేది. చివరకు భయపడినంతా అయింది."

"ఏమిటి మీరంటున్నది. ఎటువంటి భయం విషయం మీరు చెబుతున్నారు?"

విద్యాసాగర్ ఒక్క నిమిషం ఆగి చెప్పసాగాడు:

"అతని పేరు ప్రతాపరావు. అతని ముఖం చూసే మీరు పిచ్చివాడని గ్రహించవచ్చు. మద్రాస్‌లోని ఏదో ప్రయివేట్ కంపెనీలో కెమిస్ట్‌గా పనిచేస్తున్నట్లు చెప్పాడు. అతని పరిశోధనకి అవసరమయిన కొన్ని మూలికలు భానుపుర ప్రాంతంలోని అడవుల్లో దొరుకుతాయని అతనికి

లిపించదట. నేను కలప కాంట్రాక్టర్ నని నా వద్దకువచ్చి
తో పాటు అడవులకి వచ్చేవాడు. అంతే. అంతకుమించి
మధ్య ఎక్కువ పరిచయంలేదు.''

''థాంక్స్. కాని మీరు ఇంకా ఏదో చెప్పబోయి
గారు.''

''ఆc! ఆc! అవును. కాని సందేహిస్తున్నాను.''

''నో; నో. సందేహమెందుకు చెప్పండి'' అడిగాను.

''మిస్టర్ విజయమోహన్! నేను చెప్పేది విని మీరు
గుళా నవ్వుకోవచ్చు'' అతను చెప్పసాగాడు. ''లేదా
వి పాతచింతకాయ పచ్చడి భావాలు అనుకోవచ్చు.
ని ప్రతిమనిషికి తన అనుభవం పాఠం నేర్పుతుంది.
మూగుడు నేను ఎంత చెప్పినా వినకుండా దయ్యాల
కనా ఖద్దరు తీసుకుని వుండటం మొదలుపెట్టాడు.''

''దయ్యాల మేడా?'' నేను అనుమానంగా అడిగాను.

''అవును.''

''మీరు చెబుతున్నది ఒకవేళ రోజ్ విల్లాను గురించి
కదా?'' అంతవరకు మా మాటలు వింటున్న
కూబ్ అడిగాడు.

'అవును; ఈ రోజ్ విల్లాలో దిగిన వాళ్ళెవరూ సుఖ
సోషాలతో వుండలేదు అన్నవిషయం తెలిసికూడా
అందులోనే ఖద్దరు దిగాడు.''

...నుకోకుండా నే నాలో ఉత్సాహం కలిగింది.
టే మీ వృద్ధకాలంలో ఇంతకుముందుకూడా ఈ బంగ
ఏవయినా హత్యా ప్రయత్నాలు జరిగాయా? అ
కారే ఇప్పుడు ప్రతాపరావునికూడా పొడిచి చంపా
రారా?'' అడిగాను.

ఉద్వేగాన్ని చూసి విద్యాసాగర్ ఆశ్చర్య
ాను. అతను విస్మయంగా నాకేసి చూడసాగాడు.

ఆ ఒకటి రెండు నిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"మీది యువక రక్తం విజయమోహన్ గారూ!" గది లోని మౌనాన్ని భంగపరుస్తూ అన్నాడు. "మీ దృష్టి కోణం వేరుగా వుంటుంది. కాని ఈ విషయంలో నేను మీకంటే పెద్దవాణ్ని. ఇలా అన్నానని నేను భూత ప్రేతాలని స్వయంగా చూశానని మాత్రంకాదు. నేను విన్నదానినిబట్టి, ఇతరులు చెప్పిన దానినిబట్టి ఒక నిర్ణయానికి వచ్చాను. ఈ రోజ్ విల్లాకూడా దయ్యాలమేడే నని నా నమ్మకం."

"విద్యాసాగర్ గారూ! దయ్యాలు వున్నాయో, లేవో నాకు తెలియదు. కాని గోఖలేరోడ్ లోని ఫోన్ బూత్ లో ఒకమనిషిని భూతాలు కత్తితో పొడిచి చంపాయనేది మాత్రం వివాదాస్పదం. ఆ విషయం నేను నమ్మను. రోజ్ విల్లాను గురించి ప్రజలు అనుకునేది కేవలం ఒక అపవాదేనేమో!"

విద్యాసాగర్ కి నా సమాధానం సంతృప్తి పరచి నట్లుంది. ఇంకేమీ మాట్లాడలేదు.

ప్రతాపరావు హత్య విషయంగా అతని పూర్వాపరాలు సేకరించాలనివస్తే మధ్యలో రోజ్ విల్లా ప్రసంగం వచ్చింది. రోజ్ విల్లాని గురించి వీలయినంత ఎక్కువ వివరాలు సేకరించాలి అన్న ఉత్కంఠ నాలో ఎక్కువయింది.

ముఖ్యంగా రోజ్ విల్లాలో తొమ్మిదేళ్ళక్రితం ప్రేమను హత్యచేసిన హంతకుడు సదానంద్ బసచేసేవాడు. అతని గురించి తెలుసుకోవాలని ఆరాటం ఎక్కువయింది నాలో. అతను చిత్రకారుడు. పోలీస్ రికార్డులో ప్రేమను హత్య చేసి పారిపోయిన అపరాధిగా అతని పేరు వుంది.

"మీరు చాలా తెలివయినవారు ఇన్స్పెక్టర్" విద్యా

ాగర్ అన్నాడు. "మీరు ప్రతి విషయాన్ని తార్కి
ంగా ఆలోచిస్తారు. కాని ఈ ప్రతాపరావు మరణంలో
ఏ ఎర్రబంగళా ప్రేతనిలయమేఆనే నా అనుమానం
ురింత దృఢమయింది."

"ప్రతాపరావుని ఆ ఇల్లు అద్దెకు తీసుకోవద్దని మీరు
ెప్పినట్లు చెప్పారు కదూ?"

"చెప్పాను. కాని అతను వింటేనా. నేను మీకు
ుందే చెప్పినట్లు నేను కేవలం పరిచితుణ్నే కాని
్నేహితుణ్ని కాకపోవటంవల్ల ఎక్కువ ఒత్తిడి చేయలేక
ోయాను. అతను మొదటిసారిగా తనకో ఇల్లుకావాలని
డిగినపుడు నేనతనికి రెండు మూడు ఇళ్ళు చూపించాను.
ాని అతనికి ఎవరో రోజ్ విల్లా గురించి చెప్పారు.
తనికా బంగళా నచ్చింది. నామాట పెడచెవినబెట్టి
తను ఆ ఇంటిని అద్దెకు తీసుకున్నాడు. ఎప్పుడూ జరిగి
ట్లే ఆరునెలలో అతను చనిపోయాడు" విద్యాసాగర్
దో ఆలోచిస్తూ అన్నాడు.

"ఎప్పుడూ జరిగినట్లా? అదేమిటి!?" ఆశ్చర్యంగా
డిగాను. అతనిమాటలు నిజంగానే నాకు విస్మయాన్ని
లిగించాయి.

"ఈ రోజ్ విల్లాలో బసచేసిన వాళ్ళెవరూ ఆరునెలల
ంటే ఎక్కువ వుండలేదు. ఈ లోపలే ఆ ఇంటి సభ్యు
లో ఎవరో ఒకరు మరణించడమో, లేక దుర్ఘటనా
సులు కావటమో జరుగుతుంది."

"మీ కథ్యంతరం లేకుంటే దాని గురించి వివరంగా
ప్పండి."

"మీకంత ఇంటరెస్టింగ్ గా వుంటే సంక్షిప్తంగా
బుతాను వినండి" విద్యాసాగర్ చెప్పసాగాడు.

"ఈ రోజ్ విల్లాని రాంగోపాల్ అనే వ్యక్తి కట్టిం

చాడు. అతను ఉత్తర భారతదేశంనుండి వచ్చాడు. భవన నిర్మాణం కాగానే అతనిందులోకి గృహప్రవేశం చేశాడు. కాని నాలుగు నెలల్లోనే ఆ ఇంట్లో చావులు మొదలయ్యాయి. మొదట అతనిభార్య మశూచికంగల్ల మరణించింది. ఆ తరువాత అతని ముసలితల్లి, కొన్నాళ్ళ తరువాత ఇద్దరు అమ్మాయిలు మరణించారు. దాంతో అతను కంగారెత్తి ఈ బంగళాని అతితక్కువ వెలకి అమ్మి వూరువదలి పోయాడు.

"అతనివద్ద ఈ బంగళాని దేవనాథ్ కొన్నాడు. ఆధునిక భావాలుగల అతను శుభాశుభాలను లెక్క చేయక ఇందులో వుండసాగాడు. మూడునెలలు గడుస్తూండగానే అతని పెద్దకొడుకు పిచ్చెత్తి ఇల్లువదిలి పోయాడు. అతనేమయాడో ఇంతవరకూ ఎవరికీ తెలియదు. దాంతో అతనుకూడా ఈ ఇల్లువదిలిపోయాడు.

"ఆ తరువాత ఈ రోజ్ విల్లా సుమారు రెండు సంవత్సరాల వరకు ఖాళీగా వుండింది. ఆలోగా ఆ ఇంటి కొచ్చిన చెడ్డపేరుని గమనించి ఎవరూ అందులో వుండడానికి సాహసించలేదు. చాలారోజుల తర్వాత ఆ ఇంటిని ఒక ఫారెస్ట్ ఆఫీసర్ అద్దెకు తీసుకున్నాడు. కాని వారం తిరక్కుండానే వారి జీపు దుర్ఘటనకు లోనైంది. భార్యాభర్తలుతప్ప మిలిగిన పిల్లలందరూ చనిపోయారు."

"మైగాడ్! ఈ ఇంటి వెనుక చాలా భయంకరమయిన చరిత్రవుంది" అన్నాను విస్మయంగా.

"అవును; ఆ తరువాత చాలా ఏళ్ళవరకు అది ఖాళీగా వుండింది. చివరకు సదానంద్ అనే చిత్రకారుడు అందులోకి వచ్చాడు. నాలుగు నెలలు తిరక్కుండానే అతనిపై కూడా ఆ ఇంటి ప్రభావంపడింది. అతనికి టి. బి. అటాక్

యింది. ఆ తరువాత ఏదో ఆవేశంలో ప్రేమ అనే ఒక
మాయదురాలిని చంపి ఎక్కడికి పారిపోయాడో ఎవరికి
లియదు. ఇప్పుడు ప్రతాపరావు విషయం మీరు
రాస్తూనే వున్నారు'' అంటూ అతను ఆ రోజ్ విల్లాను
రించిన చరిత్రను ముగించాడు.

నేనేమీ మాట్లాడలేదు. నిజం చెప్పాలంటే అతను
ప్పింది విని నేనూ ప్రభావితుణ్ని అయాను.

''మీరు ప్రతాపరావుని గురించి ఇంకా ఏమయినా
ప్పగలరా?'' ఆలోచనలనుండి తేరుకొని అడిగాను.

''యస్; ప్రతాపరావు చాలా రోజులపాటు హైద్రా
ాద్‌లోని పిచ్చాసుపత్రిలో చికిత్స పొందాడు. ఏదో
ాక్సిడెంట్‌లో అతని మెదడు దెబ్బతినింది. సంవత్సరం
తం అతను అక్కడినుండి డిస్చార్జి అయ్యాడు.''

''అత నెక్కడి వాడు. అతనివాళ్ళు ఎవరయినా
న్నారా?'' అడిగాను.

''ఊహుఁ! ఆ విషయాలేవీ అతను చెప్పలేదు. నేనూ
డగలేదు.''

''మీ వుద్దేశంలో అతని శత్రువులెవరైనా వుంటారు?
ని పూర్వాపరాలు ఏమయినా మీకు తెలుసా!''

''నో; ఆ విషయాలన్నీ మీరే కనుక్కోవాలి. నేను
కాంట్రాక్టు చూసుకోనా, లేక డిటెక్షన్ చేయనా''
్వుతూ అన్నాడు.

ఇక అడగాల్సిందేమీ లేక నేనూ అతనివద్ద సెలవు
ుని బయటపడ్డాను. నా ఆలోచనలన్నీ ఆ రోజ్ విల్లా
నే వున్నాయి.

4

హైద్రాబాద్ మెంటల్ హాస్పిటల్‌కి ట్రంకాల్ చేసి
ాపరావు విషయాలు, అతనెక్కడివాడు, ఎలా ఆక్సి

డెంట్ అయింది మొదలగు విషయాలు తెలపమని రిక్వెస్ట్ చేశాను. అక్కడినుండి ఇంకా జవాబురాలేదు. ఎదురు చూస్తూ కూర్చున్నాను.

ప్రతాపరావు కేస్‌నుండి నా మనస్సు మళ్ళీ ప్రేమ హత్య కేస్‌పై మళ్లింది. ప్రేమను చంపి సదానంద్ ఎక్కడికి పారిపోయి వుంటాడు. అతనికి టి. బి. వుండింది. ఏదయినా హాస్పిటల్‌లో జాయిన్ అయివుంటాడా! ఒకవేళ అయివుంటే అతనీపాటికి బాగుపడి డిస్చార్జి అయివుండాలి. నిజంగానే రోజ్ విల్లాలో దయ్యాలు నివసిస్తున్నాయా...?

యాకూబ్‌ని పిలిచి డిస్ట్రిక్ట్ హెడ్ ఆఫీస్‌కివెళ్లి పాత కేస్ డైరీస్ తీసుకురమ్మని పంపాను. ప్రేమ హత్యకేస్ విషయంపై క్షుణ్ణంగా స్టడీచేయాలని నా వుద్దేశం.

యాకూబ్ వెళ్లిపోగానే ప్రతాపరావు మర్డర్ కేస్‌పై ఇప్పటివరకు పరిశోధించిన విషయాలన్నీ రిపోర్ట్ రాశాను. కాగితాలు సర్దుతూండగానే టెలిఫోన్ మ్రోగింది. "ట్రంకాల్ ఫ్రమ్ హైద్రాబాద్..." అపరేటర్ స్వరం వినిపించింది.

"కనెక్ట్ టు మి."

అవతలినుండి జవాబు రాగానే నేనడిగాను... "మీ రికార్డ్సలో ప్రతాపరావు గారి అడ్రస్ వుందా?"

"సారీ; ఇన్స్పెక్టర్" అవతలినుండి జవాబు వచ్చింది. "ఈ విషయంలో మేము మీ కెక్కువ సహాయాన్ని ఇవ్వలేమనుకుంటాను. ప్రతాపరావు బంధుమిత్రు లెవరైనా అతన్ని యిక్కడ ఎడ్మిట్ చేసి వుంటే మా రికార్డ్‌లో అడ్రస్ వుండేది. కాని, మాకీ కేసుని లోకల్ పోలీసులు రిఫర్ చేశారు. మాకు తెలిసినంతవరకు ఎవరో ఇతనిపై వెనుకనుండి ఆక్రమణజరిపి అతన్ని తల బద్దలు

కొట్టారు. స్పృహలేని స్థితిలో పోలీసు అతణ్ని కను గొన్నారు. స్పృహరాగానే అతను తన పేరూ, విలా సము మొదలయినవి మరచిపోయి పిచ్చి పిచ్చి పనులు చేయసాగాడు. దాంతో పోలీసులు ఇతణ్ని మా కప్పగిం చారు. అతని జేబుల్లో అతని అడ్రసు కాని, ఇతర వివరాలు సూచించే కాగితాలు ఏమీ లేవు. అతని కుడిచేతిపై 'ప్రతాపరావు' అన్న పచ్చబొట్టుతప్ప మరే ఆధారాలు లేవు."

"ఓహ్!" నిట్టూరుస్తూ అన్నాను.

"అదయినా అతని పేరో కాదో తెలియదు" అవతలి వ్యక్తి తిరిగి చెప్పసాగాడు. "మేమా పేరునే రిజిస్టర్లో నమోదు చేశాం."

"అతను మీవద్ద ఎన్నాళ్లున్నాడు?"

"సుమారు ఎనిమిది సంవత్సరాలపాటున్నాడు."

"అతని మనఃస్థితి పూర్తిగా కోలుకున్న తరువాతే అతను డిశ్చార్జి అయ్యాడా?"

"యస్; అతనికి తన పాతవిషయాలన్నీ జ్ఞాపకం వచ్చాయి."

"అతణ్ని అడిగి మీరు రిజిస్టర్ ఫిలప్ చేయలేదా?"

"కేస్ చాలా పాతదికావటంతో ఎవరూ అంతగా ఆ విషయంపై ఆసక్తి చూపలేదు ఇన్స్పెక్టర్. కాని ఒక రిద్దరు నర్సులతో అతను బి. కామ్. పాస్ అయ్యానని ఏదో బాంకులోనో, ఫర్మ్‌లోనో పనిచేస్తున్నట్లు చెప్పా డన్నాడు."

"వ్వాట్!?" నేను ఒక్కసారిగా వులిక్కిపడుతూ అన్నాను. "మీరేమంటున్నారు...అతను...అతను... బి. కామ్; పాస్ అయ్యాడా?"

"అయివుండాలి; ఎందుకంటే చివరిస్టేజిలో అతను

ఇక్కడి సర్జన్ కుమారునికి కామర్స్ ట్యూషన్ చెప్పాడు.”

అవతలినుండి వచ్చిన మాటలు విని నేను స్తబ్దుణ్ని అయిపోయాను. విద్యాసాగర్ చెప్పిన విషయాలు నా చెవుల్లో గింగురుమంటున్నాయి. ప్రతాపరావు కెమిస్ట్ అని ఆయన చెప్పాడు. అటువంటప్పుడు అతను సైన్సు గ్రాడ్యుయేట్ అయివుండాలి. మరి బి.కామ్...

ఆలోచనల్లో మునిగిపోయిన నేను ఆపరేటర్ హెచ్చరించడంతో తెప్పరిల్లి రిసీవర్ పెట్టేశాను.

నా మస్తిష్కంలో ఇంకా విద్యాసాగర్ చెప్పిన విషయమే తిరుగాడుతోంది. ఆయనెందుకలా చెప్పాడు. ఒకవేళ ఆయనకు అంతే తెలుసేమో! ప్రతాపరావు ఇక్కడికి రావడం... తప్పుడు పరిచయం తెలుసుకుని ఇక్కడ వుండటమూ.. ఇలా హత్యచేయబడటం వీటి వెనుక ఏదో పెద్దరహస్య ముందనిపించింది.

# 5

మధ్యాహ్నం పన్నెండు గంటలయి వుంటుంది.

ఆ మధ్యాహ్నం విద్యాసాగర్ నన్ను భోజనానికి ఆహ్వానించాడు. కాదనడానికి వీల్లేకపోయింది.

భోజనం పూర్తయిన తరువాత నేను వున్నట్లుండి పోతరాజుని గురించి అడిగాను. “నేనోసారి వాణ్ని కలవాలనుకుంటున్నాను. ఇక్కడే భవానీనగర్‌లోనే వుంటున్నాడటకదా?”

ప్రేమహత్య జరిగినప్పుడు ఆ నాటిన వెలుతురా అనుతో కుండానే ఆ హత్యను చూసిన సీనయ్య కొడుకువాడు. ఆ హత్య జరిగినప్పుడు వాడుకూడా తండ్రితోపాటు వున్నాడు. తండ్రి అనుమానితే కాలంచేశాడు. ఆ కేసుకు ప్రత్యక్షసాక్షి ఇప్పుడు వాడొక్కడే.

"ఈవిషయం ముందే చెప్పివుంటే నేను వాణ్ణిఅక్కడికే పిలిపించేవాణ్ణికదా?"

"ఎందుకులెండి శ్రమ."

"ఇంతకీ వాడితో మీకేంపని పడింది?"

"ప్రతి సంవత్సరమూ మేము గత పదేళ్ళుగా బ్లాక్ లిస్ట్‌లో వున్న కేసుల గురించి ఎంక్వయిరీచేసి ఐ.జీ. కి రిపోర్ట్ చేయాలి. ఇంతకు ముందున్నవారు ఏం రిపోర్ట్ ఇచ్చారో కాని; నేను మాత్రం ఎంక్వయిరీ చేయకుండా ఏవిధమయిన రిపోర్ట్ ఇవ్వకూడదని నిశ్చయించుకున్నాను. అందుకనే ప్రేమ మర్డర్ కేస్‌లో పోతరాజుని కొన్ని ప్రశ్నలడగాలని..."

"మీ కర్తవ్యపరాయణత్వాన్ని మెచ్చుకోక తప్పదు విజయమోహన్ జీ! మీ పోలీసులు ఇంత నిష్టగా పని చేస్తుంటే, మీకు సహాయంచేయడం మా విధి. వుండండి మనిషిని పంపుతాను" అంటూ అతను పోతరాజుని పిలవడానికి వెంటనే మనిషిని పంపాడు.

ఆ వెళ్ళిన మనిషి వచ్చేవరకు మేము సదానంద్‌ని గురించి మాట్లాడుతూ కూర్చున్నాం.

"విద్యాసాగర్ గారూ! సదానంద్ కూడా ఆ రోజ్ విల్లాలో నివసించేవాడు కదా!అతనిగురించి మీకేమయినా తెలుసా?" అడిగాను.

"అతను ఒకమంచి మిత్రుడు ఇన్స్‌పెక్టర్; అంతే కాదు, మంచి చిత్రకారుడుకూడా! రోజ్ విల్లాలోవున్న అతని పాతసామాన్లలో ఎక్కడో అతని కాన్వాస్ కూడా వుండవచ్చు. దానినిచూస్తే మీకే అగుపిస్తుంది అతనెంత మంచి కళాకారుడో! మేము ప్రతిరోజూ కలిసేవాళ్ళం. అతను ఎవరో అమ్మాయిని హత్యచేశాడని విన్నప్పుడు నమ్మలేకపోయాను."

"కాని అతను హత్య చేశాడన్నది మాత్రం నిజం. మీకు అతని అలవాట్లు ఏమయినా తెలిస్తే చెప్పండి."

"అతను చాలా మంచివాడు. చాలా మితభాషి. మృదువుగా నవ్వుతూ పలకరిస్తాడు. ఎటువంటి దురలవాట్లు లేవతనికి."

"కాని టి. బి. పేషెంట్, అవునా?"

"అవును; అతను డాక్టర్స్‌కి చూపిస్తే టి. బి. ఎటాక్ అయి చాలా రోజులయినట్లు, లంగ్స్ బాగా దెబ్బతిన్నట్లు చెప్పారట."

"అంటే బాగా బలహీనుడయి వుండాలి."

"స్వాభావికమే కదా! టి.బి. తో పాటు అతను పాపం ఆస్మాతో కూడా బాధపడేవాడు. మాట్లాడుతుంటే వగరుస్తుంటాడు."

"అతని నడివడి, వగైరా."

"మామూలుగా అందరు కళాకారుల్లాగే వుండేవాడు. ఒక్క పలుచగా అయిదున్నర అడుగుల ఎత్తుండేవాడు. సున్నితమయిన మనస్తత్వం గల మొండివాడు."

"దండాలు బాబూ!" అన్నమాట విని పక్కకు తల తిప్పి చూశాను.

తలుపువద్ద సుమారు ఇరవయి, ఇరవయి ఒక్క వయస్సులో వున్న యువకుడు, విద్యాసాగర్ నాకరుతో పాటు నిలబడి వున్నాడు. మనిషి ఎత్తుగా, కండలు తిరిగిన శరీరంతో మొరటుగా వున్నాడు. సన్నని మెలితిరిగిన మీసం, త్రాగి ఎర్రబడిన కళ్ళు చూస్తుంటే మామూలు మనుష్యులకి భీకరంగా అగుపిస్తాడు.

విద్యాసాగర్ ఆయనకు తెలిసిన విషయాలు ఆ యువకునికి చెప్పి, నన్ను పరిచయం చేసి "ఈ ఇన్‌స్పెక్టర్ గారు తొమ్మిదేళ్ళ క్రిందటి సంగతులు కొన్ని అడగాలనుకుంటు

న్నారు, సమాధానాలు చెప్పగలవా?" అడిగాడు.

"నాకు గుర్తున్నంతవరకు చెబుతాను బాబూ!" విన యంగా అన్నాడు వాడు.

"తొమ్మిదేళ్ళక్రితం రోజ్‌విల్లాలో జరిగిన హత్యను గురించి తెలుసుకోవా లనుకుంటున్నాను" నేను వాడి ముఖం చూస్తూ అడిగాను. "అప్పటికి నీకు పదకొండు లేక పన్నెండు ఏళ్ళుంటాయేమో. అంగుకని అప్పటి విషయాలు కొన్ని గుర్తుండి వుండవచ్చు."

"ఒక బొమ్మలు గీంచేవాడు వుండేవాడు సార్ అందులో. నాకు బాగా గుర్తుంది వాడు..." బండమాట తీడుతూ అన్నాడు వాడు. "ఒక ఆడకూతురిపై కత్తి దూశాడుబాబూ! అప్పుడు నేనూ, మాఅయ్యా ఇంటికి పోతున్నాం. అదయినా కిటికీ తెరచివుంది కాబట్టి కనిపిం చింది బాబూ, లేకుంటే అసలు విషయమే తెలిసేదికాదు."

"నీవు సదానంద్ ముఖం నీకళ్ళతో చూశావా?"

"లేదు బాబు! వాడి వీపు మా వైపుంది. కాని అతను ఆ బొమ్మలు గీసే మనిషేనని నేను ఖచ్చితంగా చెప్ప గలను."

"పోలీసులు వచ్చి అడిగేవరకు ఈ విషయం మీనాన్న ఎందుకు చెప్పలేదు?"

"మా అయ్య భయపడి వుంటాడు బాబూ! పోలీసోళ్ళ యవ్వారం ఎలాగుంటదో మీకు తెలుసు. అంతకుమించి నాకే కారణం కనిపించదు బాబూ!"

"సదానంద్ కత్తి తీసుకుని ఆ అమ్మాయి వెంట పడ్డాడంటున్నావుకదా! అప్పుడతను ఆమెను ఏమని బెది రించాడు?"

నే నడిగిన ప్రశ్నకు పోతరాజు ఒక క్షణం ఆలో చించాడు. ఒక క్షణం తలగోక్కుంటూ అన్నాడు:

"సార్; చాలా రోజులయిందికదా! సరిగ్గా గుర్తు రావటం లేదు. వాడు ఆ ఆడకూతుర్ని నిలబడమని బెదిరించా డనుకుంటాను."

"సరిగ్గా అతనేమన్నాడో గుర్తు తెచ్చుకోడానికి ప్రయత్నం చేయి."

"అన్నే మాటలా...?...సార్...ఎలా గుర్తుండి... వస్తాయి...? ఇంగ్లీషులో ఏదో తిడుతూ...ఆగు... ఆగుతావా...చంపనా...అన్నట్లున్నాడు బాబూ!"

నా ప్రశ్నలను, అతని జవాబులని విద్యాసాగర్ ఇంటరెస్టుగా వినసాగాడు.

"నాకంతకంటే ఎక్కువ తెలియదు బాబూ!"

"సదానంద్ ఆ అమ్మాయి వెంట వేగంగా పరుగెత్తాడా?"

"చిరుతలా లంఘించాడు బాబూ! ఆమేమో భయపడుతూ చెరువువైపు పరుగెత్తింది. చేతిలో పెట్టె వుండటంవల్ల అంత వేగంగా పరుగెత్తలేకపోయింది. చెరువు దగ్గర చేరుకునేసరికి అతనామెను అందుకుని వుంటాడు."

"నీవు ఆమె అరుపు విన్నావా?"

"బాగా విన్నాను బాబూ! భయంవల్ల నేను మా నాన్నని అతుక్కుపోయాను."

"అయినా మీరువచ్చి పోలీస్ స్టేషన్లో రిపోర్ట్ ఇవ్వ లేదు."

"మేము పేదవాళ్ళం బాబూ! పెద్దవాళ్ళ యవ్వారాలు తనకెందుకని మా బాబు వూరుకుని వుండాలి. అంతకంటే ఏంలేదు" అన్నాడు వాడు ఏడుపు మొహంవేసి.

వాణ్ణి వెళ్ళిపొమ్మని చెప్పి, నేనూ విద్యాసాగర్ వద్ద సెలవు తీసుకుని స్టేషనుకు బయల్దేరాను.

# 6

ఆ ఉదయం పోలీస్ స్టేషన్‌లో కూర్చుని ప్రతాపరావు హత్యనుగురించి ఆలోచిస్తున్నాను. ఈలోగా ఒక కానిస్టేబుల్ లోపలకువచ్చి సెల్యూట్ చేసి నిలబడ్డాడు.

నేను ఫైల్లోంచి తలెత్తి అతనికేసి ప్రశ్నార్థకంగా చూశాను.

"సర్; మీ కొరకు అంజనీదేవి వచ్చింది. మీతో మాట్లాడాలట?" అన్నాడతను.

అంజని నా కొరకు వచ్చిందనగానే నేను ఉలిక్కిపడ్డాను. ప్రేమ హత్యకేసులో ఆవిడ మరో సాక్షి. ప్రేమ శవాన్ని గుర్తించింది యీవిడొక్కతే.

అసలు ప్రేమ ఎవరో, ఎక్కడినుండి వచ్చిందో ఎవరికీ తెలియదు. ఆగోవా బస్సుప్రయాణంలో ప్రేమతో యీమెకు పరిచయమైందట. మాటల సందర్భంలో తన పేరు ప్రేమ అని, తన కాబోయే భర్త సదానంద్‌ను కలవటానికి ఆ వూరికి వస్తున్నట్లు చెప్పిందట. అంతవరకే ఈమెకు తెల్సు. ఆ సాయంత్రమే ప్రేమ హత్యచేయబడింది.

కాని, ఇప్పుడు ఈమె ఎందుకు వచ్చినట్లు?

"లోపలకు పంపించు" కానిస్టేబుల్‌ని ఆదేశించాను.

అతను బయటకు వెళ్ళిన నిముషానికంతా ఆమె లోపలకు వచ్చింది. ఆమె ముఖం నిర్మలంగా వుంది. ముప్ఫై ఏళ్ళుండొచ్చు. అందమైనదే ననిపించింది.

నా ఎదురుగుండావున్న కుర్చీ చూపిస్తూ "కూర్చోండి" అన్నాను.

ఆమె మౌనంగా కూర్చుంది. విషయమేమిటో చెప్పమన్నట్లుగా నేనామెకేసి చూశాను. ఎలా చెప్పాలో

అనే సందిగ్ధంలో పడ్డట్టుందామె.

"మీరు ప్రేమ హత్యగురించి పరిశోధిస్తున్నట్లు పాత్‌రాజు చెప్పాడు."

"అవును. ప్రేమ హత్య కేసును రీ-ఓపెన్ చేద్దామనుకుంటున్నాను."

"అయితే మీలాంటి కర్తవ్యనిష్ట గల అధికారికి నాకు తెలిసిన విషయం చెప్పి, మీ పరిశోధనకి అది ఏమయినా ఉపయోగపడుతుందేమోనని వచ్చాను."

"థాంక్స్; ఏమిటో ఆ విషయం చెప్పండి?" అడిగాను.

"ఈ హత్య జరిగిన నాలుగయిదు నెలల తరువాత అనుకుంటాను. విజయవాడలోని నా మిత్రురాలు నళినిని కలిశాను. అప్పుడు మాటలమధ్య ఈ విషయంకూడా మాట్లాడుకున్నాం. అప్పుడు ఆమె నాకో క్రొత్త విషయం చెప్పింది."

"అది హత్యకు సంబంధించిన విషయమా?" ఆతురతగా అడిగాన్నేను.

"కాదు; హంతకునికి సంబంధించిన విషయం."

"ఈజిట్?"

"అవును."

"ఏమిటది?"

"హత్య జరిగిననాటి మధ్యాహ్నం ఒకవ్యక్తి వాళ్ళ హోటల్ 'లావణ్య'లో బసచేశాడు. అతని పేరు సదానంద్ అట. అతను టి. బి. పేషెంట్ అని నళిని చెప్పింది. ఆమె అక్కడే రిసెప్షనిస్టుగా పనిచేస్తుంది."

ఆమె చెప్పింది వింటూనే నేను ఉలిక్కిపడ్డాను. "మీరేమంటున్నారు అంజనిదేవి గారూ!" నా ఆసక్తిని అణుచుకోలేక అన్నాను. "ఆ సాయంత్రం అతనికక్కడ

రోజ్ విల్లాలో వున్నాడు. ప్రేమనీ హత్యచేశాడు. ఆటువంటిది అతను ఆ మధ్యాహ్నం విజయవాడలో?"

"ఆ విషయమై నేనూ ఆలోచించాను ఇన్‌స్పెక్టర్; అతను నిరపరాధేమోనన్న ఆలోచన కలిగింది. కాని నళిని చెప్పినదాన్నిబట్టి నా ఈ అనుమానంకూడా దూర మయింది. ఆ మధ్యాహ్నం హోటల్‌లో బసచేసిన అతను కొంచెంసేపటికి బయటకువెళ్ళి తిరిగి రాత్రి పదిన్నర ప్రాంతంలో వచ్చాడు. విజయవాడనుండి భానుపురికి కారులో రెండు గంటల ప్రయాణం. ఒక తెలివయిన హంతకుడిగా అతనే ఎలిబీ సృష్టించుకున్నాడేమో!"

అంజని చెప్పిన ఈ మాటలతో నాలోని ఉద్విగ్నత చల్లబడింది.

# 7

నాకు మరే ఇల్లు దొరకక ఒక మంచిరోజు చూసుకుని నేను రోజ్ విల్లాని అద్దెకు తీసుకుని ఇన్‌స్పెక్టర్ గారింటి నుండి అందులోకి మారాను.

ఇన్‌స్పెక్టర్ భుజంగరావు నన్ను ఆ ఇంటికి వెళ్ళ వద్దనీ, నాకో మంచిఇల్లు దొరికేంతవరకు తన ఇంట్లోనే వుండమనీ కోరారు. కాని, నేను నా పట్టుదల వదల్లేదు. నాకు దెయ్యాలపై ఎంతమాత్రం నమ్మకంలేదని చెప్పాను.

"జాగ్రత్త!" ఆయన నన్ను హెచ్చరించారు. యాకూబ్‌కి ఇతర కానిస్టేబుల్స్‌కికూడా నేనందులోకి మారడం ఇష్టంలేదు.

ఆ సాయంత్రమే లతకీ, వీలుచూసుకుని బయలుదేరి రమ్మని వైరిచ్చాను. ఆ ఇంటినంతా పరీక్షిస్తున్న నాకు ఒకగదికి తాళంవేసి వుండటం కనిపించింది. అప్పుడు యాకూబ్ కూడా నాతో వున్నాడు.

"యాకూబ్ మియాఁ! ఈ గదికి తాళం ఎందుకు వేసి వుంది" అడిగాను.

"హుజూర్; అందులో సదానంద్‌కి సంబంధించిన సామాన్లున్నాయి. అతను పారిపోయిన తరువాత ఈ ఇంటి యజమాని వాటిని ఈ గదిలో వేసి తాళంవేశాడు."

"ఒకసారి అతని సామాన్లని చూడాలనివుంది."

"కాని, హుజూర్ తాళంవేసివుంది కదా!" యాకూబ్ తన అనుమానాన్ని వెల్లడిచేశాడు.

"మరేం ఫర్వాలేదు" అంటూ నేను నావద్దవున్న తాళంచెవుల గుత్తితో తాళం తీయడానికి ప్రయత్నం చేశాను. రెండు మూడుసార్లు ప్రయత్నంచేసిన తరువాత తాళం వచ్చింది.

నేను లోపలికి ప్రవేశించాను.

నా దృష్టి ఎదురుగావున్న స్టాండ్‌పై నిలిచింది. కాన్వాస్‌పై బాగా దుమ్ముపేరుకుంది. దాన్ని దులిపి ఒక పాతగుడ్డపేలికతో కాన్వాస్‌ని తుడిచాను. కాన్వాస్‌పై అసంపూర్తిగా వున్న చిత్రమొకటి వుంది. ఆ గదిలో ఇంకా చాలా చిత్రాలు లభించాయి నాకు. వాటినిచూసి సదానంద్ ఒకమంచి చిత్రకారుడు, ప్రకృతి ప్రియుడు అనిపించింది.

ఒక మూలగావున్న బల్లసొరుగులో నాకు కొన్ని ఉత్తరాలు లభించాయి. అందులోవున్న ఉత్తరాలన్నీ ప్రేమ రాసినవే! అవన్నీ రాంనగర్ నుండి రాయబడినవి. చిన్నగా, అందంగా గుండ్రంగా వుంది వ్రాత. ఆ వ్రాతని చూస్తుంటే ఎక్కడో ఆ వ్రాతని చూసినట్లు అనిపించ సాగింది. కాని ఎక్కడ చూశానో జ్ఞాపకం రావటం లేదు.

సరే ఆ విషయంపై ఎక్కువగా ఆలోచించక బయటకి

వచ్చి ఆ గదికి మళ్ళీ తాళంవేశాను.

ఆ రాత్రి అక్కడ పసుపంటే నాకెందుకో విచిత్రంగా అనిపించింది. బహుశా అది దయ్యాలమేడ అని విని వుండటంవల్లే నేమో!

# 8

ఆ రోజు సీలుచూసుకుని నేను విజయవాడ వెళ్లాను. హోటల్ 'లావణ్య'లో మిస్ నళినిని కలవటం కష్టం కాలేదు. నే నామెకు, నేను అంజని మిత్రుణ్నని చెప్పి వని, వచ్చినపని చెప్పాను.

"మీరడిగే ప్రశ్నలకు నాకు తెలిసినంతవరకు జవాబివ్వడం నా కభ్యంతరంలేదు ఇన్స్పెక్టర్! కాని ఇప్పుడు నేను డ్యూటీలో వున్నాను. సాయంత్రం ఆరుగంటలకు నా డ్యూటీ అయిపోతుంది."

"ఆల్ రైట్ మిస్. నేను మిమ్మలని ఏడుగంటలకు కలుస్తాను" అని నేను నా రూంకి చేరుకున్నాను.

ఆ సాయంత్రం ఏడుగంటలకంతా ఆమే నా గదిలోకి వచ్చింది. ఆమె నాహ్వానించి వెయిటర్ని పిలిచి భోజనం తెప్పించాను.

"మిస్ నళినీ; మీరు సదానంద్ని గురించి అంజనికి ఏదో చెప్పారట?" భోజనం మధ్యలో అడిగాను.

"యస్ ఇన్స్పెక్టర్! ఆనాడు మాటలమధ్యలో నేనే సదానంద్ ఇక్కడికి వచ్చాడని, మా హోటల్లోని రూం నెంబర్ మూడులో ఓరోజు బసచేశాడని చెప్పాను."

"అతను ఒక్కరోజు వున్నాడా?"

"అవును; రెండవరోజు మధ్యాహ్నం అతను వెళ్ళిపోయాడు. వచ్చినరోజు మధ్యాహ్నంకూడా అతను బయటకువెళ్ళి రాత్రి చాలా ఆలస్యంగా వచ్చాడు.

భోజనంకూడా చేయలేదు. అతను చాలా కంగారుగానూ, ఉదాసీనంగానూ వున్నట్లు కనిపించాడు."

"అతను రోగిష్టి అని మీకు తెలుసా?" నేను అడిగాను.

"తెలుసు. అతను చాలా తీవ్రంగా దగ్గుతూండటం చూసి అడిగాను. చెప్పాడు తను టి. బి. పేషెంటునని. మెడచుట్టు మఫ్లర్ చుట్టుకునివున్నాడు. అతను ప్రయత్నం చేసికూడా గట్టిగా మాట్లాడలేక పోయేవాడు. చాలా నెమ్మదిగా మాట్లాడాడు."

నళిని చెప్పిన ఈ విషయం మెదడుకి పని కల్పించింది. హత్య జరిగిన్నాడు సదానంద్, ప్రేమను అగమని హెచ్చరించటం, గట్టిగా బెదిరించటం తను విన్నానని పోతరాజు చెప్పాడు. మరి నళిని అతను గట్టిగా మాట్లాడలేదని అంటుంది. ఎవరిది నిజం?

"అతనిక్కడ నుండి ఎక్కడికి వెళ్ళాడో మీకేమయినా తెలుసా?" అడిగాను.

"నో; అయాం సారీ!"

"అతనిక్కడ వున్నప్పుడు అతనికి సర్వ్ చేసిన రూం బాయ్ ఎవరు? అతనింకా ఇక్కడే వున్నాడా?" అడిగాను. కాని ఆ రూంబాయ్ వుంటాడా అనేది అనుమానమే.

"ఉన్నాడు" అంది నళిని.

"అతణ్ని పిలిపించండి."

అప్పటికి మా భోజనం అయిపోయింది. రూంబాయ్ ప్లేటు తీయడానికి వచ్చాడు. నళిని అతనితో ఎవరినో పిలుచుకు రమ్మని చెప్పింది. రూంబాయ్ తలూపుతూ వెళ్ళిపోయాడు.

"అతనివద్ద ఏమేం సామాను వుండింగో మీకేమయినా

తెలుసా? అతను మీ హోటల్‌కి ఎందులో వచ్చాడు?"

"రిక్షాలో వచ్చాడనుకుంటాను. అతనివద్ద ఒక సూట్‌కేస్, ఒక హోల్డాల్ చిన్న వెదురుబుట్ట తప్ప మరేమీ లేవుండింది" నళిని చెప్పింది. "తను టీ, కాఫీలు త్రాగనని, పాలుకావాలని అడిగాడు."

ఈలోగా ఒక ముసలతను లోపలకు వచ్చాడు. అప్పుడు సదానంద్‌కి సర్వ్ చేసిన రూంబాయి అతనేనని చెప్పింది నళిని. అతనికి పరిస్థితినంతా విడమర్చి చెప్పి అతనికి తెలిసింది చెప్పమన్నాను.

"అతను టి. బి.తో బాధపడుతున్నట్లు చెప్పాడు సార్" అతను చెప్పసాగాడు: "ఆయన వచ్చిన కొంచెం సేపటికే బయటకు వెళ్ళిపోయాడు. మళ్ళీ రాత్రి వచ్చాడు. భోజనం చేయకుండా పాలు త్రాగి పడుకున్నాడు. రెండవ రోజు వుదయం కూడా పాలు త్రాగాడు. మదనపల్లికి బస్ ఎప్పుడుంది అని నన్ను అడిగాడు. తరువాత పేమెంట్ చేసి రూం ఖాళీ చేశాడు."

"మదనపల్లి బస్‌ని గురించి అడిగాడా? అంటే అక్కడికి వెళ్ళి వుంటాడా?"

"వెళ్ళివుంటాడు సార్; అక్కడ టి. బి. కొరకు హాస్పిటల్ వుందికదా?" అన్నాడు.

# 9

మదనపల్లి శానిటోరియం చేరుకున్న నేను అక్కడి డాక్టర్‌కి నన్ను నేను పరిచయం చేసుకుని, నేనెందుకు వచ్చిందీ చెప్పాను.

నేను చెప్పినదంతా విన్న ఆడాక్టర్ బెల్ నొక్కి ప్యూన్ రాగానే అతనిద్వారా మరో డాక్టర్ని, ఇద్దరు నర్సులని పిలిపించాడు.

"ఇన్స్పెక్టర్" ఆ డాక్టర్ నన్ను మరో డాక్టర్కి, నర్సులకి నన్ను పరిచయం చేస్తూ అన్నాడు. "ఈయన డాక్టర్ ముత్యాలరావు, ఈమె నర్సు దేవయాని, ఈమె రాగిణి. గత పదేళ్ళుగా ఇక్కడ పనిచేస్తున్న వాళ్ళు ఈ ముగ్గురే! మిగిలిన వారందరూ కొత్తగా వచ్చిన వాళ్ళే. వీళ్ళు మీకు కావల్సిన సమాచారం ఇవ్వగలరు" అని వారి వైపు తిరిగి నాకు కావలసిందేమిటో చెప్పాడు.

మరో అయిదు నిముషాల తరువాత నేను వారితో పాటు రికార్డు రూంలో వున్నాను.

వాళ్లు తమ ఎదురుగా పాత రిజిస్టర్లు పెట్టుకుని కూర్చున్నారు. నేను ఒక చిన్న నోట్ బుక్ తో వారి ఎదురుగుండా కూర్చుని నేనడిగిన ప్రశ్నని, వారిచ్చే జవాబుని రాసుకుంటున్నాను.

"డాక్టర్! సదానంద్ ఇక్కడ ఎప్పుడు అడ్మిట్ అయ్యాడో చెప్పగలరా?" అడిగాను.

"యస్; అతను పది, జనవరి 1962లో చేరాడు."

"మీ రిజిస్టర్లనిబట్టి అతని పరిస్థితి ఎలా వుండిందో తెలుస్తుందా?"

"క్వయిట్ బాడ్; సెకెండ్ స్టేజి కూడా దాటి పోయింది. అతని లంగ్స్ రెండూ పూర్తిగా దెబ్బ తిన్నాయి."

"అతని అడ్రసేమిటో తెలుసా?"

"యస్; హియార్ ఇట్ ఈజ్" డాక్టర్ రిజిస్టర్ చూసి చెప్పాడు. "రోజ్ విల్లా, భవానీ నగర్; భానుపురి."

"డాక్టర్! టి. బి. సెకెండ్ స్టేజిలో వున్న వ్యక్తి అవసరమయినప్పుడు ఎంత దూరం... ఏమాత్రం పరిగెత్తగలడో చెప్పగలరా?"

"వ్వాట్ !?" డాక్టర్ విస్మయంగా అన్నాడు. "అబ్సర్డ్ ఇన్స్పెక్టర్; ఇట్ యీజ్ ఇంపాజిబుల్. అతను పరుగెత్తలేడు. ఒకవేళ పరుగెత్తినా ఎనిమిది పదడుగులు పరుగెత్తగానే స్పృహతప్పి పడిపోతాడు. అంతే కాదు నోట్లోంచి రక్తం కారడం కూడా జరుగుతుంది."

"సదానంద్ పరిస్థితి అలాగే వుండిందా?" అడిగాను.

"ఎక్జాక్ట్లీ ది సేమ్; ఏమంటారు మిసెస్ దేవయాని" డాక్టర్ ఒక నర్సుకేసి చూస్తూ అన్నాడు.

"అవును" నర్సు అతని మాటలని బలపరిచింది.

"అతణ్ణి కలవడానికి ఎవరయినా వస్తూండేవారా?"

"చాలా తక్కువ" దేవయాని అంది. "ఒకసారి మాత్రం అతని మిత్రుడెవరో వచ్చాడనుకుంటాను. నాకతని పేరు జ్ఞాపకం లేదు. నిజం చెప్పాలంటే సదానంద్ నిరాశగా వుండేవాడు."

"నిరాశగా వుండేవాడా? ఎందుకో మీకేమైనా తెలుసా?"

"ఐ మే టెల్ యూ..." ఈ సారి రెండవ నర్సు రాగిణి చెప్పసాగింది: "అతనితో నేను ఎక్కువగా మాట్లాడేదాన్ని. తన జీవితాన్ని గురించి అతను చెప్తూ వుండేవాడు. అతనికి చాలా మిసరబుల్ లైఫ్...అతని తల్లి అతని చిన్నతనంలోనే పోయింది. అతను ఇక్కడ అడ్మిట్ అవడానికి ముందు తండ్రికూడా చనిపోయాడు. ఈ రోగంవల్ల తండ్రి నిశ్చయించిన వివాహం చేసుకోడానికి ఇష్టపడలేదతను. అతనికో చెల్లెలుండేది. ఏదో ప్రయిమరీ స్కూల్లో టీచరుగా పనిచేసేది. ఇక్కడ చేరిన పది పన్నెండు రోజులకి, అతనికి చెల్లెల్ని గూర్చి దుర్వార్త తెలిసింది. అప్పటినుండి మరీ నర్వస్‌గా వుండే

వాడు."

"అది ఎటువంటి డిస్ఆర్డర్?"

"నాకు తెలిసినంతమటుకు ఆమె మాయమయింది. ఎక్కడికి వెళ్ళింది ఎవరికీ తెలియదు. మేబి సమ్ లవ్ అఫేర్...సదానంద్ దానిని చెడుగా తీసుకున్నాడు. ఆ విషయం తెలుపుతూ వచ్చిన వుత్తరం చూసి అతను చాలా ఏడ్చాడు ఇన్‌స్పెక్టర్."

"దయచేసి ఒక్క విషయం తెలపండి చాలు...అత నెప్పుడు డిస్చార్జి అయ్యాడు?"

డాక్టర్ ఒకసారి నాకేసి విస్మయంగా చూసి నవ్వుతూ "వ్వాట్ డూ యూ మీన్? హి వాజ్ నెవర్ డిస్చార్జ్‌డ్..."

"అంటే?" అనుమానంగా అడిగాను.

"యస్; అతనిక్కడే మరణించాడు."

"బట్ యు నెవర్ టోల్డ్ మీ..."

"ఇంతవరకు మీరా ప్రశ్న అడగలేదు ఇన్స్పెక్టర్" డాక్టర్ అన్నాడు. "అకార్డింగ్ టు అవర్ రిజిస్టర్స్... అతను మార్చి ఏడవతారీఖున చనిపోయాడు. హి టుక్ పాయిజన్."

డాక్టర్ చెబుతున్న ప్రతిమాటకి వులిక్కిపడుతున్నాను. "పాయిజన్...యూ మీన్ మర్డర్?"

"నో, మర్డర్; ఇన్స్పెక్టర్...అతను ఆత్మహత్య చేసు కున్నాడు. జీవితంలో బాగా విసిగిపోయాడతను."

"నో నో; నెవర్;" నేను ఇంచుమించుగా అరి చాను. "ఇట్ ఈజ్ ఇంపాసిబుల్...తన ట్రీట్‌మెంట్ కోసం ఇంత దూరం వచ్చిన వ్యక్తి; కాబోయే భార్య కోరికపై ఆమెను సుఖపెట్టడానికి ఆరోగ్యాన్ని పొందా అనుకున్న వ్యక్తి, ఇతరుల ప్రాణాలను బలిగొన్న మనిషి

ఇంత పిరికివాడంటే నే నన్నమ్మను. నో డాక్టర్; నో; అతను ఆత్మహత్య చేసుకోలేదు. అది హత్య అయివుండ వచ్చు. ఇటీజ్ ఎ ప్లాన్డ్ క్రైమ్."

నా మాటలను విని డాక్టర్, ఆ నర్సులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. తరువాత డాక్టర్ నా కేసి తిరిగి చెప్పాడు:

"వెల్ ఇన్స్పెక్టర్; యూ మే బి కరెక్ట్; నిజం చెప్పాలంటే అతని మరణానికి రెండు మూడు రోజుల ముందు అతణ్ణి కలవడానికి ముగ్గురు వచ్చారు. అతని స్నేహితుడు_ ఒక ముసలి పల్లెటూరి రైతు_ ఒక ఆధునిక యువతి. ఏ విషంవల్ల అతని చావు సంభవించిందో... ఆ విషం పుచ్చుకున్న రెండు మూడు రోజుల తర్వాత ప్రాణం తీస్తుంది. ఆత్మహత్య చేసుకునే వారెవరూ ఆ విషాన్ని వుపయోగించరు. అతని మరణం మాకూ ఆశ్చర్యాన్ని కలిగించింది. అనుమానం కూడా కలిగింది. బట్ యూనో...ఆ విషయాన్ని అతని తరపున పర్స్యూ చేసే వారెవరూ లేరు. అందుకని అనవసరమయిన ఇరకాటంలో వుండడ మెందుకని మేమూ పోలీసులకి ఈ విషయం తెలుపకుండా అతని చావు విషయం రికార్డ్ చేశాం... అంతే."

"ఒహ్!" అని లేచాను నేను. సదానంద్ చావుతో కేసు మళ్ళీ మొదటికే వచ్చింది.

# 10

ఆ రెండవరోజు మదనపల్లినుండి రాంనగర్ కి బయలు దేరాను. రాం నగర్ లో కూడా నాకు ప్రేమను గురించి అంతగా తెలుస్తుందన్న నమ్మకం లేదు.

కాని, ఒక్కొక్కసారి అనుకోకుండానే అదృష్టం

కలిసి వస్తుంటుంది. నేను ప్రయాణం చేస్తున్న బస్‌లో నా ప్రక్కనే ఒక వ్యక్తి కూర్చుని వున్నాడు. అతనికి సుమారు నా వయస్సే వుంటుందనుకుంటాను.

కాలక్షేపానికి అతనితో మాట్లాడ్డం మొదలుపెట్టేను. ఆ మాటల్లో అతనూ రాంనగర్ వెళ్తున్నట్లు చెప్పాడు. దాంతో నేనూ రాంనగర్ ఎందుకు వెళ్తున్నదీ చెప్పాను.

"ఆ అమ్మాయి చదువుకున్నదీ, ఉద్యోగం చేస్తున్నదీ అంటున్నారు. రాంనగర్‌లో కో ఆపరేటివ్ స్టోర్స్ వుంది. అందులో చాలా మంది ఆడవాళ్ళు పని చేస్తున్నారు. మీరు అక్కడ కనుక్కొన్నారంటే మీకు కావలసిన అమ్మాయిని గురించి ఏమయినా తెలియవచ్చు" నా మాటలు విని అతనన్నాడు.

సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో రాంనగర్‌లో దిగాము. కో ఆపరేటివ్ స్టోర్స్‌కి దారి చూపించి అతను నా వద్ద శెలవు తీసుకున్నాడు.

నేను స్టోర్స్‌వైపు సాగాను. నేను స్టోర్స్ హెడ్ క్లర్కుని కలిసి అతనికి నా గురించి తెలుపుకున్నాను. ఎందుకు వచ్చిందీ తెలుపుకున్నాను.

నేను చెప్పింది విన్న ఆ వృద్ధుని ముఖంలోని ముడతలు అధికమయ్యాయి. ఒక క్షణం నా కేసి విస్మయంగా చూశాడు.

"ఇన్నేళ్ళ తరువాత మీరామెను గురించి ఎందుకు వాకబు చేస్తున్నారో తెలుసుకోవచ్చా?" అడిగాడు.

"ఆమె హత్య చేయబడింది మిస్టర్ రాణా; ఆ విషయాన్ని నేను పరిశోధిస్తున్నాను."

"అలాంటివాళ్ళకి ఏదో ఒకనాడు అటువంటి పరిణామం తప్పదు" తీక్షణ స్వరంతో అన్నాడు.

"మీ దృష్టిలో ఆమె అంత నీచమయిందా?"

"అవును," ఆ వృద్ధుడు స్థిరంగా అన్నాడు. "చిన్న యింటి వాసాలు లెక్కపెట్టే వాళ్ళంటే నాకు మంట. ఇతరుల వత్తిడి వల్ల చేసివుండవచ్చు. కాని ఆమేమీ చిన్నపిల్లకాదు కదా! ఎవరేది చెపితే అది చేయడానికి."

అతను చెబుతున్నదేమిటో నాకేమీ అర్థంకాలేదు.

"మిస్టర్ రాణా, దయచేసి ఆమె ఏం చేసిందో విపులంగా చెబుతారా?"

"కో-ఆపరేటివ్ స్టోర్స్ డబ్బు దోపిడీ చేసింది."

"దోపిడీయా!" ఆశ్చర్యంగా అన్నాను.

"అవును, మొత్తం యాభయివేల రూపాయలు. భాను పురికి వెళ్ళాలని మూడు రోజులు లీవు తీసుకుని వెళ్ళింది. ఆ వెళ్ళటం వెళ్లటం తిరిగి రాలేదు."

"ఒకత్తే ఇంత పని చేసిందా?"

"నో, నో, మా వద్ద ఒక కాషియర్ వుండేవాడు. ఇదంతా అతని ప్లానే అనిపిస్తుంది."

అతను చెప్పింది వింటున్న కొలదీ ఆశ్చర్యంగా వుంది.

"మాది సబ్ హెడ్ ఆఫీస్ కావటంతో ఆ వారం చుట్టు ప్రక్కల కో ఆపరేటివ్ స్టోర్స్‌ల అమ్మకం మాకు చేరింది. కాషియర్ ఎలా డూప్లికేట్ సంపాదించాడో కాని డబ్బుని మాయం చేశాడు. ఆ తరువాత లీవు తీసు కుని వెళ్తున్న ప్రేమకు ఆ డబ్బు అందజేశాడు. రెండవ రోజు అతనూ మాయమయ్యాడు."

వృద్ధుడు క్షణం ఆగి చెప్పాడు: "మొదట మేమూ ప్రేమే ఇంతపని చేసిందని అనుకున్నాం కాని, తరువాత కాషియర్ ఇదంతా చేశాడని తేలింది."

"వండర్!"

"ఇందులో ఆశ్చర్యమేముంది ఇన్‌స్పెక్టర్; ఆడది

ఎంత అందమయిందో, అంత అపాయకరమయిందికూడా!
దాంతోపాటు మూరత్వం కూడా వుంటుంది."

"మూరత్వమని ఎందుకంటున్నారు?"

"మీరు వింటే ఆశ్చర్యపోతారు ఇన్స్పెక్టర్; ఇంత శ్రమపడి డబ్బుని మాయంచేసి కూడా వారం రోజుల తరువాత ఆ డబ్బుని తిప్పి పంపించారు."

"ఏమిటి!" అడిగాను.

"యస్; ఇటీజ్ ట్రూ; మొత్తం డబ్బులో రెండు వేలు తక్కువగా మిగిలిన డబ్బునంతా పంపించారు."

"డబ్బు ఎలా అందింది?"

"డబ్బు మాకు డ్రాఫ్ట్ ద్వారా అందింది."

"ఇంతకీ ఆ కాషియర్ పేరేమిటో చెప్పలేదు."

"ప్రతాపరావు."

"ప్రతాపరావా?!" ఆశ్చర్యంగా నోరు తెరిచాను. 'అతని కుడిచేయిపై అతనిపేరు పచ్చబొట్టు పొడిచి వుంది...అతనేనా?" ఉద్విగ్నంగా అడిగాను.

"యస్! అతనే."

"థాంక్స్, థాంక్స్ వెరీమచ్" అంటూ నేను వెనక్కి తిరిగాను.

# 11

ఆ సాయంత్రం లత వస్తుంది. మధ్యాహ్నం టెలిగ్రాం వచ్చింది. లత వస్తుందన్న విషయమే నాలో కొత్త వుత్సాహం కలిగించింది.

ఆ ఆనందాన్ని ఎవరితో పంచుకోవాలో అని అనుకుంటూండగానే నాకు విద్యాసాగర్ బాబు కనిపించాడు.

"హల్లో ఇన్స్పెక్టర్! హౌ ఆర్ యూ...ఏమిటి చాలా సంతోషంగా కనిపిస్తున్నారు?" నాలోని

వుత్సాహం చూసి అడిగాడతను.

"నిజంగానే నేను సంతోషంగానే వున్నాను విద్యా. సాగర్ జీ! మొదటిది ఏమిటంటే ఇవాళ సాయంత్రం మా శ్రీమతి వస్తున్నారు" నేను నవ్వుతూ అన్నాను.

"ఓహో! అయితే తొందరలోనే నాకు విందుభోజనం వుందన్నమాట."

"ష్యూర్; అదికూడా చెప్పాల్సిన విషయమా?"

"సరే; ఇక రెండవ విషయమేమిటో కూడా చెప్పండి."

"ఈ రెండవ విషయం చాలా విచిత్ర సంఘటనలతో నిండివుంది."

"ఓహ్; అయితే మీరు ప్రతాపరావు హత్యకేసులో చాలా ముందుకి సాగినట్లున్నారు. అదేమిటో కూడా చెప్పండి" ఉత్సాహంగా అడిగాడు.

"ఎలా చెప్పాలో తెలియటంలేదు విద్యాసాగర్ జీ!" నేను ఆవేశంలో చెప్పుకుపోతున్నాను. "సదానంద్; ప్రేమ; ప్రతాపరావుని గురించి చాలా విషయాలు తెలుసుకున్నాను."

"ఈజిట్ ?"

"యస్; ప్రతాపరావు-అతనో కెమిస్ట అని మీరు చెప్పారు గుర్తుందా? నిజానికతను రాంనగర్‌లోని కో ఆపరేటివ్ స్టోర్స్‌లో కాషియర్. అతను బి. కామ్. పాసయ్యాడు."

"అంటే నాకతను చెప్పింది..." ఆశ్చర్యంగా నాకేసి చూస్తూ అన్నాడు విద్యాసాగర్.

"తప్పు చెప్పాడు; అతనా స్టోర్స్‌నుండి యాభయివేల రూపాయలు దొంగతనం చేశాడు'"

"మైగాడ్ యాభయివేలు."

"అవును అతనితోపాటు ప్రేమకూడా వుంది. ఇద్దరూ

కలిసి రాంనగర్‌లో ప్లాన్ వేశారు. డబ్బు చేతికిరాంగానే ప్రేమ ముందు బయలుదేరింది. ఆ వెనుక ప్రతాపరావు బయలుదేరాడు. దురదృష్టవశాత్తు ఎవరో ప్రేమని హత్య చేశారు. దాంతో ప్రతాపరావుకి రావలసిన సగంభాగం అతనికి రాలేదు."

"అంటే సదానంద్?"

"ప్రేమ హత్యతో ప్రతాపరావు రెచ్చిపోయాడు. అతను తనకి రావలసిన భాగంకోసం తన ప్రాణాలు పోయేవరకు ప్రేమని చంపిన హంతకునికోసం వెదకుతూనే వున్నాడు. కాని, అతనికి తాను పొరపాటు చేస్తున్నానన్న విషయం తెలియదు."

"పొరపాటు?"

"అవును; ఏ డబ్బుకోసం అతను హంతకుని వెతకుతున్నాడో, ఆ డబ్బుని ఆ హంతకుడు స్టోర్స్‌కి తిరిగి ఇచ్చేశాడు," అన్నాను.

నా మాటలు విని విద్యాసాగర్ ఒకక్షణం విస్తుపోయాడు. ఆ వెంటనే పకపకా నవ్వసాగాడు.

"విద్యాసాగర్ గారూ! ఇందులో అంతగా నవ్వాల్సిందేముంది?"

"ఆ యాభయివేల కోసమే ప్రేమ హత్య జరిగి వుంటుందని మీరే అన్నారు. ప్రతాపరావుకూడా ఆ డబ్బుకోసం ప్రాకులాడుతున్నాడని కూడా మీరే చెప్పారు. మరి డబ్బుతిరిగి ఇచ్చేయడానికే అయితే ప్రేమని చంపాల్సిన అవసరమేముంది?"

"అదే తేలటంలేదు" నిస్సహాయంగా అన్నాను.

"మరో విషయం. ప్రతాపరావు హత్య విషయం ఏమిటంటారు. అతను తనకు రావలసిన భాగంకోసంకదా ప్రాకులాడుతున్నాడు. మరి హంతకుడివద్ద డబ్బులేకుంటే

అతడిని హత్య చేయాల్సిన అవసరమేముంది?"

విద్యాసాగర్ చెబుతున్నదికూడా నిజమే అనిపించింది. ఆ తరువాత నేను అతనికి సదానంద్ హత్య విషయం కూడా చెప్పాను.

"అరే!"

"అవును, విద్యాసాగర్ గారూ! నా వుద్దేశ్యంలో హంతకుడు మరెవరో అయివుంటాడు. అతనే శ్రీను, ప్రతాపరావు, సదానంద్‌లని హత్యచేశాడు."

ఆ తరువాత కొంచెంసేపటికి అతను వెళ్ళిపోయాడు.

సాయంత్రం నేను లతని, సతీష్‌ని పిలుచుకు రావడానికి బస్‌స్టాండ్‌కి వెళ్ళాను.

సతీష్, రఘునాధరావు బాబాయి కొడుకు. బాబాయి మరణానంతరం సతీష్ నా వద్దనే వుంటున్నాడు.

## 12

అనుకున్న ప్రకారం సాయంత్రం ఆరున్నర బస్సులో లత, సతీష్‌లు వచ్చారు. వారిని చూసి నాకు చాలా సంతోషం కలిగింది.

నేను వారికి నేను అద్దెకు తీసుకున్న ఇంటిని గురించి చెబుతూ "ఇది భూతగృహంగా ప్రసిద్ధికెక్కింది. మీరు భయపడరుకదా?" నవ్వుతూ అడిగాను.

"నా కటువంటి అనుమానాలేమీ లేవు. మీ తమ్ముడు గారి నడగండి" లత నవ్వుతూ అంది. సతీష్‌ని ఏడిపించాలంటే ఆమెకు చాలా ఇష్టం.

"నేనేమీ అంత పిరికివాణ్ణి కాను వదినా! భయపడితే మీరే భయపడాలి" సతీష్ గర్వంగా అన్నాడు.

ఆ రాత్రి భోజనాలయిన తరువాత సతీష్ అలా బయ

టకు వెళ్ళివస్తానని వెళ్ళాడు.

నాకు తెలుసు వాడెందుకు వెళ్ళాడో. సిగరెట్ త్రాగడానికి వెళ్ళివుంటాడు.

నేను లతకి, ఇక్కడ డ్యూటీలో చేరినప్పటినుండి జరిగిన విషయాలు చెప్పాను. నేను చెప్పిన విషయాలను చాలా ఇంటరెస్ట్‌గా వింది లత.

మదనపల్లి, రాంనగర్‌ల ప్రయాణంలో నాకు తెలిసిన విషయాలు చెప్పి ఆగాను. దాంతో లత నన్ను కొన్ని ప్రశ్నలడిగింది.

"అంటే సదానంద్‌నికూడా విషమిచ్చి చంపారన్న మాట. ఎవరు?" అడిగింది.

"అది ఇంకా రహస్యంగానే వుంది లతా!"

"ఇన్ని సంవత్సరాల తరువాతకూడా ప్రతాపరావు ప్రేమని చంపిన హంతకుని వద్దనుండి డబ్బు రాబట్టడానికే ఆతణ్ని వెదుకుతున్నాడంటారా?"

"నేను అదే అనుకుంటున్నాను."

"కో-ఆపరేటివ్ స్టోర్స్‌వాళ్ళు ఇంకా ప్రేమని ప్రాసిక్యూట్ చేయాలనుకుంటున్నారా?"

"అక్కడి హెడ్‌క్లర్క్ అదే చెప్పాడు. కాని ప్రేమ చనిపోయింది కదా."

"నాకో విషయం చెప్పండి; ప్రేమ కో-ఆపరేటివ్ స్టోర్స్‌నుండి దొంగతనం చేసిందనిగాని; లేక ప్రతాపరావుతో చేయి కలిపిందనికాని మీవద్ద ప్రమాణాలు ఏమయినా వున్నాయా?"

"లేవు; నిజమే. కాని అటువంటిదేమీ లేకుంటే హంతకుడు ప్రేమని ఎందుకు చంపుతాడు?"

"ఏమో! ఎందుకు చంపాడో. కాని నాకెందుకో మీరు ఒకటివెనుక ఒకటిగా తప్పులు చేస్తున్నట్లు అని

పిస్తోంది,'' లత దీర్ఘంగా ఆలోచిస్తోంది.

"నీవెందుకని అలా అనుకుంటున్నావ్?''

"మీరు చెప్పినదానినిబట్టి ఆలోచిస్తే నాకలాగే అనిపిస్తుంది. హంతకుడు చాలా తెలివయినవాడు. అతనితో ఎవరెవరు చేయికలిపారో ఎవరికి తెలుసు? అంజని చెప్పినదంతా నిజమేనని గ్యారంటీ ఏముంది?''

లత చెప్పిన ఈ మాటతో ఉలికిపడ్డాను. అంజనిని గురించి ఒక కొత్త సందేహాన్ని ఏర్పరిచింది లత నాలో. నేను లత కళ్ళల్లోకి చూడసాగాను.

"ఏమిటలా రెప్పలల్లార్చకుండా నాకేసి చూస్తున్నారు?''

ఆమె చెప్పిందంతా నిజమేనని నేను అనుకోను. తనకీ, ప్రేమికుమధ్య బస్‌లో జరిగిన సంభాషణలో బలముందని నేను అనుకోను. ఆమె కథనంవల్ల మీరు, అంటే పోలీసులు సదానంద్ వరకు చేరుకున్నారు. అతనే హంతకుడని నిర్ణయానికి వచ్చారు. ఇప్పుడు మీ పరిశోధన వల్ల అతను హంతకుడు కాడని తేలింది. మరి ఆమె పోలీసుల ధ్యాసను అటెందుకు మళ్ళించినట్లు?''

ఈసారి మూర్ఛవచ్చి పడిపోవటం నావంతయింది.

నిజమే! లత చెప్పిన దాంట్లో చాలావరకు నిజముంది. అంజనివచ్చి ప్రేమ శవాన్ని గుర్తించి తన స్టేట్‌మెంట్‌లో సదానంద్‌పై పోలీసుల కనుమాన మేర్పడేట్లు చేసింది.

పాపం! అటు సదానందేమో మదనపల్లి శానిటోరియంలో ప్రాణాలు విడిచాడు. ఇటు పోలీసులు అతణ్ని పరారయిన హంతకుడిగా ఉద్ఘాటించి అతణ్ని గురించి వెదుకుతూ ఆ పరిధిలోనే తిరుగుతున్నారు. కాని మరో కోణంలో ఆలోచించలేకపోయారు. ఇప్పుడు లత నా

కళ్లు తెరిపించింది.

నేనిలా ఆలోచిస్తుండగానే లత మళ్ళీ ప్రశ్నించింది.

“మీరు పెద్ద పరిశోధకుణ్ణని చెప్పుకుంటున్నారు కదా, శానిటోరియంలో సదానంద్‌ని కలిసిన ఆ ముగ్గురిలో ఒక అప్‌టు-డేట్ యువతి కూడా వుందికదా! ఆమె ఎవరో కనుక్కోడానికి ప్రయత్నించారా?”

“నో; నో; ఐ నెవర్ ట్రైడ్” నేను ఉద్విగ్నంగా అన్నాను.

నా ఉద్విగ్నతకి లత కిలకిలా నవ్వింది. మా సంభాషణ అంతటితో ఆగిపోయింది.

## 13

లతతో మాట్లాడిన తరవాత ఎంతోసేపు ఆమె చెప్పిన విషయాలపై ఆలోచిస్తూ కూర్చున్నాను. ఆ చీకట్లో మంచంపై కూర్చుని ఆలోచిస్తూ, ఆలోచిస్తూ ఎప్పుడు నిద్రలోకి ఒరిగిపోయానో నాకే తెలియదు.

ఉన్నట్లుండి హృదయ విదారకమయిన స్త్రీ కేకతో ఉలిక్కిపడి లేచి కూర్చున్నాను.

క్షణకాలంపాటు నాకేం చేయాలో తోచలేదు. ఆ వెంటనే నేను తేరుకుని మంచంపైనుంచి లేచి స్విచ్చి నొక్కాను.

నా ప్రక్కనున్న మంచంపై లత లేచి కూర్చుని శూన్యంలోకి చూస్తుండడం గమనించాను. ఆమె భయవిహ్వల అయివుంది. మొఖం తెల్లగా పాలిపోయివుంది. విస్ఫారిత మయిన నేత్రాలు ఆమె కనుగుంటల్లోంచి బయటకు వస్తాయేమోనన్నట్లుగా వున్నాయి.

“లతా! లతా! ఏమయింది. ఎందుకలా అరిచావ్??” కంగారుగా అడిగాను.

ఊహుం! లత నోరువిప్పలేదు.

ఈలోగా బయటనుండి సతీష్ తలుపు తట్టాడు.

"అన్నయ్యా! ఏమయింది?" బయటినుండే అరిచాడు.

సతీష్ కంఠస్వరం విన్న లత స్థానభ్రంశం పొందిన కొంగుని సరిచేసుకుంది. నేను తలుపు తీశాను.

"ఏమయిందన్నయ్యా! వదిన ఎందుకలా అరిచింది?" లోపలకు వస్తూనే ప్రశ్నించాడు సతీష్.

"తెలియదు సతీష్," అంటూ లత వైపుకి తిరిగి "ఏమయింది లతా! ఎందుకలా అరిచావు. చెప్పూ?" అడిగాను.

లత నావైపు అశ్రునయనాలతో చూసింది. ఏదో చెప్పబోయి చెప్పలేకపోతున్నట్లు పెదిమలు వణికాయి. నేను లతప్రక్కగా కూర్చుని ఆమె వీపుతడుతూ నా ప్రశ్నని మళ్ళీ అడిగాను.

"ఊఁ! ఏమీ కాలేదు. వెళ్ళండి. వెళ్ళి పడుకోండి" లత అంది.

"పిచ్చిదానిలా మాట్లాడక లతా! నీవిలా అరుస్తూంటే మేమెలా పడుకోగలం. ఒంట్లో నలతగావుంటే చెప్పు, సతీష్ వెళ్ళి డాక్టర్ని పిలుచుకుని వస్తాడు."

"వద్దు; వద్దు."

"మరి విషయమేమిటో చెప్పు. భయపడ్డావా?"

"ఆ... అవును."

"అయితే... అయితే నీవేమయినా చూశావా? నీకేమయినా కనిపించిందా?" ఆశ్చర్యంగా అడిగాను. నాలోని కంగారు ఇంకా తగ్గలేదు.

"నేను... నేనుఏదో భయంకరమయిన కలకన్నాను."

"కలకే అంత భయపడ్డావా?" నేను దీర్ఘంగా నిట్టూర్చి అన్నాను.

"అవును. ఇప్పుడు అంతా సర్దుకుంది. వెళ్ళి పడుకోండి. వెళ్ళు సతీష్" అంది.

"ఇది నిజంగా భూతగృహంలా వుంది. మనం రేపే ఈ యింటిని ఖాళీచేద్దాం. అన్నయ్యా!" సతీష్ అన్నాడు.

"ఓ కే. సతీష్. రేపే మరో ఇంటికోసం వెదుకుతాను."

"వద్దు;" లత తీక్షణంగా అంది. "మీరు చిన్నపిల్లలా మాట్లాడుతున్నారు. నాకేమీ కాలేదని చెప్పానుకదా! మీరువెళ్ళి నిద్రపోండి. మనం ఇక్కడే వుందాం!"

లత మాటలువిని నేనూ, సతీష్ స్తబ్ధులమయ్యాము. నా వైవాహిక జీవితంలో లత ఇలా ఎన్నడూ ప్రవర్తించలేదు. ఎప్పుడూ కోపగించుకోవడంగాని, అలగడంకానీ చేయలేదు.

అటువంటిది ఇప్పుడు లతలో దాగున్న మరో మూర్ఖపు స్త్రీని చూస్తున్నాను. లతని నిజంగా ఏదైనా దెయ్యం ఆవరించలేదు కదా!

కళ్ళతోనే సైగచేసి సతీష్‌ని పంపించాను. తరువాత లైటార్పి మంచంపై వాలానన్నమాటే కాని నా నిద్ర ఎగిరిపోయింది.

రోజ్ విల్లాని గురించిన రకరకాల ఆలోచనలతో తల బద్దలయిపోతోంది. తలప్రక్కకు త్రిప్పిచూశాను. లత ఇంకా మేలుకునివుంది. వెల్లకిలా పడుకుని ఇంటి కప్పుని రెప్పలల్లార్చకుండా చూస్తున్న లత కళ్ళల్లోని మెరపుని నేను గమనించాను.

ఆలోచనలన్నిటిని ఒక ప్రక్కకు నెట్టి నిద్రపోవడానికి కళ్లు మూసుకున్నాను.

## 11

ఆ వేళ దినమంతా నేను స్టేషనునుంచి కదల్లేక పోయాను. ఇన్స్పెక్టర్ భుజంగరావు ఒక కేస్ విష

యంగా సాక్ష్యం చెప్పడానికి కోర్టుకి వెళ్ళారు.

ఆ సాయంత్రం నాకు అంజని ఫోన్ చేసింది, ఎనిమిది గంటలకి రమ్మని...కొన్ని ముఖ్యమయిన విషయాలు మాట్లాడాలని.

ఆ సాయంత్రం ఎనిమిది గంటలకు అంజని ఇంటికి బయలుదేరాను. వెళ్తూ వెళ్తూ ఈ కేస్ని గురించి ఆలోచించసాగాను.

ప్రేమ యాథయివేల రూపాయలు ప్రతాపరావు సహాయంతో దొంగిలించటం జరిగింది. ప్రేమకు అందులో భాగముందో లేదో తెలియదు. కాని మొత్తానికి డబ్బుతో పాటు భానుపురికి సదానంద్ని కలవడానికి వచ్చింది. నాల్గురోజుల తరువాత శవం బయటపడింది.

అంజని ఆమెను గురించి అనుమానం సదానంద్ పై మళ్ళేట్లు చేసింది. అందరూ అతనే చంపారనుకున్నారు. కాని పరిశోధనలో అతనా మధ్యాహ్నమే భానుపురి వదిలి విజయవాడకి, అటునుండి మదనపల్లి వెళ్ళాడు. అక్కడ అతణ్ని ఎవరో విషమిచ్చి చంపారు. అతణ్ని చంపిందెవరు? ప్రేమని సదానంద్ చంపకుంటే మరెవరు చంపారు?

ప్రేమ, సదానంద్ల హత్య తరువాత తొమ్మిదేళ్ళ అనంతరం ప్రతాపరావుని ఎవరు చంపారు? ఎందుకు చంపారు?

ఈ ఆలోచనల్లో వుండగానే అంజని ఇల్లు వచ్చింది. అంజని నన్ను సాదరంగా ఆహ్వానించింది. కాని అప్పటికే ఆమె బాగా తాగివుంది. కళ్ళు ఎర్రబడి వున్నాయి. మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి.

''విషయమేమిటి అంజనీదేవిగారూ! ఎందుకు నన్ను పిలిపించారు?'' అడిగాను.

"ఇన్ స్పెక్టర్ మీ..హిచ్..మీరు నాకు సహాయం ఒక సహాయం హిచ్... చేయగలరా?" ఎక్కువగా తాగటం వల్ల వెక్కిళ్ళు వస్తున్నాయామెకి.

"చెప్పండి."

"నేను ప్రతీకారం తీర్చుకోవా లనుకుంటున్నాను"

"ప్రతీకారమా?" విస్మయంగా అడిగాను.

"అవును హిచ్. విజయ్ బాగా ఆలోచించి ఆలోచించి నేను ఈ నిర్ణయానికి వచ్చాను. నా విషయమంతా మీకు చెప్పి ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటున్నాను."

"చెప్పండి. ఎటువంటి ప్రతీకారం. ఎవరిపై. ఎందుకు?"

"చెబుతాను. ఇన్ స్పెక్టర్. చెబుతాను" అంజని వెక్కిళ్ళమధ్య అంది. "కాని నాకు ప్రామిస్ చేయండి. ఒక స్నేహితుడిగా నాకు సహాయం చేస్తానని నాకు ప్రామిస్ చేయండి," అంజని తన మృదువయిన చేతిని ముందుకి చాపింది.

నేను అనాలోచితంగా నే ఆమె చేతిలో చేయి వేశాను.

"ఇన్స్పెక్టర్: మీరు ఒక స్త్రీ అయివుంటే మీకు త్రాగడం నేర్పించిన వ్యక్తిని...మీ జీవితంతో పెళ్ళి మాటలు చెబుతూ ఆటాడుకుని గర్భపాతానికి దిగజార్చిన వ్యక్తిని మీరేమంటారు?" అంజని మాటలు నాకు వింతగా అనిపించాయి. అయినా జవాబిచ్చాను.

"అతను మనిషికాదు అంజనీ. అతను పశువుకన్నా నీచుడు నా దృష్టిలో."

"పశువు. హుఁ! పశువులుకూడా తనను నమ్మిన వాళ్ళని మోసం చేయవు ఇన్ స్పెక్టర్!" అంజని అంది. ఆమె ముఖంలో వ్యథ స్పష్టంగా కనిపిస్తోంది.

"తెలుసు."

"కాని ఇన్ స్పెక్టర్ ఆ మృగం నన్ను దోచుకున్నాడు.

నన్ను సర్వనాశనం చేసి నన్ను తన చదరంగంలో పావుగా ఉపయోగించుకుని ఇతరుల నాశనానికి కారకుడయ్యాడు."

"ఇతరుల నాశనానికా?" విస్మయంగా అడిగాను.

"అవును."

"అంటే అతనిప్పుడు మిమ్మల్ని వివాహం చేసుకోనంటున్నాడా?"

"ఊహుఁ! అతనలా అనడంలేదు. ఇన్ స్పెక్టర్..హిచ్ హిచ్...తన తీరుని మాటల్తో నన్నింకా మభ్యపెట్టాలని చూస్తున్నాడు. కాని, కాని నామనసు వదిలిపోయింది. నేనతణ్ణి నమ్మను. నాకు చావంటే భయం విజయ్. నన్ను ఉరికంబంనుండి తప్పించండి."

"ఉరికంబమా....అంజనీ....అంజనీ....మాట్లాడండి" ఆమె మాటలు వింటున్నకొద్దీ నాలో ఎక్సయిట్ మెంట్ ఎక్కువవుతోంది.

"అదంతా తరువాత...హిచ్ చెబుతాను. హిచ్... ముందు నా ప్రశ్నకు జవాబివ్వండి."

"అడగండి."

"తొమ్మిదేళ్ళ క్రితం జరిగిన హత్యను గురించి మీరు పరిశోధిస్తున్నారు కదూ!"

"అవును;" అనుకోకుండానే నా గుండెలు గబగబలాడాయి.

"ఇన్ స్పెక్టర్ ఆనాడు నేను ఆ అమ్మాయి...అంటే ప్రేమతో బస్సులో ప్రయాణం చేయలేదంటే.. నేను ప్రేమించిన మనిషికోసం అతను చెప్పడంవల్లనే నేను పోలీసులకు అబద్ధం చెప్పానని అంటే మీరు నన్ను శిక్షిస్తారా?"

అనుకోకుండానే రహస్యం బయటపడుతోంది. "లేదు,

అలాంటిదేమీ జరగదు అంజనీ! మీకే అపాయం కలక్కుండా కాపాడే భారంనాది. మీరు చెప్పండి."

"అపాయం... అపాయం... నన్ను వెన్నంటుతూంది ఇన్‌స్పెక్టర్. హిచ్..అందుకే మిమ్మల్ని పిలిపించాను. ఎవరితోనో మాట్లాడ్డానికి ప్రతాపరావు నా ఇంటికి వచ్చిన విషయం నాకు తెలియనే తెలియదు. అతను వచ్చాడు. వెళ్ళాడు. హిచ్..త్రోవలో ఎవరికో ఫోన్ చేశాడు. హిచ్ ...అతను చంపబడ్డాడు."

"అవును."

"మరో విషయం. నేను మీకు మిస్ నళినిని గురించి చెప్పాను కదా! ఈ విషయం నేను ఎవరికి చెప్పలేదు. తొమ్మిదేళ్ళ తరువాత మీకు చెప్పాను. అక్కడ మీకే ఆధారాలు లభించాయి."

"పరారయ్యాడనుకుంటున్న సదానంద్ మరణించాడన్న విషయంతప్ప మరేమీ తేలలేదు."

"అది మీ కంతగా ఉపకరించలేదా?"

"అలా అని చెప్పలేను. సదానంద్, ప్రేమను హత్య చేసి వుంటాడని మేమనుకుంటున్నాం. కాని అక్కడ అతను విషప్రయోగంవల్ల మరణించాడన్న విషయం తెలిసింది. అలాటప్పుడు సదానంద్ హంతకుడు ఎలా కాగలడు?"

"ఓహ్. హత్య. ఆ వెంటనే మరో హత్య. మైగాడ్! అంతా మోసం. నా వెంట అతను మదనపల్లి రావడంలో కూడా మోసముందన్న మాట."

"నీవు మదనపల్లికి వెళ్ళావా?"

"అవును. నా వెంట అతనుకూడా వచ్చాడు. ఆ పళ్ళు.. బహుశా ఆ పళ్ళు విషపూరితమయినవి అయివుండాలి."

"ఇంతకీ అతనెవరు. మీరేం చెప్పడంలేదు. మీరతనిపై

ప్రతీకారంకూడా తీర్చుకోవచ్చు. ఐ ప్రామిస్ యూ''
నేను ఉత్తేజంగా అన్నాను.

''చెబుతాను. తప్పకుండా చెబుతాను. నేనతనిపై ప్రతీకారం తీర్చుకోవాలి. హ్హ హ్హ హ్హాహ్హా'' బిగ్గరగా నవ్వసాగింది అంజని.

అంతలో, చెవులు చిల్లులుపడేలా రివాల్వర్ పేలిన శబ్దం, ఆ వెంటనే ఎవరో పరుగెత్తుతున్న శబ్దం వినిపించింది.

''ఎవరు? ఎవరది??'' అరుస్తూ తలుపువైపు పరుగెత్తాను.

''ఇన్స్పెక్టర్!'' అంజని క్షీణస్వరంతో పిలిచింది. నేను వెనక్కి తిరిగి చూశాను. అంజని నేలపై పడివుంది. అప్పుడే అంజనివద్ద కెళ్ళివుంటే హంతకుని విషయం తెలిసివుండేదేమో!

కాని, ఆమె పిలుపు వినికూడా నేను హంతకుని కొరకు బయటకు పరుగెత్తాను. ఆ ఇంటి గదులు, చుట్టు ప్రక్కలంతా గాలించి నిరాశతో తిరిగివచ్చాను. అప్పటికి గాని నా తప్పు తెలిసిరాలేదు. అప్పటికే అంజని ప్రాణ వాయువులు ఎగిరిపోయాయి.

''అంజనీ'' రుద్దకంఠంతో అన్నాను. నా కళ్ళముందు హత్య జరిగింది. కాని నేనేం చేయలేకపోయాను. ఆమె కిచ్చిన మాట ప్రకారం ఆమెను రక్షించలేకపోయాను.

హంతకుడు హత్యతరువాత హత్యగా నాలుగు హత్యలు చేశాడు. తొమ్మిదేళ్ళ క్రితం డబ్బుకోసం ప్రేమని చంపాడు. ఆ విషయం బయటకు రాకూడదని సదానంద్‌ని చంపాడు. ఆ తరువాత హత్యాపరాధాలనుండి తప్పించుకోవడానికి తొమ్మిదేళ్ళ తరువాత ప్రతాపరావుని, ఇప్పుడు అంజనిని చంపాడు.

నా పరిశోధన ఎక్కడికక్కడే వుండిపోయింది.

# 15

అంజని హత్యజరిగి మూడు రోజులయింది. కాని ఆ కేస్‌లో ఏవిధమయిన ప్రోగ్రెస్ కనిపించలేదు.

మనస్సంతా భారంగావుండి నాలుగురోజులు లీవ్ పెట్టాను.

డ్యూటీలో చేరగానే ప్రతాపరావు, అంజని మర్డర్ కేస్‌లపై ఫైనల్ రిపోర్ట్ రాయాలనుకుంటున్నాను.

నిన్నటి దినం నేను స్టేషన్ నుండి వస్తుంటే విద్యాసాగర్ కనిపించి విందు భోజనం అడిగితే ఇవాళ రమ్మన్నాను. అనుకున్న సమయానికి విద్యాసాగర్ వచ్చాడు.

నేనూ, ఆయన డైనింగ్ టేబుల్ వద్ద కూర్చున్నాం.

"నమస్తే!"

నేనూ, విద్యాసాగర్ అటు చూశాం.

తలుపులవద్ద లత నిలబడి విద్యాసాగర్‌కి నమస్కరించింది. ఆమె చేతుల్లో అన్నం పళ్లెంవుంది.

అంతలోనే వున్నట్లుండి ఏమయిందో అంతవరకు చిరునవ్వు నవ్వుతున్న లతముఖం తెల్లగా పాలిపోయింది. శరీరమంతా భయంతో కంపించసాగింది. బెదిరిన కళ్లు విస్ఫారితమయి బయటకు వెళ్ళుకు వచ్చాయి.

ఆమె ఈ పరివర్తనని గురించి నేను ఆలోచిస్తూండగానే లత కంగారుగా లోపలకు పరుగెత్తింది. ఆమె చేతిలోని పళ్ళెం జారిపోయి అన్నమంతా నేలపాలయింది.

"అరేరే. ఏమయిందీ మెకి?" విద్యాసాగర్ కంగారుగా అన్నాడు.

ఆయన ప్రశ్నను పట్టించుకోకుండా నేను ఆత్రంగా లోపలకు పరుగెత్తాను. నేను కిచన్ వైపు పరుగెత్త

సాగాను.

"సాబ్ అమ్మగారు ఇటుపోయారు" ఏంజరిగిందో తెలియని యాకూబ్ లత వెళ్ళినవైపు చూపాడు. నేనటు మళ్ళీ డ్రాయింగ్ రూంలోంచి మూగదిలోకి చేరుకున్నాను.

లత అటువైపు తలుపునానుకుని తలుపు కానుకుని నిలబడి సాలితో రొప్పుతోంది.

నేను లతను చేరేలోగానే ఆమెకు స్పృహ తప్పింది.

"యాకూబ్! గోవింద్!!" కంగారుగా పిలిచాను. పనిక్రవాడు, యాకూబ్ పరుగెత్తుకు వచ్చారు. లతను చూడగానే యాకూబ్ పరుగెత్తి గ్లాసులో నీళ్ళతో వచ్చాడు.

కొంచెం నీటిని లత ముఖంపైకి చిలకరించాను.

"నన్నొదలండి. వదలండి" కళ్ళు తెరుస్తూనే భయం భయంగా అంది.

"లతా! లతా; తెలివితో మాట్లాడు ఏమయింది?"

"నన్నొదలండి. ప్లీజ్."

"ఓహ్! లతా; ఏమిటీ పిచ్చితనం. బయట మన అతిథి కూర్చుని వున్నాడు. ఆయనేమనుకుంటాడు?"

"నాకు తెలుసు. అంతా తెలుసు. భగవాన్ ఏం చేయాలి. నేనేం చేయాలి" అంటూ లత రెండుచేతుల్లోను ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. నేను నిస్సహాయంగా యాకూబ్‌ని చూసి సైగ చేశాను.

యాకూబ్, పనివాడు గోవింద్‌తో బయటకు వెళ్ళిపోయాడు.

"ఏడ్వకు లతా; ఏడ్వక" లతను బాహువుల్లోకి తీసుకుని ధైర్యం చెబుతూ అన్నాను. "నాకు చెప్పు లతా! విషయమేమిటి? నువ్వెందుకలా భయపడుతున్నావు? ఉండి ఉండి నీవిలా చేయటం నాకు భయాన్ని కలిగిం

చింది. ప్లీజ్ చెప్పూ?"

"తలుపులు మూసేయండి. నాకు...భయంగా వుంది" ముఖంపైనుండి చేతులు తీస్తూ అంది.

"తలుపులు మూసేవున్నాయి లతా! నువ్వే మూశావు కదా!"

"ఆఁ! అవును. నేనే మూశాను, నాకు...భయంగా వుంది."

"నువ్వేమంటున్నావో అర్థంకావటంలేదు లతా. చెప్పేదేమిటో స్పష్టంగా చెప్పూ?"

"మీకేం తెలియనట్లు మాట్లాడుతున్నారు. బయట కూర్చున్నాడు ఆతను... అతను... హంతకుడు."

"లతా! ఏమిటా పిచ్చిమాటలు?"

"కాదు; ఇది నిజం. అతను హంతకుడు. ఇక నేను భయపడను. ఇన్నాళ్లు ఈ రహస్యాన్ని దాచాను. ఇప్పుడు చెబుతాను."

లత చెప్పేది వింతగావుంది. ఎటూ అర్థంకావటంలేదు. అయినా లత చెప్పేది వినాలన్న వుత్సాహం కలుగుతోంది. నేను విస్మయంగా లతను చూడసాగాను.

"అతను హంతకుడు. నావేపు ఎందుకలా చూస్తున్నారు. నేను చెప్పేది వింటే అంతా మీకే అర్థమవుతుంది. నా గౌరవ మర్యాదలను కాపాడుకోవడానికి, జైలుకి వెళ్ళాల్సి వస్తుందన్న భయంవల్ల ఇంతవరకు ఈ విషయాన్ని దాచాను" అని తిరిగి చెప్పసాగింది:

"ప్రతాపరావు తనని చదరంగంలో పావులాగా, ఈ దొంగతనంలో తనను వుపయోగించుకుంటున్నాడని పాపం ప్రేమకి తెలియనే తెలియదు. తెలివిగా అతను పన్నిన వలలో ప్రేమ అమాయకంగా చిక్కుకుంది" లత చెప్పుకుపోతూంది.

తనకు కాబోయే భర్త సదానంద్‌ని కలవడానికి ప్రేమ మూడురోజులు శెలవు తీసుకుని భానుపురికి బయలుదేరింది.

ఆమె బయలుదేరడానికి ఒకరోజుముందు సాయంత్రం ప్రతాపరావు ఆమె ఇంటికి చేరుకున్నాడు. భానుపురిలో తనతో చిన్నపనిచేసి పెట్టమని ప్రతాపరావు, ప్రేమని అర్థించాడు. కొలీగ్ కావటంతో అతని పని చేయడానికి ఒప్పుకుంది. ఆమె బయలుదేరేప్పుడు ఆమెకో సూట్‌కేస్ ఇస్తానని, ఆ సూట్‌కేస్‌ని భానుపురిలోవున్న తన చెల్లెలికి అందచేయమని అతను వేడుకున్నాడు. ప్రతాపరావు చెప్పినట్లు అందులో అతని చెల్లెలికి బట్టలు, టాయిలెట్ సామాన్లు కాక, దొంగిలించిన డబ్బువుందని ఆమె కే మాత్రం తెలియదు.

రెండవరోజు సాయంత్రం ఆమె బయలుదేరేసరికి ప్రతాపరావు ఒక సూట్‌కేస్ ఆమెకిచ్చాడు.

ఆ సూట్‌కేస్‌తో ప్రేమ భానుపురి చేరుకుంది. ఆ బస్ ప్రయాణంలో ఆమె అంజనినికాని ఇతరులనికాని కలవలేదు. బస్ భానుపురి చేరుకునేసరికి సాయంత్రం ఏడయింది. ఆ మసక చీకట్లోనే ప్రేమ, ప్రతాపరావు ఇచ్చిన సూట్‌కేస్‌తో రోజ్ విల్లా చేరుకుంది.

రోజ్ విల్లాలో ఆ సమయాన ఎవరూ వున్నట్లులేదు. సదానంద్‌ని బయటనుండి పిలిచింది. జవాబు రాకపోయేసరికి తను లోపలకు ప్రవేశించింది. లోపల ఎవరూలేరు. ప్రక్కనే ఎక్కడికోపోయి వుంటాడని, అందుకనే తలుపులు తెరిచి వున్నాయనుకుని ప్రేమ సదానంద్ రాకకై ఎదురుచూస్తూ డ్రాయింగ్ రూంలో కూర్చుంది. చీకట్లో స్విచ్ వెతికినా దొరక్కపోవడంతో ఆ చీకట్లోనే కూర్చుంది.

ప్రేమ అక్కడ కూర్చున్న అయిదారు నిముషాల తరువాత ఒకతను ఒక యువతితో లోపలకు వచ్చాడు. ఆ అమ్మాయి చేతిలో ఒక సూట్ కేస్ వుంది. ఆ చీకట్లో అతను సదానంద్ అనుకుంది ప్రేమ. డ్రాయింగ్ రూంలో లైట్ వేయకుండా వాళ్ళిద్దరూ లోపల గదిలోకి ప్రవేశించారు. లోపలకు వెళ్ళగానే అతను కత్తితీసి ఆ యువతిని బెదిరించసాగాడు.

దాంతో ప్రేమ బెదిరిపోయి తన స్థానంలోంచి లేచి, ఆ చీకట్లో తడుముకుంటూ తలుపు దగ్గరకు చేరుకుంది. ఆమెకు లోపలి సంభాషణ స్పష్టంగా వినిపించసాగింది. లోపలున్న వ్యక్తి కత్తి చూపి ఆ యువతిని బెదిరిస్తూ సూట్ కేస్ ఇవ్వమని అడుగుతున్నాడు. కాని ఆ యువతి నిరాకరించసాగింది.

లోపలున్న వ్యక్తి ఆ అమ్మాయిని 'ప్రేమా!' అంటూ సంబోధించసాగాడు. దానికా అమ్మాయి తను ప్రేమ కాదని, తాను సదానంద్ చెల్లెలినని, తన పేరు రాజేశ్వరి అని చెప్పింది.

ఆమె, సదానంద్ చెల్లెలినని చెప్పటంతో లోపలున్నది సదానంద్ కాదని ప్రేమ కనుక్కొంది. దానితో పాటు ఆమె మనస్సు అపాయాన్ని కూడా శంకించింది.

ఆ వ్యక్తి ప్రేమను సంబోధిస్తున్నాడంటే అతను ఆమె రాక గురించి ఎదురు చూస్తూ వుండాలి. ఎవరతను? సూట్ కేస్ లాక్కోవడానికి ప్రయత్నించడం ద్వారా ఆ వ్యక్తికి ఆ సూట్ కేస్ అవసరం చాలా వుందని గుర్తించింది ప్రేమ.

తనవద్ద ప్రతాపరావు ఇచ్చిన సూట్ కేస్ లో అంత ముఖ్యమైనదేముంది?

ఎలాగయినా తెలియపడాలి అని ప్రేమ ఆలోచిస్తుండ

గానీ సదానంద్ చెల్లలు రాజేశ్వరికి పారిపోవడానికి అవకాశం లభించింది.

రాజేశ్వరి బయటకు పరుగెత్తగానే ఆ వ్యక్తి కూడా కత్తి ఝుళిపిస్తూ, ఆమెను ఆగమని బెదిరిస్తూ, ఆమె వెంట బయటకు పరుగెత్తాడు.

వాళ్ళిద్దరు బయటకు పరుగెత్తగానే ప్రేమకూడా తన సూట్ కేస్‌తో బయటకు జారుకుంది.

రాజేశ్వరి అలనంత వేగంగా పరుగెత్తలేక పోయింది. ఆమె చెరువుగట్టుకి చేరుకునేసరికి ఆ ఆగంతకుడు ఆమెను పట్టుకున్నాడు. ఆ వెంటనే ఆతను ఆ అమ్మాయిని కత్తితో పొడవటం ప్రేమ దూరంనుండే చూసింది.

రాజేశ్వరి క్రింద పడగానే అతను సూట్ కేస్ అందుకున్నాడు. ఒక రాతితో సూట్ కేస్ తాళం విరగ్గొట్టి మూత తెరిచాడు. మూత తెరవగానే అతను వులికిపడి సూట్ కేస్ దూరంగా విసిరేసి పిచ్చెత్తినవాడిలా గెస్ట్ విల్లా వైపుకి పరుగెత్తాడు. అదృష్టం బాగుండి అతను ప్రేమను చూడలేదు.

ఒకటి రెండు నిముషాల తరువాత అంతటా నిశ్శబ్దం అలుముకుంది.

ఆమె చూసిన ఘాతుక దృశ్యం ఆమెలో భయాన్ని కలిగించింది. అక్కడ చనిపోయిన యువతి తనకు బదులుగా చంపబడిందన్న విషయం అర్థం కాగానే ప్రేమ శరీరం జలదరించింది. దీనికంతా కారణం సూట్ కేస్ అన్న విషయం తెలియగానే ప్రేమకూడా సూట్ కేస తాళం విరగ్గొట్టి చూసింది. చూస్తూనే కళ్లు తిరిగాయి.

సూట్ కేస్ నిండా నోట్లున్నాయి.

ఒక క్షణకాలం ఏంచేయాలో తోచలేదు ప్రేమకి. ఆ

వెంటనే భయంతో నేరుగా విజయవాడ వెళ్ళిపోయి ఒక హోటల్లో దిగింది.

రెండవరోజు ఉదయం 'యాభైవేలు కో-ఆపరేటివ్ స్టోర్స్ డబ్బుతో ప్రేమ అనే యువతి మాయమయింది' అన్న హెడ్ లైన్స్‌తో వున్న న్యూస్ పేపర్ చూడగానే ప్రేమ కాళ్ళు చేతులు చల్లబడ్డాయి. ఆమె మళ్ళీ రాంనగర్ వెళ్ళలేక పోయింది. ఆ డబ్బులోంచి రెండువేలు ఖర్చు పెట్టుకుని మిగిలిన డబ్బుని స్టోర్స్‌కి తిప్పి పంపింది.

ఇప్పుడు బయట డ్రాయింగ్ రూంలో ఎవరు కూర్చున్నారో తెలుసా? ఆ విద్యాసాగర్ ఎవరో మీకు తెలుసా?? ఆ హంతకుడు అతనే. ఆ సూట్ కేస్‌లో వున్న డబ్బుకోసం ప్రేమ అనుకుని అమాయకురాలయిన సదానంద్ చెల్లెలు రాజేశ్వరిని చంపిన హంతకుడు!"

అంటూ లత ఆగింది. ఆమె విశాలమైన నేత్రాలలో భయం ఇంకా తొంగిచూస్తోంది.

"కాని; లతా! ఇదంతా నీకెలా తెలుసు? విద్యాసాగరే హంతకుడని నీవద్ద రుజువేముంది. చెప్పు?" ఉద్విగ్నంగా అడిగాను.

"ఊహూ! మీరింకా అర్థం కాలేదు. మీరనవసరంగా సమయం వృధాపరుస్తున్నారు. మొదలా హంతకుణ్ని అరెస్ట్ చేయండి. అతను చేసిన హత్యకు ప్రత్యక్ష సాక్షిని నేను. అతను రాజేశ్వరిని చంపడం నేను నా కళ్ళతో చూశాను. నేనే ఆ ప్రేమని. నా పూర్తి పేరు ప్రేమలత. కో-ఆపరేటివ్ స్టోర్స్‌లో పనిచేసిన ఆ ప్రేమని నేనే. నేననుకొనే ఈ విద్యాసాగర్ రాజేశ్వరిని చంపాడు" ప్రేమలత కాదు, నా లత అంది.

లత చెప్పిన మాటలతో నాకంతా అర్థమయింది. ధైర్యం చెబుతూ లత జుత్తు నిమిరాను. 'అంతా అర్థ

మయింది లతా! ఇంక ఈ హంతకుడు నా చేతుల్లోంచి తప్పించుకోలేడు" అంటూ ఆవేశంగా లేచాను.

"హాండ్స్ అప్ మేడం లతా. అండ్ యూ ఆజ్ వెల్ ఇన్స్పెక్టర్ విజయమోహన్."

విద్యాసాగర్ చిరపరిచితమైన కంఠస్వరం వినిపించింది. వెనక్కి తిరిగి చూసేసరికి నేను చేసిన పొరపాటు తెలిసివచ్చింది. లత తలుపు మూయమన్నపుడు రెండో వైపు తలుపులు మూయలేదు.

విద్యాసాగర్ తనచేతిలో రివాల్వర్‌తో నిలబడి వున్నాడు. నేను నిస్సహాయంగా చేతులు ఎత్తాను.

"వెల్, యూ ఆర్ వెరీ క్లెవర్ ఇన్స్పెక్టర్. ఎలా గయితేనేం మొత్తానికి హంతకుణ్ణి కనిపెట్టావు" అంటూ అతను ముందుకివచ్చి రివాల్వర్‌ని లత వీపుకి ఆనించాడు.

నాకేం చేయడానికి తోచడం లేదు. అలాగే చేతులెత్తి నిలబడ్డాను.

"నాకు విరుద్ధంగా, నేను చేసిన నేరానికి ప్రత్యక్ష సాక్ష్యం ఇంత దగ్గరలో వుందని నేనేనాడూ అనుకోలేదు. లేకుంటే ఏనాడో ఈమె కూడా రోజ్ విల్లాలోని భూతాలకి బలయిపోయి వుండేది. తలుపు చాటునుండి ఈమె మాటలు విన్న నేను నిర్ఘాంతపోయాను. అసలు నమ్మలేకపోయాను. కాని ఆలోచిస్తే అంతా నిజమే ననిపిస్తూంది. ఇంతవరకు నేను నాకు విరుద్ధంగా వున్న సాక్ష్యాలను రూపుమాపుతూ వచ్చాను" అంటూ క్రూరంగా నవ్వాడు విద్యాసాగర్.

"కాని, విద్యాసాగర్; ఎప్పటికీ చట్టాన్ని మోసగించ గలననుకోవటం నీ భ్రమ. ఎప్పటికయినా పట్టుబడతావు. తప్పదు. అందుకని నీ అంతట నువ్వే చట్టానికి లొంగిపో."

"ఇచ్చిన సలహాకి చాలా చాలా థాంక్స్" విద్యా

సాగర్ నమ్మకంగా అన్నాడు. "మీ చట్టం నన్నేమీ చేయలేదు. మిమ్మల్నికూడా చంపి నేనిక్కడినుండి వెళ్ళిపోతాను. నా రహస్యం మీతోనే అంతమవ్వాలి."

ఎదురుగా కిటికీవైపు చూసిన నా హృదయం ఒక్క క్షణం వేగంగా కొట్టుకొంది. తొమ్మిదేళ్ళ క్రితం విద్యాసాగర్ హత్య చేయబోవటం ఆ కిటికీలోంచే చూశారు దారిన వెళ్తున్న సీనయ్య, అతని కొడుకు పోతరాజు.

ఇవాళ మళ్ళీ అదే విద్యాసాగర్ చేయబోతున్న దుష్కృత్యాన్ని బయటకు వెళ్ళి అటుగా వస్తున్న సతీష్ చూశాడు. అతను నక్కి నక్కి కిటికీవద్దకు చేరుకుని కిటికీ గుండా నిశ్శబ్దంగా లోపలకు దిగాడు.

సాగర్ దృష్టి తన వెనుకగా వస్తున్న సతీష్‌పై బడ నందుకి చాలా సంతోషించాను.

విద్యాసాగర్ వెనక్కి చేరుకున్న సతీష్ ఒక్క ఉదుటున విద్యాసాగర్ రెండు చంకల క్రిందుగా చేతులు పోనిచ్చి అతని మెడపై కత్తెరపట్టు వేసి బంధించాడు. విద్యాసాగర్ ఉలికిపడి విడిపించుకోవడానికి ప్రయత్నించాడు కాని, సతీష్ పట్టిన భల్లూకపు పట్టునుండి తప్పించుకోలేకపోయాడు.

"సతీష్! జాగ్రత్త! అతని చేతిలో రివాల్వరుంది" నేను అరుస్తూ ముందుకురికాను.

ఈలోగా విద్యాసాగర్ రెండుసార్లు రివాల్వర్ పేల్చాడు. కాని అప్పటికి అతని చేతులు సతీష్ పైకెత్తటంవల్ల రివాల్వర్ గుళ్ళు లోజ్ విల్లా పైకప్పుని ఛేదించాయి.

సతీష్ తన మోకాలు ముడిచి విద్యాసాగర్ వీపుకి ఆనించి అతన్ని వెనక్కి విల్లులా వంచాడు. నేను ముందుకి సాగి అతని రివాల్వర్ చేతిని జాడించి తన్నాను.

దాంతో రివాల్వర్ అతని చేతుల్లోంచి జారిపడింది.

రివాల్వర్ చేతిలోంచి జారిపోగానే విద్యాసాగర్ లోని ధైర్యం సన్నగిల్లింది.

లత ఒక్క పరుగున నన్ను బల్లిలా అతుక్కుపోయింది. ఆమె కళ్ళలో ఇంకా భయం గూడుకట్టుకుని వుంది.

"భయపడక లతా! ఇన్ని హత్యలు చేసిన హంతకుడు పట్టుబడ్డాడు. ఇతని అరెస్టుతో రోజ్ విల్లాకి పట్టిన దెయ్యాల బెడదకూడా వదిలింది" అనునయంగా అన్నాను.

ఈలోగా "సాబ్! ఏమి జరిగింది. రివాల్వర్ చప్పుడు వినిపించింది. తలుపు తీయండి సాబ్!" అంటూ యాకూబ్; పనివాడు గోవిందూ అరిచారు.

నేను లతని వదిలించుకుని వెళ్ళి తలుపు తీసాను. యాకూబ్, గోవింద్ లు లోపలకు వచ్చారు. విద్యాసాగర్ ని పట్టుకొని కాళ్ళు చేతులు కట్టేశారు. యాకూబ్, ఇన్స్పెక్టర్ భుజంగరావుని పిలుచుకు రావటానికి పరుగున వెళ్ళాడు. సతీష్, గోవింద్ లు విద్యాసాగర్ ని తీసుకొని ముందు డ్రాయింగ్ రూమ్ లోకి వెళ్ళారు.

"ఏమండీ! నన్ను క్షమిస్తారా?" లత సజల నయనాలతో అంది.

"అరె! ఆ కన్నీళ్ళెందుకు?" నేను లత కన్నీటిని కొనగోట తుడుస్తూ అన్నాను. "ఇందులో నీ తప్పు ఏమీ లేదు లతా! నీ స్థానంలో ఎవరున్నా అలాగే చేసే వారేమో! నీది నిర్మలమయిన మనస్సు కాబట్టి ఆ డబ్బు తిరిగి ఇచ్చేశావు. ఇంకొకరైతే ఇచ్చేవారేనా? మిగిలిన ఆ రెండువేలు నేను ఇచ్చేస్తాను లే" అని ఆమెను అక్కున చేర్చుకున్నాను.

—: ఐ పో యిం ది :—

# న్యూక్లియర్ టెస్ట్

## టెంపోరావ్

అంబరాయి హోటల్లో కూర్చుని ఇండియా కింగ్స్ సిగరెట్ పీలుస్తున్నాను. రెండు బడా పెగ్గులు స్కాచ్ విస్కీ సేవించి మరో బడా పెగ్ పొయ్యమని బాయ్‌తో చెప్పాను.

నా ఏర్ కండిషండ్ గదిలో చల్లగావుంది. టెలిఫోన్ మ్రోగింది. పార్వతి నాలుగుసార్లు మద్రాసునుంచి డైరెక్ట్ డయిలింగ్ చేసి నాతో మాట్లాడింది. ఇది ఐదో కాల్ అయివుండాలి!

"హలో, పరశురామ్ స్పీకింగ్!" అన్నాను, రిసీవర్ ఎత్తి.

"మిస్టర్ పరశురామ్, సి. బి. ఐ డైరెక్టర్ శివస్వామి!"

అన్నాడతను.

"ఎక్కడినుంచి?"

"బొంబాయిలోనే వున్నాను. చాలా సీక్రెట్ మిషన్ మీద ఇక్కడికొచ్చాను. మనం మాట్లాడాలి!"

"కమెలాంగ్!" అన్నాను ఉషారుగా.

పదిహేను నిమిషాల్లో సి. బి. ఐ. డైరెక్టర్ శివస్వామి నాగది చేరుకున్నాడు. పెద్ద సోఫాలో ఇద్దరం ఎదురెదురుగా కూర్చున్నాం. షీవాస్ రీగల్ స్కాచ్ విస్కీ బాటిల్ని తెరిచి బాయ్ మా గ్లాసుల్లో కొద్దిగా పోసి, ఐస్ క్యూబ్స్ వేసి సోడా కలిపాడు.

ఇద్దరం గ్లాసులెత్తి తాగుతున్నాం. బాయ్ బయటకు వెళ్ళిపోయాడు.

"మిస్టర్ పరశురామ్, ఇండియా న్యూక్లియర్ పవర్ కాబోతోంది!" అన్నాడతను.

"ఎక్సలెంట్! తతిమ్మా దేశాలు మన్ని ఇటుపైన గౌరవిస్తాయి!" అన్నాను.

శివస్వామి గ్లాసులోని సగం విస్కీపైన తాగేశాడు. కింగ్ సైజ్ గోల్డ్ ఫ్లేక్ సిగరెట్ వెలిగించాడు.

"మిస్టర్ పరశురామ్, త్వరలో ఇండియా ప్లుటోనియమ్ న్యూక్లియర్ టెస్టును చేయబోతోంది. భూమిలో వంద మీటర్ల లోతున ప్లుటోనియమ్ డివైస్ పేలుతుంది. రేడియో యాక్టివిటీ గాలిలోకి ప్రసరించదు. ఇంప్లోషన్ టెక్నిక్‌తో అణుపాటవ పరీక్ష సాగుతుంది."

గ్లాసుల్లో మళ్ళా విస్కీ పోసి, ఐస్ వేసి సోడా కలిపాను.

"మన సైంటిస్టులను మెచ్చుకోవాలి!" అన్నాను.

"కాని అడ్డంకులున్నాయి. మనం న్యూక్లియర్ డివైస్ పేల్చబోతున్నామని కొందరికి తెలిసిపోయింది. చాలా

మంది గూఢచారులు మనదేశంలో రహస్యంగా ప్రవేశించారు. న్యూక్లియర్ టెస్టు జరగకుండా చూడాలని వాళ్ళ తాపత్రయం!'' అని ఆగాడు శివస్వామి.

గుమ్మంవైపు చూశాను. తలుపు దగ్గరగా మూసివుంది. గది నలువైపులా పరికించాను.

''వాళ్ళను మనం ఆపాలి!''

''అందుకే మీవద్దకొచ్చాను,'' అన్నాడు శివస్వామి.

సిగరెట్‌ని యాష్ట్రేలో పడేసి అతనికేసి చూశాను.

''ప్రొసీడ్!''

''మిస్టర్ పరశురామ్, మాకు రహస్యంగా సమాచారం అందింది. గూఢచారులు బొంబాయిలో దిగారు. అందుకే నేనిక్కడికి వచ్చాను. వాళ్ళను మనం పట్టుకోవాలి! న్యూక్లియర్ టెస్టుకి వాళ్ళు ఏవిధంగానూ అడ్డం రాకూడదు!'' అన్నాడు శివస్వామి.

''చూద్దాం!'' అన్నాను.

''మిస్టర్ పరశురామ్, చూద్దాం అంటే నేనొప్పుకోను. మీ శక్తి సామర్థ్యాలు నాకు తెలుసు. మీరు రంగంలోకి దిగాలి! గూఢచార్లను తుదముట్టించాలి! వాళ్లు దేశంలో వుంటే మన న్యూక్లియర్ టెస్టు జరగదు!''

''ఆల్‌రైట్, నేను నిర్విరామంగా పని చేసి వాళ్ళను పట్టుకోడానికి ప్రయత్నిస్తాను!'' అన్నాను.

సి. బి. ఐ. డైరెక్టర్ శివస్వామి నాతో కరచాలనం చేసి బయటకు వెళ్ళాడు. గుమ్మం బయట నిలబడి నాకేసి చూశాడు.

''మిస్టర్ పరశురామ్, నేను ప్లాస్టిక్ బాగ్ సోఫాలో వదిలేశాను. అందులో చాలా సమాచారముంది. అదంతా జాగ్రత్తగా చూడండి!''

''చూస్తాను!'' అన్నాను.

శివస్వామి వెళ్ళిపోయాడు. తలుపు దగ్గరగా మూసి సోఫాలో చతికిలబడ్డాను. టెలిఫోన్ మ్రోగింది.

"హాలో!" అన్నాను.

"పార్వతి!" అందామె.

"నన్ను నిద్రపోనివ్వవ్!" అన్నాను కోపంగా.

"ఏంచేస్తున్నారు?" అడిగిందామె.

"పార్వతి, నేను చాలా బిజీగా వున్నాను. పరాయి స్త్రీతో నేను గదిలో ఆనందించడం లేదు!"

"నేను అలా అనలేదుగా?" అందామె.

"నువ్వు భారత స్త్రీవి. నా భార్యవి. ఎప్పుడూ అనవుగా?"

"మీరు మద్రాస్‌కి ఎప్పుడొస్తారు?"

"బి. ఓ. కె— గాడ్ ఓన్లీ నోస్!"

"నాకు తోచడంలేదు!" అంది పార్వతి.

"కారులో బీచ్‌కి వెళ్లు! టేప్ రికార్డర్ ఆన్ చేసి పాటలు విను! అంతకంటె మనిషికి ఏంకావాలి?"

"నాకు అవన్ని వద్దు! మీరుంటే చాలు!"

"పార్వతీ!" అన్నాను తీయగా.

ఆ క్షణంలో ఆమెను హృదయానికి హత్తుకొని కౌగలించుకోవాలనిపించింది! ఆడవాళ్ళను కొనొచ్చు, కాని ఆప్యాయతను కొనలేం!

"తొందరగా రావాలనుకున్నాను. కాని శివస్వామి పెద్ద పని అప్పచెప్పాడు. ఇది పూర్తిచేయడానికి ఎంత కాలం పడుతుందో నేను చెప్పలేను!"

"గుడ్ నైట్ అండ్ స్వీట్ డ్రీమ్స్!" అంది పార్వతి.

రిసీవర్ని పెట్టేశాను. సోఫాలో కూర్చుని విస్కీ తాగుతూ ప్లాస్టిక్ బాగ్ తెరిచి చూశాను. కాగితాలను చదవడం ప్రారంభించాను. డజన్ సైంటిస్టుల పేర్లు

వున్నాయి. వాళ్ళలో ఎవరు మాయమైనా న్యూక్లియర్ డివైస్ టెస్టు సాగడం సాధ్యంకాదు. వాళ్ళందర్నీ నేను కాపాడాలి!

టైమ్ చూశాను. తొమ్మిది దాటింది. పత్రాలన్నీ చదివి కిందనున్న ఏర్‌కండిషండ్ డైనింగ్ హాల్లోకి వెళ్ళాను. ఒంటరిగా ఒక టేబుల్ ముందు కూర్చొని డిన్నర్ ఆర్డరిచ్చాను. అనేకమంది హాల్లో కూర్చుని భోజనం చేస్తున్నారు. అందమైన యువతులు! నా ఎదురుగా ఒక యువతి ఒంటరిగా కూర్చుని వుంది. చీటికీ మాటికీ ఆమె గుమ్మంకేసి చూస్తోంది! లవర్ కోసం ఎదురు చూస్తోందేమో!

పది నిమిషాలు గడిచిపోయాయి. బాయ్ ఇంకా డిన్నర్ పట్టాలేదు. కొంచెం దూరంలో స్టేజ్ వుంది. మిస్ సోఫియా కాబ్రే డాన్స్ చేస్తోంది. వెస్టర్న్ ఆర్కెస్ట్రా శ్రావ్యంగా వినపడ్తోంది. చటుక్కున కుర్చీలోంచి లేచి ఎదుటనున్న టేబుల్ వద్దకు వెళ్ళాను. ఆమె నావైపు విచిత్రంగా చూసింది.

"మిస్, ఇక్కడ కూర్చోవచ్చా?" అడిగాను నవ్వుతూ.

"నా ఫ్రెండ్ వస్తాడు!" అందామె.

"అతను వచ్చేదాకా కూర్చోనా?"

"ప్లీజ్ కూర్చోండి!"

బాయ్ కొన్ని ప్లేట్లు తెచ్చి నా ముందు పెట్టాడు. ఆమె కేసి చూశాను.

"మీరు ఏం తింటారు?"

"ఏదీ వద్దు! థాంక్స్!"

"కనీసం ఏదైనా తాగండి! షేంపేన్, జిన్!"

"షేంపేన్!" అందామె.

ఆమెకు షేంపేన్, నాకు విస్కీ ఆర్డరిచ్చాను. సూప్ చప్పరిస్తూ ఆమెవైపు తిరిగాను. పొడుగ్గా, పచ్చగా వుంది. కోల ముఖం, పెద్దకళ్ళు, బెల్ బాటమ్స్, స్లాక్ ధరించింది. పాదాలకు కాశ్మీర్ స్లిప్పర్లున్నాయి! ఈమె మరాఠీ యువతి అయివుండదు!

విస్కీ తాగుతూ ఆమెను గమనిస్తున్నాను. కొద్దిగా షేంపేన్ తాగి పెదిమలను నాలికతో తుడుచుకుంది. పెదిమలు ఎర్రగా వున్నాయి. తెల్లటి పళ్ళు!

అరగంట గడిచింది. షేంపేన్ గ్లాసు ఖాళీగావుంది. ఆమె లేచింది.

"థాంక్స్ ఫర్ ది డ్రింక్! ఏదో పనితగిలి అతను రాలేదు. నేను ఇంటికి వెళ్ళిపోతాను," అందామె.

"నాతో డిన్నర్ డేట్ వుందనుకోండి!" అన్నాను.

"మీతో నాకు పరిచయంలేదు!"

ఫక్కున నవ్వాను.

"గంటలో పాతస్నేహితులం అయిపోతాం!"

ఆమె సంశయిస్తూ నిలబడింది. ఆమెచెయ్యి పట్టుకుని, "కూర్చోండి!" అన్నాను.

కుర్చీలో ఆమె చతికిలబడింది. ఆమెకు డిన్నర్ ఆర్డరిచ్చి మళ్ళా షేంపేన్, విస్కీ పట్రమ్మన్నాను.

"మీ పేరు?"

"మిస్ దేవత."

"ఫైన్ నేమ్! ఐయామ్ పరశురామ్, బిజినెస్‌మన్!"

ఆమె నాతో కరచాలనం చేసింది. హాల్లోని వాళ్ళు చప్పట్లు కొట్టారు. స్టేజికేసి చూశాను. మిస్ సోఫియా అమోఘంగా తిరుగుతోంది, పట్టీలు కొడ్తోంది! డ్రమ్స్ మ్రోగుతున్నాయి!

హాల్లోని లైట్లు డిమ్‌గా వెలుగుతున్నాయి. అప్రయ

త్నంగా టేబుల్ కింద మా మోకాళ్ళు ఢీకొన్నాయి. ఆమె వెనక్కి జరగలేదు. నన్ను చూసి విచిత్రంగా నవ్వింది.

తలుపు తోసుకుని ఒక యువకుడు లోపలకొచ్చాడు.

"నీ ఫ్రెండేమో!" అన్నాను, ఏకవచనంలోకి దిగుతూ.

"కాదు!" అందామె.

ఆమె తింటోంది. మధ్యలో షేంపేన్ తాగుతోంది. విస్కీ నా మెదడుమీద పనిచేస్తోంది. ఉషారుగావుంది. గాలిలో ఎగరాలనిపిస్తోంది! మెల్లిగా విజిల్ వేశాను. బాయ్ పరుగెత్తుకొచ్చాడు.

"అనదర్ రౌండ్ ఆఫ్ డ్రింక్స్!"

"నాకొద్దు!" అంది దేవత.

"షేంపేన్ ఒంటికి మంచిది. మంచి రంగు వస్తుంది!"

"వున్న రంగు చాలు!" అందామె.

ఆర్కెస్ట్రా మ్రోగుతోంది. మిస్ సోఫియా వెళ్ళిపోయింది. హాల్లోని లైట్లు బ్రయిట్ గా వెలుగుతున్నాయి. హోటల్ మేనేజర్ ఫాక్స్ మా దగ్గరకొచ్చాడు. డ్రింక్స్ వచ్చాయి.

"మిస్టర్ పరశురామ్, ఎలావుంది మా సర్వీస్!" అడిగాడతను.

"స్ప్లెన్డిడ్!"

అతను పక్క టేబుల్ వైపు కదిలాడు. పదిన్నరైంది. బాయ్ తెచ్చిన బిల్ మీద సంతకం పెట్టి ఇండియా కింగ్స్ సిగరెట్ వెలిగించాను. ఇద్దరం ఏర్ కండిషండ్ హాల్లోంచి బయటకొచ్చాం.

మెట్ల ప్రాంతంలో నిలబడి ఆమెకేసి చూశాను. ఆమె కొద్దిగా తూలుతోంది.

"ఓవర్ డోస్!" అందామె.

"కాస్సేపు నా గదిలో కూర్చుందాం. తర్వాత వెళ్ళొచ్చు!"

"అమ్మ తిడుతుంది!"

"నేను నిన్ను ఇంటికి తీసుకెళ్ళి దింపుతాను. డోంట్ బాదర్!" అన్నాను.

## 2

మిస్ దేవత సోఫాలో వెల్లకిలా పడుకుంది. ఆమె పక్కనే కూర్చున్నాను. ఆమె కళ్ళు మూసుకుని నిద్ర పోతోంది. టైమ్ పదకొండు దాటింది. ఆమెను తట్టి లేపాను.

"నీ ఇల్లెక్కడ?"

"శాంతా క్రూజ్!" అందామె.

"వెళ్దామా?"

"టాక్సీలో నేను వెళ్ళగలను!"

ఆమె లేచింది. అద్దం ముందు నిలబడి తల దువ్వుకుంటోంది. వెళ్ళి ఆమె వెనకనే నిలబడ్డాను. నా చేతులు ఆమెను చుట్టేశాయి. ఆమె వెనక్కి తిరిగి నాకేసి అదోలా చూసింది.

"ప్లీజ్, నన్ను వదలండి! నేను వేశ్యను కాను!"

ఆమె ఎర్రటి పెదిమలను ముద్దెట్టుకున్నాను. దేవత వద్దనలేదు. నావైపు తిరిగి, చేతులను నా వెనక బిగించింది.

"మిస్టర్ పరశురామ్, మిమ్మల్ని చూశాక నా మనసు మారింది. నన్ను పిచ్చిదాన్ని చేశారు!" అందామె.

ఆమెను వదిలేశాను. సోఫాలో కూర్చుని సిగరెట్ పీలుస్తున్నాను. మిస్ దేవత నా ఎదురుగా వచ్చి నిలబడింది. నా కాళ్ళమీద కూర్చుని నా కళ్ళల్లోకి సూటిగా చూసింది.

"ఇంటికి వెళ్లాలనిపించడం లేదు!" అందామె.

"అమ్మ తిడుతుందన్నావు!" జ్ఞాపకం చేశాను.

టీపాయిమీదున్న గ్లాసులకేసి చూసిందామె. గ్లాసుల్లో స్కాచ్ విస్కీపోసి, సోడా కలిపింది. నేను ఐస్ క్యూబ్స్ పడేశాను.

"యూ స్వీట్ లవ్!" అందామె గ్లాసును ఎత్తి.

"నువ్వు ఏంచేస్తున్నావు?"

"మోడల్ గా పనిచేస్తున్నాను! అనేక అడ్వర్టైజ్ మెంట్లలో నా రూపాన్ని మీరు చూసి వుండొచ్చు! మనోరమా క్లాత్ మిల్స్! కరన్ చంద్ ప్రెషర్ కుక్కర్! ఇంకా ఎన్నో!"

నేలమీద పడున్న టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికను తిప్పాను. ఒక రిఫ్రిజిరేటర్ పక్కనే ఆమె నిలబడి వుంది!

"యూ ఆర్ బ్యూటిఫుల్!" అన్నాను.

"అందంలేని యువతులకు మోడల్స్ గా అవకాశాలు దొరకవు!"

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని అందుకుని "హల్లో!" అన్నాను.

"శివస్వామి స్పీకింగ్!"

"చెప్పండి!"

"మిస్టర్ పరశురామ్, సైంటిస్టు డాక్టర్ రామన్ ఇంటికి రాలేదట. ఏమైనాడో ఎవ్వరికీ తెలియదు!"

పన్నెండుగురు సైంటిస్టులలో రామన్ ఒకడని గుర్తొచ్చింది.

"ఏ నైట్ క్లబ్ కేనా వెళ్ళాడేమో!"

"లేదు. అతని విషయం మీరు వెంటనే కనుక్కోండి! మోస్ట్ ఇంపార్టెంట్!" అన్నాడతను.

రిసీవర్ని పెట్టేసి ప్లాస్టిక్ బాగ్ తెరిచాను. సెంటిస్టు రామన్ గురించి, వివరాలు మరోసారి చదివాను. బాగ్ మూసి బీరువాలో పెట్టి దేవత ను బుగ్గమీద ముద్దెట్టు కున్నాను.

ఆమె సోఫాలోంచి లేచింది.

"ఒక ఫ్రెండ్ ఇంటికి అర్జంటుగా వెళ్ళాలి! పోదాం పద!" అన్నాను.

గదికి తాళం వేశాను. హోటల్ ముందున్న ఫియట్ కారులో ఎక్కాం. కారు పైకి పాతదానిలా కనిపిస్తుంది. కాని కొత్త డబుల్ ఇంజన్ కారది. స్టార్ట్ చేసి కార్ను పోనిచ్చాను.

బొంబాయి రోడ్లమ్మట కారు వెళ్తోంది. రోడ్డువారగా కొందరు పేకాడుతున్నారు! కామాటీపుర ప్రాంతంలో గుమ్మంలో నిలబడిన ఆడవాళ్లు మొగాళ్ళను చూసి కన్ను గీటుతున్నారు. మిస్ దేవత గాభరాగా దగ్గరకు జరిగింది. ఎడంచేత్తో ఆమె నడుమును చుట్టి పట్టుకున్నాను. దేవత ఒళ్ళు వేడిగా వుంది!

"నేనీ పట్నంలో కొంతకాలంపాటు వుంటాను," అన్నాను.

"రోజూ మీ హోటల్ కి రాలేను! రేపటినుంచి వారందాకా మోడలింగ్ వర్క్ వుంటుంది!" అందామె.

"ఇంటికి ఎప్పుడు చేరుకుంటావు?"

"రాత్రి పదింటికి!"

"నేనే మీ ఇంటికొస్తాను!"

"మొగాళ్లు ఇంటికి రావడం అమ్మకిష్టంగా వుండదు. రోడ్డుమీద కారు ఆపి మూడుసార్లు హారన్ కొట్టండి. నేను వస్తాను. ఎక్కడికేనా పోదాం!"

"స్వీట్ ఫేస్!" అన్నాను గడ్డాన్ని నిముర్తూ.

ఎడంవైపు కొక సందు తిరిగింది. ఆమె కారును ఆపమంది. సందులో దీపాలు వెలుగుతున్నాయి. దేవత కార్లోంచి దిగింది. నా చెయ్యిపట్టుకుని, ఆప్యాయంగా నొక్కి వదిలేసింది.

"ఆ సందులో వుంది మా ఇల్లు. నంబర్ 10, అయిదో అంతస్థు! ఫ్లాట్ F-3," అందామె.

"గుడ్ నైట్!" అని కారును పోనిచ్చాను.

చెంబూర్‌లోని ఒక ఎత్తయిన ఇంటిముందు కారు ఆపాను. గేటు తెరిచివుంది. ఇంట్లోని లైట్లు వెలుగుతున్నాయి. కారుదిగి గేట్లోంచి లోపలకు వెళ్ళాను. ముందు హాల్లో ఒక యువతి సోఫాలో కూర్చునివుంది. కొంతమంది గుంపుగా ఆమెచుట్టూ నిలబడి ఏదో చెప్తున్నారు. నాకేసి ఆమె సూటిగా చూసింది.

"ఐయామ్ పరశురామ్," అన్నాను.

"దయచేసి కూర్చోండి. నేను మిసెస్ రామన్. నా పేరు శాంత. వీళ్ళందరూ ఇరుగుపొరుగు వాళ్ళు!" అందామె.

"ఏమైందో తొందరగా చెప్పండి!"

"ఆయన పొద్దుట ఎనిమిదింటికి వెళ్ళారు. ఇంతవరకూ రాలేదు!" అంది శాంత.

"ఆయనకు ఆలస్యంగా వచ్చే అలవాటు లేదా?"

"ఆయన ఏ స్నేహితుడు ఇంటికీ వెళ్ళరు. ఎప్పుడూ తనపని గురించే ఆలోచిస్తూ వుంటారు. రాత్రిళ్ళుకూడా నిద్రపోరు! చీకటి పడేలోగా ఆయన ఇంటి కొస్తారు. కాఫీతాగి తన లైబ్రరీ గదిలోకి వెళ్ళిపోతారు!"

"ఆయన లైబ్రెరీ గది ఎక్కడుంది?"

ఆమె లేచింది. లోపలకు వెళ్ళింది. వెనక నే వెళ్లాను. ఒక ఏర్ కండిషండ్ గదిలోకి ఆమె ప్రవేశించింది. లైటు

ప్రకాశవంతంగా వెలుగుతోంది. గదిలో రెండు సోఫాలున్నాయి. అన్నివైపులా గాడ్రెజ్ స్టీల్ రాక్స్ వున్నాయి. రాక్స్‌నిండా పుస్తకాలు! ఆ పుస్తకాలను చూసి ఆశ్చర్యపోయాను.

ఆ పుస్తకాలన్నీ చదివి అర్థం చేసుకోవాలంటే మనిషికి ఒక జీవితం చాలదేమో!

అన్నీ సైన్స్ బుక్సులు! ఐన్‌స్టీన్ మొదలగు ప్రఖ్యాత రచయితల పుస్తకాలున్నాయి. రాక్స్‌ను పరిశీలించి కాంతవైపు తిరిగాను. కాంత వయస్సు ఇరవై ఎనిమిది దాటివుండదు. ఆమె మొహంలో కళ లేదు. వాడిపోయిన పువ్వులా వుందామె. ఎందుకలన?

"మీ భర్త ఎప్పుడూ ఏదో చేస్తూ వుంటారు! మీతో మాట్లాడ్డానికి కూడా ఆయనకు టైమ్ దొరకదేమో!" అన్నాను.

"ఆయనకు భార్య ఎందుకులెండి! లాబరేటరీ, పుస్తకాలు_ అవిచాలు! అటువంటివాళ్ళు ఎందుకు పెళ్ళాడతారో!" అందామె.

ఆమె దగ్గరగా వెళ్ళాను. ఆమెవైపు నవ్వుతూ చూశాను.

"ఈ ఫ్లాట్‌లో ఎవరెవరుంటున్నారు?"

"ఆయనా, నేనూ! మాకు పిల్లలులేరు. పెళ్ళయి పదేళ్ళయింది."

"రాత్రిళ్ళు ఆయనకు నిద్ర ఎందుకు పట్టదు?"

"ఏదో ఆలోచిస్తూ వుంటారు. తలాడిస్తూ లైబ్రెరీ గదిలోకి పరుగెడ్తారు. పుస్తకాల మధ్య సోఫాలో కూర్చుని కునికిపాట్లు పడ్తూ వుండడం ఆయనకు అలవాటు."

గదిలోంచి బయటకొచ్చాను. ముందు హాల్లో కాస్సేపు

నిలబడి అందర్నీ చూశాను. కాంతకి బై బై చెప్పి కారు వద్దకు నడిచాను. కారులో కూర్చుని తలుపు మూశాను. డాక్టర్ రామన్ వుండేది పదంతస్తుల భవనం. కింద ఫ్లాట్‌లో అతనుంటున్నాడు. కారును పోనిచ్చాను.

చల్లటిగాలి వీస్తోంది. కారు శరవేగంగా వెళ్తోంది. పెద్ద కాంపౌండులోకి కార్ను పోనిచ్చాను. గేటుదగ్గర పోలీస్ కానిస్టేబుల్స్ వున్నారు. కాంపౌండులోని లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

ఇన్‌స్పెక్టర్ డోంగ్రే గబగబావచ్చి నాకు నమస్కరించాడు. "డాక్టర్ రామన్ గదిలో లేరుసార్!"

"ఆయన గదిలోకి పదండి!" అన్నాను.

డోంగ్రే, నేనూ ఒక గదివైపు నడిచాం. గుమ్మం బయట యూనిఫామ్‌లో నౌఖరు నిలబడ్డాడు. లోపలకు వెళ్ళాను. పెద్ద గది. డాక్టర్ రామన్ టేబుల్ దగ్గర కెళ్ళాను. కుర్చీలో కూర్చుని గది నలువైపులా చూశాను.

"మిస్టర్ డోంగ్రే, గదిబయటవున్న నౌఖర్‌తో మాట్లాడారా?"

"లేదు. అతనికి ఏమీ తెలియదు."

"చెప్పలేం! ఒక్కోసారి నౌఖర్లు చూసిందీ, విన్నదీ ఎంతో ఉపయోగపడ్తుంది!"

కాస్సేపట్లో నౌఖరు నావద్దకొచ్చి నిలబడ్డాడు.

"ఆయన ఎప్పుడు వెళ్ళారు? ఎలా వెళ్ళారు?"

"అయిదున్నరకి ఆయన కారులో వెళ్ళారు, సాబ్. డ్రయివర్ కూడా ఆయనతో వున్నాడు."

"వెళ్ళేముందు ఆయన ఎవరితోనైనా మాట్లాడారా?"

"ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడారు."

"ఫోన్ ఎవరో చేశారా?"

"అవును సాబ్! చాలాసేపు రింగ్ అయ్యాక ఆయన

రసీదర్ని ఎత్తి మాట్లాడారు. వెంటనే వెళ్ళిపోయారు!''

ఇండియా కింగ్స్ సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తున్నాను. ఎవరేనా అతడ్ని రమ్మన్నారా? అంత తొందరగా అతను ఎందుకని వెళ్ళిపోయాడు? నాఖర్ని పొమ్మన్నాను. ఇన్స్పెక్టర్ డోంగ్రే కేసి చూశాను.

''ఆయన కారుకోసం మనం పట్నమంతా వెతకాలి!'' అన్నాను.

''పాట్రోల్ వన్స్ వెతుకుతున్నాయి.''

''డ్రయివర్ ఇంటి అడ్రెస్ తెలుసా?''

డోంగ్రే సెక్రెటరీని ఒక అడ్రెస్ నాకు చూపించాడు. దాన్ని జ్ఞాపకముంచుకుని బయటకు నడిచాను. కారును వేగంగా పోనిచ్చాను. పూరుమూలుంది డ్రయివర్ ఇల్లు. పాతబడిన కొంప. కారు ఆపి దిగాను. ముందు తలుపును కొట్టాను. తలుపు తెరవబడింది. లోపల లైటు వెలుగుతోంది. గదిలోకి అడుగు పెట్టాను.

తప్పతాగిన ఒకతను నాకేసి కోపంగా చూశాడు.

''ఇంత రాత్రివేళ ఏం కావాలి?''

''డాక్టర్ రామన్ డ్రయివర్!'' అన్నాను.

''నేనే!'' అన్నాడతను.

''మంచి మూడులో వున్నావు. డాక్టర్ రామన్ ఎక్కడ?''

''ఆయన నన్ను కారుదిగి ఇంటికి పొమ్మన్నారు. ఎక్కడికో వెళ్తానన్నారు!''

''ఎక్కడికి వెళ్లుంటారు?''

''యజమానులు డ్రయివర్లతో చెప్పి వెళ్ళరు!''

అతనికేసి సూటిగా చూశాను.

''నువ్వు కారు దిగేసరికి ఆయన ఎలావున్నారు?''

''గాభరాగా వున్నారు. భార్యకీ, ఆయనకీ ఏదో

యూదం అయిందేమో అనుకున్నాను.''

"ఇద్దరూ పోట్లాడుకుంటూంటారా?"

"ఆయన పోట్లాడరు. ఒక్కొక్కసారి ఆమె మండిపడుతుంది ఆయనమీద. ఆయన మౌనంగా తన గదిలోకి పోతారు."

"నువ్వు చెప్పింది నిజం కాకపోతే తర్వాత జైల్లో కూర్చోవాలి!" అన్నాను గంభీరంగా.

"అబద్ధం ఎందుకు చెప్తాను, సాబ్!"

బయటకు కదిలాను. కారులో కూర్చుని తలుపు మూశాను. కార్ని పోనిచ్చాను. రోడ్డుకు అటువైపున ఎవరో స్కూటర్ మీద నుంచి దిగి నిలబడ్డారు. కారు పోనిస్తూ రియర్ వ్యూ అద్దంలో చూస్తున్నాను. స్కూటర్ దిగినతను డ్రయివర్ ఇంటికి వెళ్తున్నాడు.

కార్ని ఆపాను. తాళం తీసేసి కిందకి దిగాను. గబ గబా రోడ్డువారగా వెనక్కి నడిచాను. డ్రయివర్ ఇంటి తలుపు మూసివుంది. రోడ్డుకి అటువైపున కొంచెం దూరంలో స్కూటర్ వుంది. అతను లోపలకి వెళ్ళి వుండాలి!

తలుపు దగ్గరగా నిలబడ్డాను. లోపలి మాటలు వినపడ్డంలేదు. తటాలున తలుపు తెరవబడింది. అతను బయటకు దూకి స్కూటర్ వైపు పరుగెత్తాడు. పరుగెత్తుకెళ్ళాను. స్కూటర్ స్టార్టయింది. అతని చెయ్యిని బలంగా పట్టుకొని లాగాను.

"మిస్టర్ ఏం కావాలి?" అరిచాడతను.

"నీతో మాట్లాడాలి!"

నేను అతని చెయ్యిని వదల్లేదు.

అతను స్కూటర్ని ఆపి కిందకి దూకాడు. పిస్టల్ని నా వైపు గురిపెట్టాడు.

"చేతులెత్తు!"

"ఎవరెత్తాలి?" అన్నాను పరిహాసంగా నవ్వుతూ.

అతను నా నవ్వుకు క్షణంపాటు నివ్వెరపోయాడు. అదే క్షణంలో బూటుకాలితో అతని చేతిలోని పిస్టల్ని తన్నాను. దూరంగా ఎగిరిపడింది. చేతి వెనకభాగంతో అతని చంపల్ని వాయించాను. అతను మూలుగుతూ నేల కూలిపోయాడు. పక్కనే నిలబడి బూట్‌తో అతని ముఖం మీద తన్నాను.

"రాస్కెల్, ఎవరు నువ్వు?" అర్చాను.

అతను మాట్లాడలేదు. అదేక్షణంలో డ్రయివర్ ఇంట్లోంచి అరుపులు వినపడ్డాయి. ఒక స్త్రీ గుమ్మంలో కొచ్చి బయటకు చూసి అరుస్తోంది. రోడ్డుదాటి ఆమె కేసి పరుగెత్తాను.

"ఏమైంది?" అడిగాను.

"నా భర్త ప్రమాదంలో వున్నాడు!"

లోపలకు వెళ్ళాను. పరుపుమీద డ్రయివర్ పడి దొర్లుతున్నాడు. అప్పుడే తెరిచిన బ్రాందీ బాటిల్ పక్కనుంది.

"ఈ బ్రాందీ అతను తాగాడా?"

"ఆ బ్రాందీతాగి పడిపోయాడు!" అందామె.

డ్రయివర్ గిజగిజ కొట్టుకొంటున్నాడు. కళ్ళు ఎర్ర పడ్డాయి. కాస్సేపట్లో అతనిలో చలనంలేదు. అతడిని పరీక్షించాను. డ్రయివర్ ప్రాణం పోయింది!

గబగబా బయటకు పరుగెత్తాను. స్కూటర్ మాయమైంది. అతను నా చేతుల్లోంచి జారిపోయాడు!

## 3

ఇంట్లోని దీపాలు వెలుగుతున్నాయి. డాక్టర్ సుధా

కర్ డ్రయివర్ శవాన్ని పరీక్షించి మా వద్ద కొచ్చాడు.

"యాట్రోఫైన్ పాయిజన్! బ్రాండీ బుడ్డీలో కలిపారు. అది తాగిన కాస్సేపట్లో అతను మరణించి వుండాలి!" అన్నాడు డాక్టర్.

"అతను నా కళ్ళముందే మరణించాడు!" అన్నాను.

సిగరెట్ పీలుస్తూ హతుడి భార్యవైపు చూశాను. ఆమె ఏడుస్తోంది. ఆమె దగ్గరగా వెళ్ళాను. ఇన్‌స్పెక్టర్ డోంగ్రే శవం ఫోటోలు తీయిస్తున్నాడు.

"ఇవాళ ఇక్కడికి వచ్చినతను ఇంతకుముందు ఎప్పుడేనా వచ్చాడా?"

"రెండు మూడు సార్లు వచ్చాడు" అందామె.

"అతని పేరు తెలుసా?"

"కబీర్!"

"అతను నీ భర్తకు ఏదేనా డబ్బిచ్చాడా?"

"క్రితంసారి రెండు వందలిచ్చాడు. ఇవాళ ఆ బాటిల్ తెచ్చాడు!"

అంతా క్లియర్‌గా తెలుస్తోంది. డ్రయివర్ని వాళ్ళు వలలో వేసుకున్నారు. డాక్టర్ రామన్ని అతను తీసుకెళ్ళి వాళ్ళకు అప్పగించి వుంటాడు. దేశంలో ద్రోహులు ఎప్పుడూ వుంటూనే వుంటారు! డబ్బుకోసం వాళ్ళు ఏదేనా చేస్తారు!

"అతను మళ్ళా ఇక్కడికి రావచ్చా!" అన్నాను.

"వాడొస్తే కాళ్ళు విరక్కొడతాను, సార్. తాగమని బ్రాండీబుడ్డీ ఇచ్చి నా పొట్ట కొట్టాడు — దుర్మార్గుడు!"

"వాళ్ళిద్దరూ మరేమి మాట్లాడారు?" అడిగాను.

"మీకేమీ చెప్పలేదని నా భర్త అన్నాడు. గుడ్, ఇది తాగి సుఖంగా పడుకోమని అతను బాటిల్

ఇచ్చాడు. ఎవరో తలుపు బయట కొడుతున్నారని అత నన్నాడు. తలుపుతీసి బయటకు పరుగెత్తాడు! నా భర్త బాటిల్ తెరిచి కొంచెం గ్లాసులో పోసుకుని, నీళ్లు కలిపి తాగారు! అతని స్థితిచూసి అరుస్తూ నేను బయట కొచ్చాను," అందామె.

"నీ పేరు?"

"మంజూ," అందామె.

డోంగ్రేతో కలిసి నా కారువద్దకు నడిచాను. కారులో కూర్చుని తలుపు మూశాను.

"మిస్టర్ డోంగ్రే, డాక్టర్ రామన్ కారు ఎక్కడో దొరుకుతుంది. అటుపైన మనం ఎటు వెళ్ళాలో చూడాలి!" అన్నాను.

కార్ను పోనిచ్చాను. టైమ్ రెండు దాటింది. మిస్ దేవత గుర్తుకొచ్చింది. ఆమె ఇంటి సమీపప్రాంతంలో కారాపి మూడుసార్లు హారన్ మ్రోగించాను.

ఆమె రాలేదు! ఆమె గాఢనిద్రలో వుండివుండాలి! కార్ను పోనిచ్చాను. నా హోటల్ కాంపౌండులో కారు ఆపి అలసటగా గదికి వెళ్ళాను. తలుపుమూసి ఫోమ్ బెడ్ మీద వాలాను.

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని ఎత్తి "హలో!" అన్నాను.

"శివస్వామి హియర్! మిస్టర్ పరశురామ్, డాక్టర్ రామన్ దొరికారా?"

"లేదు!" అన్నాను.

"బాడ్ లక్! ఆయనలేకుండా న్యూక్లియర్ టెస్టు సాగ లేదు! మనం భూగర్భంలో చేయబోయే టెస్టుకి ఆయన అత్యవసరం!"

"డాక్టర్ రామన్ని వాళ్ళు చంపరు! డాక్టర్ రామన్

ద్వారా ఏవో తెలుసుకోవాలనే వాళ్ళు ప్రయత్నిస్తూ వుంటారు. కాని రామన్‌కి దేశభక్తి ఎక్కువ! ఆయన ఏమీ చెప్పరని నా విశ్వాసం!'' అన్నాను.

''మిస్టర్ పరశురామ్, మనిషి బాధను భరించలేడు! ఆయన్ని అనేకవిధాల హింసించి మాట్లాడిస్తారు!''

''డోంట్ బాదర్!'' అని రిసీవర్ని పెట్టేశాను.

ఆలోచనల్లో బుర్ర వేడెక్కుతోంది. నిద్ర రావడం లేదు! గ్లాసులో విస్కీ పోసి, సోడాకలిపి ఐస్ క్యూబ్స్ పడేసి తాగుతూ సిగరెట్ వెలిగించాను. సగం పైన తాగేశాను. టెలిఫోన్ మ్రోగింది.

'హలో!'' అరిచాను.

''పాట్రోల్‌వాన్ సార్జంట్ కాంతారామ్ సార్!''

''ఏమైంది?''

''డాక్టర్ రామన్ గారు దొరికిండి!''

''ఎక్కడుంది?''

''మాతుంగలో, జోసఫ్ స్ట్రీట్ పెట్రోల్‌బంక్ సమీపంలో.''

''నేను వస్తున్నాను. ఇన్‌స్పెక్టర్ డోంగ్రేకికూడా ఫోన్ చేసిచెప్పు!''

''చెప్పాను, సార్!''

రిసీవర్ పెట్టేశాను. మరోగ్లాసుడు విస్కీ తాగి బయటకు పరుగెత్తాను. హోటల్ ముందువాళ్లో లైట్లుడిమ్‌గా వెలుగుతున్నాయి. మిస్‌క్వీన్ కౌంటర్ వెనకుంది. నన్ను చూసి కమ్మగానవ్వింది!

కారును శరవేగంగా పోనిచ్చాను. పెట్రోల్‌బంక్‌కి కొంచెందూరంలో పోలీస్‌వాన్, జీప్ కనిపించాయి. కారుఆపి దిగాను. ఇన్‌స్పెక్టర్ డోంగ్రే నవ్వుతూ నాకు ఎదురయ్యాడు.

"మిస్టర్ పరశురామ్, మీరుఅన్నట్టు కారుదొరికింది!"

డాక్టరు రామన్ కారుదగ్గర వెళ్ళాను. కారులో ఏమీ లేదు. కారుచుట్టూ వెతికాను. ఒక కింగ్ సైజ్ సిగరెట్ నేలమీద పడివుంది. సిగరెట్ మీద బాల్ పాయింట్ పెన్‌తో కొన్ని అంకెలు రాసి వున్నాయి. కారు హెడ్ లైట్ల కాంతిలో సిగరెట్‌ని పరీక్షించాను!

"డాక్టర్ రామన్ పారేసిన సిగరెట్ అయివుండాలి! సిగరెట్ మీద రాసినది తనను తీసుకెళ్ళిన కారు నెంబరు!" అన్నాను.

"ఆ నెంబరున్న కారు ఎవర్దో కనుక్కుంటే తెలిపోతుంది," అన్నాడు డోంగ్రే.

"మిస్టర్ డోంగ్రే, వాళ్ళు కారుకి నకిలీనంబర్ ప్లేట్‌ను ఉపయోగించి వుంటారు. అంత సులువుగా మనకి చిక్కరు," అన్నాను.

సిగరెట్‌ను జేబులో వేసుకున్నాను. కార్ను వేగంగా రామన్ ఇంటికి పోనిచ్చాను. ముందుహాల్లోని సోఫాలో శాంత పడుకొని వుంది. నన్ను చూసి లేచింది.

"డాక్టర్ రామన్ సిగరెట్లు కాలుస్తారా?"

"గోల్డ్ ఫ్లేక్ ఫిల్టర్ సిగరెట్లు కాలుస్తారు!" అందామె.

నా జేబులోవున్న సిగరెట్ గోల్డ్ ఫ్లేక్ కాదు! కారు ప్రాంతంలో ఇదెలా పడుంది? తప్పుమార్గాన్ని మమ్మల్ని పంపడంకోసం వాళ్ళుఏవో తప్పునంబర్లని రాసిపడేశారా?

సిగరెట్‌ను శాంతకు చూపించాను.

"ఇది డాక్టర్ రామన్ దస్తూరియేనా?"

"చెప్పలేను, గొలికినట్టుంది!"

"తొందరలో రాసి బయటకు విసిరుండాలి!" అన్నాను.

లోపలకు వెళ్ళాను. లైబ్రెరీగదిలో పచార్లు చేస్తూ నలువైపులా చూస్తున్నాను. కొన్ని కాగితాలమీద ఏవో

ఈక్వేషన్స్ వున్నాయి. బాల్ పాయింట్ పెన్ తో రాసినవి! అదే పెన్ తో సిగరెట్ మీద రాశారా! సిగరెట్ మీద రాసినది డాక్టర్ రామన్ అయివుండాలి!

ముందుగదిలోంచి టెలిఫోన్ మ్రోగడం వినిపించింది. గబగబా ముందుగదిలోకి వెళ్లాను. శాంత మాట్లాడుతోంది. ఇద్దరు ఆడాళ్ళు ఆమె ప్రక్కనే నిలబడి వున్నారు. ఆమె టెలిఫోన్ మాట్లాడ్డం ముగించి నాకేసి తిరిగింది.

"మిస్టర్ పరశురామ్ మీరు పరిశోధించవలసిన అవసరంలేదు. ఆయన నాకు ఫోన్ చేసారు. ముఖ్యమైన పని మీద ఎక్కడో వున్నారట. అది అవగానే ఇంటికి వస్తామన్నారు. మీరూ, పోలీసులూ ఆయనకోసం వెతకడం అనవసరమన్నారు!" అందామె.

పిస్టల్ అతనివైపు గురిపెట్టి అలా చెప్పించి వుంటారు.

"డాక్టర్ రామన్ ఎక్కడున్నారో చెప్పారా?"

"లేదు, క్షేమంగా వున్నానన్నారు."

ఆమెవైపు సూటిగా చూశాను.

"మిసెస్ శాంతా, ఆయన డ్రయివర్ చంపబడ్డాడు. ఆయనకారు మాతుంగాలో పోలీసులకి దొరికింది! మనం ఏదో చేస్తేగాని ఆయన తిరిగి రారేమో! విదేశాలకు ఆయన్ని వాళ్ళు తీసుకుపోవచ్చు!"

"భయంలేదని ఆయనంటున్నారు!" అందామె.

"మన్ని నిద్రపోగొట్టటానికి ఆయనచేత అలా వాళ్ళు చెప్పించారు!"

"ఏమో, గుడ్ నైట్!" అందామె.

బయటకు వెళ్లాను. శాంత వీధితలుపు మూసుకుంది. నేను కారుఎక్కి తలుపుమూశాను. సిగరెట్ పీలుస్తూ ఆలోచిస్తున్నాను. శాంత అంత అమాయకురాలు కాదు!

భర్త ఆమెతో మాట్లాడిందంతా ఆమె నాకు చెప్పి వుండదు! ఏదో దాస్తోంది!

కార్ను ఫర్లాంగుదూరం పోనిచ్చి, చీకట్లోఆపి దిగాను. వెనక్కి నడవసాగాను. శాంత ఇంటి ప్రాంతంలో నిల బడ్డాను. నేనున్నచోట బాగా చీకటిగా వుంది.

నిమిషాలు గడుస్తున్నాయి. అరగంట దాటింది. ఏదో స్కూటర్ ఇంటివైపు వస్తోంది. ఇంటిముందు ఆగింది. డ్రయివర్ ఇంటిముందు నాతో మాట్లాడినతను కిందకుదిగి నలువైపులాచూసి గుమ్మంకేసి వెళ్ళి తలుపును తట్టాడు.

తలుపు తెరవబడింది. అతను లోపలికి వెళ్లాడు. తలుపు మూయబడింది. స్కూటర్ దగ్గరకు పరుగెత్తాను. టైరలోని గాలిని పూర్తిగా తీసేశాను. అతను ఎక్కడకీ పారిపోలేడు! మెల్లగా గుమ్మం దగ్గరకు వెళ్ళాను. తలుపుకు చెవి ఆనించి వింటున్నాను. హాల్లో నుంచి వాళ్ళ కంఠాలు వినపడుతున్నాయి. కాని మాటలు స్పష్టంగా తెలియడం లేదు.

పది నిమిషాలైనా అతను బయటకు రాలేదు. ఇంత సేపు లోపల ఏం చేస్తున్నాడు? తలుపు తట్టాను. ఆమె తలుపు తెరిచింది. పిస్టల్ చేత్తో పట్టుకుని హాల్లోకి జొర బడ్డాను. అతనులేడు! శాంత ఒంటరిగా నిలబడి నాకేసి చూస్తోంది.

"మిస్టర్ పరశురామ్, డాక్టర్ రామన్‌కోసం మీరు వెతకడం అనవసరం అని చెప్పాను!" అందామె కోపంగా.

"ఈ ఇంట్లోకి వచ్చి నతనికోసం వెతుకుతున్నాను. ఎక్కడతను?"

"అతను వెళ్ళిపోయాడు!"

ఆమె దగ్గరగా వెళ్ళాను. గట్టిగా చెంపమీద కొట్టా లనిపించింది.

"అతనికి ఏమిటిచ్చారు?"

"నా భర్త ఫోన్‌లో చెప్పిన ఫైలు అతను పట్టు కెళ్లాడు."

"మిసెస్ రామన్, యూ ఆర్ ఫూల్! అతనికి ఫైలిచ్చి రహస్యంగా పంపడం మూలంగా మీరు దేశా నికి ద్రోహం చేశారు! మిమ్మల్ని అరెస్టుచేసి లాకప్‌లో వుంచాలి!" అరిచాను.

శాంత వులిక్కిపడింది. గుమ్మంలోంచి బయటకు చూశాను. స్కూటర్ అక్కడే వుంది. అతను స్కూటర్ని అక్కడే వదిలి పలాయనం చిత్తగించాడు. దేశానికి ముఖ్యమైన ఫైల్‌ను అతను పట్టుకుపోయాడు.

"అతను ఎలా వెళ్లాడు?"

"వెనుక గుమ్మంలోంచి, ప్రహరీ గోడదూకి ఠాకూర్ రోడ్డు చేరుకున్నాడు."

"అతడ్ని అలా ఎందుకు వెళ్ళనిచ్చారు?"

"మీరు అడ్డొస్తే ఫైలు నా భర్తకు తొందరగా అంద దన్నాడు. దానివలన నా భర్తకు ప్రమాదం వస్తుం దన్నాడు."

"మిసెస్ శాంతా, నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. ఒక గూఢచారుల ముఠా మీ భర్తను ఎత్తుకు పోయింది. మీ భర్తను బాధ పెట్టి ఏదో ఫోన్‌లో మీతో చెప్పమంటే ఆయన చెప్పొచ్చు. అదంతా మీరు నమ్మ కూడదు!"

శాంత ఏడుస్తూ కుర్చీలో కూలిపోయింది. దగ్గరగా వెళ్లాను.

"ఇక్కడకు వచ్చినతను ఏమన్నాడు?"

"రెండు మూడు రోజుల్లో నా భర్త వస్తారన్నారు. బెంగ లేకుండా నన్ను వుండమన్నాడు."

"అతను వెళ్ళి ఎంతసేపైంది?"

"చాలాసేపైంది!"

టేబుల్ మీదున్న టెలిఫోన్ రిసీవర్ ఎత్తి ఒక నంబర్ తిప్పాను.

"ఇన్‌స్పెక్టర్ డ్రాంగే స్పీకింగ్!"

"మిస్టర్ డ్రాంగే, శాంత ఇంటికి స్కూటర్ మనిషి వచ్చాడు. ఇక్కడ స్కూటర్ వదిలి వెళ్ళిపోయాడు. అది మీ స్వాధీనం చేసుకుని ఎవరో కనుక్కోవాలి!"

"అలాగే, మిస్టర్ పరశురామ్," అన్నాడతను.

"డూ ఇట్ ఫాస్ట్," అని రిసీవర్ పెట్టేశాను.

4

అతని చేతులు గొలుసులకు కట్టబడ్డాయి. అతను వేళ్ళాడుతున్నాడు. మెల్లిగా గొలుసులు కిందకి దిగాయి. పాదాలు ఐస్‌గడ్డల మీద ఆనుకున్నాయి. అతను పాదాలను పైకెత్తాడు.

ఎదురుగా నిలబడినతను అతని పాదాలను లాఠీతో కొట్టాడు. పాదాలు మళ్ళా ఐస్‌గడ్డలమీద నిలబడ్డాయి.

"డాక్టర్ రామన్, టెస్టు బ్లూప్రింట్స్ ఫైల్ తెప్పించాను. అన్ని వివరాలూ మాకు చెప్పు! నిన్ను వదిలేస్తాం," అన్నాడతను.

డాక్టర్ రామన్ అతనికేసి చూశాడు. పొడుగ్గా, లావుగా వున్నాడు. నల్లటి సూట్ ధరించాడు. ఎర్ర నెక్‌టై. గిరిజాల జుత్తు. గుబురుగా పెరిగిన మీసాలు. చివర్న మీసాలు కిందకి వంగాయి. స్ఫోటకం మచ్చల మొహం.

"నేను చెప్పను!" అన్నాడు రామన్ దీనంగా.

"చింత చచ్చినా పులుపు చావదు అన్నట్టుంది నువ్వు అనేది. నువ్వు మా చేతుల్లో వున్నావు. బ్రతికి బయట పడాలంటే మా కంతా చెప్పాలి." డాక్టర్ రామన్ బాధతో కళ్ళు మూసుకున్నాడు. ఐస్ మీదున్న పాదాలు తిమ్మిరెక్కి క్షీడిస్తున్నాయి.

"న్యూక్లియర్ టెస్టు ఎక్కడ చేయబోతున్నారు?"

"తెలియదు!"

"ఫ్లుటోనియమ్ మీ కెలా వచ్చింది?"

"తెలియదు!"

"భూగర్భంలో ఎంత లోతున మీరు న్యూక్లియర్ డివైస్‌ని పేలుస్తారు?"

"ఐ డోంట్ నో!"

"ఇంప్లోషన్ టెక్నిక్ నీకు బాగా తెలుసని విన్నాం!"

"రాంగ్ ఇన్‌ఫర్మేషన్. నేనున్నా, లేకపోయినా భారతదేశం తన పనిని సాగిస్తుంది. దేశం ఒక మనిషి మీద ఆధారపడకూడదు!"

"రష్యా ఎంతవరకూ సహాయపడ్తోంది?"

"తెలియదు!" విసుగ్గా అరిచాడు రామన్.

అతను కోపంగా రామన్ కేసి చూశాడు. గోలుసులు ఇంకా కిందకి దిగాయి. ఐస్ గడ్డలతో నిండిన బకెట్‌లో డాక్టర్ రామన్ చలికిలబడ్డాడు. పైకి ఎగురుతున్నాడు!

అతను దగ్గరగా వెళ్ళాడు. డాక్టర్ రామన్ చంపలు డప్పుల్లా మ్రోగాయి. నోటమ్మట రక్తం కార్తోంది.

"ఇప్పుడు చెప్తావా?"

"చెప్పను. నన్ను ఇలా బాధపెట్టడం దేనికి? తొందరగా చంపేయండి!" అరిచాడు రామన్.

"అఖర్కి అగతే పడ్తుంది నీకు!" అని అతను గబ

గబా వెళ్ళిపోయాడు.

ఒక యువతి అతనికి ఎదురైంది. అతను ఆగి ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"మిస్ లోలా, అతను రాంగ లేదు!" అన్నాడతను.

"మరి కొంత గడువిచ్చి చూద్దాం. రోజులు దొర్లుతూంటే మనిషిలో ఎదిరించే శక్తి క్షీణిస్తుంది," అంది లోలా.

"గుడ్ ఐడియా," అన్నాడతను.

* * *

పదకొండుగురు సైంటిస్టులు గదిలో సమిగూడారు. ఇన్‌స్పెక్టర్ డోంగ్రే, సేనూ, సి. బి. ఐ. డైరెక్టర్ శివస్వామి గదిలోవున్నారు. తలుపులు మూసివున్నాయి. అతి రహస్యంగా సమావేశమయ్యారు.

ఆటోమిక్ ఎనర్జీ కమిషన్ ఛైర్మన్ గుప్తా కుర్చీలోంచి లేచారు. నాల్గు వైపులా చూసి, మెల్లిగా ఇలా చెప్పసాగారు:

"మిస్టర్ పరశురామ్, విషాదమైన పరిస్థితుల్లో మనం ఇక్కడ కలుసుకుంటున్నాం. మనదేశం న్యూక్లియర్ పవర్ త్వరలో కాబోతున్నది. ఏ అడ్డంకులూ లేకుండా అంతా సవ్యంగా జరుగుతుందని అనుకున్నాను. మనదేశం న్యూక్లియర్ పవర్‌గా రూపొందడం చాలా దేశాలకు ఇష్టంలేదు. చైనా పక్కగా మనం క్షేమంగా వుండాలంటే న్యూక్లియర్ పవర్‌గా మనం అయితీరాలి! న్యూక్లియర్ ఆయుధాలను తయారుచేసి దగ్గర దేశాలకు సింహస్వప్నమవ్వాలనే వుద్దేశం మనకెన్నడూ లేదు. న్యూక్లియర్ శక్తిని శాంతియుతంగా దేశాభివృద్ధికి వుపయోగించాలని మన వుద్దేశం!"

డాక్టర్ గుప్తా ఆగారు. గ్లాసులోని ఐస్ వాటర్

కొద్దిగా తాగి నావైపు సూటిగా చూశారు.

"మిస్టర్ పరశురామ్, ఈ నెల 27వ తారీఖున టెస్టు సాగించాలని మేం అనుకున్నాం. డాక్టర్ రామన్ తిరిగి వస్తేగాని టెస్టు సాగదు! దేశానికి ఆయన అత్యవసరం! మీ శక్తిసామర్థ్యాలు నాకు తెలుసు. నిర్విరామంగా పాటుపడి డాక్టర్ రామన్‌ని ఎలాగైనా మీరు తీసుకు రావాలి!"

ఆయనకేసి చూస్తూ కూర్చున్నాను. ఏం జవాబివ్వాలా అని ఆలోచిస్తున్నాను.

"మేం అదే పనిలో వున్నాం," అన్నాడు శివస్వామి.

"డాక్టర్ రామన్ మనకు దొరుకుతారు," అన్నాను.

సైంటిస్టు గోష్టి లేచారు. ఆయన వయస్సు నలభై వుంటుంది. సన్నగా, పొడుగ్గా వున్నారు.

"డాక్టర్ రామన్ గారితో నేను కలిసి రీసెర్చ్ చేశాను. ఎవరున్నా, లేకపోయినా అనుకున్న ప్రకారం ఈ టెస్టు జరగాలి!" అన్నారు డాక్టర్ గోష్టి.

కుర్చీలోంచి లేచాను. అందరివైపూ క్షణకాలం చూశాను. "జెంటిల్‌మెన్, నాలో మీకు విశ్వాసమున్నందుకు కృతజ్ఞుడ్ని. టెస్టుకి ఇంకా పదిరోజులు వుంది. ఈ లోపల డాక్టర్ రామన్ మనమధ్య వుంటారని నా నమ్మకం."

"చీయర్స్ మిస్టర్ పరశురామ్!" అరిచారు అందరూ.

* * *

"అది దొంగిలించిన స్కూటర్. రామ్‌నారాయణ్ పోలీసు స్టేషన్‌లో పదిహేను రోజుల క్రితం తన స్కూటర్ పోయినట్టు రిపోర్ట్ ఇచ్చాడు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ డోంగ్రే.

"దొంగిలించిన స్కూటర్ మీద పట్నంలో అతను

మహా ధైర్యంగా తిరుగుతున్నాడు! పోలీసులు పట్టుకుంటా
రనే భయంలేదు!" అన్నాను.

"పోలీసుకి రిపోర్టిచ్చినా పాట్రోల్ వాన్స్‌లో తిరిగే వాళ్ళకి నంబర్ జ్ఞాపకముండదు!"

"రామ్‌నారాయన్ ఏం చేస్తున్నాడు?"

"స్కూటర్లు అద్దెలకిస్తూ వుంటాడు!"

"వాళ్ళకు అద్దెకిచ్చాడేమో!"

రామ్‌నారాయన్ అడ్రెస్ కనుక్కున్నాను. దుస్తులు మార్చుకుని, గదికి తాళంవేసి బయటకొచ్చాను. కారును పోనిచ్చాను. దాదర్ ప్రాంతంలోవున్న అతని షాపుకి కొంచెం దూరంగా కార్ను ఆపాను. అతని పేవ్‌మెంట్ కొట్టుకేసి నడిచాను.

అరడజన్ పాత స్కూటర్లు పేవ్‌మెంట్ మీద వున్నాయి. రామ్‌నారాయన్, ఒక కుర్రాడు అక్కడున్నారు. అతను మంచి డ్రెస్సులో వున్నాడు, కాని త్రాగుడికి అలవాటైన వాడవడం వలన బాగానే మాట్లాడుతున్నాడు.

"స్కూటర్ కావాలి!" అన్నాను.

"మీ అడ్రెస్!"

నేనుండే హోటల్ పేరు, నాగది నంబరు చెప్పాను

"రోజుకి 25 రూపాయలు సార్. రెండు వంద డిపాజిట్. మీరు 225 రూపాయలు నాకివ్వాలి!"

భయంగా అతని దగ్గరకు జరిగాను.

"నాకోసం పోలీసులు వెతుకుతున్నారు. ఎక్కడేనా స్కూటర్ని వదిలేసి నేను పారిపోవలసి రావచ్చు!"

"అదా సంగతి!" అని అతను నవ్వాడు.

రోడ్డువైపు చూశాను. జనం తొందరగా కదుల్తు

న్నారు.

"అలా అయితే రేట్లు వేరు! రోజుకి నూరు రూపాయలు! మీరు ఎక్కడయినా స్కూటర్ని వదిలేయవచ్చు! పోలీస్ కి రిపోర్టిచ్చి నేను వెనక్కి తెప్పించుకుంటాను. డిపాజిట్ అయిదు వందలు!" అన్నాడతను.

అతనివైపు సూటిగా చూశాను. నేను చూసిన స్కూటర్ నంబర్ చెప్పాను.

"దాన్ని నువ్వు ఎవరికి అద్దెకిచ్చావు?"

"అది మీకెందుకు?"

"అద్దెకిచ్చి ఎవరో దొంగిలించారని పోలీసుకి రిపోర్టిస్తున్నావు! దోషులతో నువ్వు సహకరిస్తున్నావు!"

"మీరెవరు సార్?"

"ఆ స్కూటర్ ఎవరికిచ్చావో చెప్పు!" గద్దించాను.

అతను ఒక పుస్తకం తెరిచి చూశాడు. అడ్రెస్ నాకు చూపించాడు. మిస్టర్ కబీర్, మార్వాడీ స్ట్రీట్, నంబర్ 12, మాతుంగా అని రాసివుంది! అతనివైపు కోపంగా చూశాను.

"ఇటుపైన అటువంటి వాళ్ళకు అద్దెకివ్వకు! అలా మళ్ళా జరిగితే జైల్లో వుంటావు!" అని నా కారు కేసి నడిచాను.

కారున్న మాతుంగాకి పోనిచ్చాను. మార్వాడీ స్ట్రీట్ లోని 12వ నంబరు ఇంటిముందు కారు ఆపిదిగాను. ఫాన్సీ షాపుంది. లోపలకు వెళ్ళాను. మేనేజర్ని కలుసుకున్నాను.

"కబీర్ అనే పేరుతో ఇక్కడ ఎవరూ లేరు, సార్. మా కంపెనీ పదేళ్ళనుంచి ఇక్కడుంటోంది!" అన్నాడతను.

పాపంతా చూసి బయటకు వెళ్ళాను. రామ్నారాయన్ కి అతను రాంగ్ అడ్రెస్ ఇచ్చివుండాలి!

## 5

విజిల్ వేస్తూ బాత్ రూంలోంచి గదిలోకొచ్చాను. మిస్ దేవత నావైపు ఆత్రంగా చూసింది.

"యూఆర్ వెరీ మేన్లీ!" అందామె.

గబగబా పాంటు, షర్టు ధరించాను. నెక్ టై బిగించాను. ఆమె పక్కనే సోఫాలో కూర్చున్నాను. ఫ్లోరసెంట్ ట్యూబ్ ప్రకాశిస్తోంది.

"హాట్ డ్రింక్స్!" అన్నాను.

ఆమె రెండు గ్లాసుల్లో విస్కీ పోసి, సోడాకలిపి ఐస్ ముక్కలు పడేసింది. ఆమె ఎర్రటి పెదవులను కొంటెగా కొరుకుతూ ముద్దొచ్చేటట్టు పెట్టింది. గ్లాసును అందుకున్నాను.

"మిస్టర్ పరశురామ్, నన్నిక్కడకు ఎందుకు తీసుకొచ్చారు? ఒంటరిగా కూర్చోడానికా!" అడిగిందామె.

"ఒంటరిగా లేవుగా!"

"మీరు బాత్ రూంలో విజిల్ వేస్తూ హాయిగా స్నానం చేసినంత సేపూ ఒంటరిగానే కూర్చున్నానుగా!"

"ఐయామ్ సారీ!" అన్నాను నవ్వుతూ.

మిస్ దేవతది తీగలాంటి శరీరం. పొడుక్కి సరిపడే దేహపుష్టి! స్కర్ట్, టైట్ బ్లౌస్ ధరించింది. కాళ్లు బంగారంకాడల్లా మెరుస్తున్నాయి.

"నీ ఫ్రెండ్ ఏమయ్యాడు?"

"అతడ్ని గురించి మర్చిపోయాను!"

"బాడ్ లక్ — ఫర్ హిమ్!"

"ఐ డోంట్ కేర్!" అందామె.

"యూ ఆర్ హార్ట్ లెస్!"

ఆమె కోపంగా లేచింది. గుమ్మంవైపు గబగబా వెళ్ళింది. విస్కీ తాగేసి ఆమెకేసి చూశాను. తలుపు తెరిచేముందు ఆమె నా కౌగిలిలో వుంది.

"నాకు హృదయం లేదు! నేను మీ కెందుకు లెండి!" అంది మిస్ దేవత.

"హృదయం లేదనలేదు. నీ ఫ్రెండ్ విషయంలో కఠినంగా వున్నావన్నాను!"

"మిస్టర్ పరశురామ్, మిమ్మల్ని చూసాక నాకు మరెవరిమీదా ఇన్‌ట్రెస్టు లేదు. అది తప్పయితే నన్ను శిక్షించండి!"

ఆమెను మెల్లగా తీసుకెళ్ళి సోఫాలో కూర్చోబెట్టాను. గ్లాసును ఆమెకు అందించాను.

"యూ స్వీట్ లవ్ - డ్రింకిట్!" అన్నాను.

ఆమె గడగడ తాగేసింది. గ్లాసులను మళ్ళా విస్కీ, సోడా, ఐస్ ముక్కలతో నింపాను. ఒళ్ళు వేడెక్కుతోంది. ఉషారుగా వుంది. టెలిఫోన్ మ్రోగింది.

రిసీవర్ ఎత్తి, "హలో. పరశురామ్ స్పీకింగ్!" అన్నాను.

"శివస్వామి స్పీకింగ్! డాక్టర్ గోపీని ఎత్తుకుపోడానికి ప్రయత్నం జరిగింది. మీరిచ్చిన సలహాలు ఉపయోగపడ్డాయి. మన మఫ్టీ సి.ఐ.డిలు ఒకతన్ని పట్టుకున్నారు. అతను మా ఆఫీసులో వున్నాడు," అన్నాడు శివస్వామి.

"ఐయామ్ కమింగ్!" అని రిసీవర్ పెట్టేశాను.

కోటు తొడుక్కొని మిస్ దేవత ముందుకు పరుగెత్తాను. "అర్జంట్ బిజినెస్!" అన్నాను.

"నన్ను ఇంటిదగ్గర దింపేస్తారా?"

"హాయిగా ఇక్కడ పడుకో! డ్రింక్! ఈట్! నేను పని అవగానే వచ్చేస్తాను!"

"ఒక్కత్తెనే వుండాలి!"

"డోంట్ బాదర్! నేనొచ్చాక ఇద్దరం అవుతాం!"

ఆమెను ముద్దెట్టుకొని బయటకు పరుగెత్తాను.

రిసెప్షన్ కౌంటరు ముందుకు వెళ్ళాను. మిస్ క్వీన్ నన్ను చూసి తీపిగా నవ్వింది. నాగదికి ఫోన్ చేయమని రిసీవర్ని అందుకున్నాను. ఆమె కనెక్షన్ ఇచ్చింది. మిస్ దేవతతో మాట్లాడి కారువైపు పరుగెత్తాను.

* * *

అతను గోడవారగా నిలబడి వున్నాడు. పాంటు, స్లాక్ ధరించాడు. గూండా రూపం! శివస్వామి, నేను అతని ఎదురుగా నిలబడ్డాం.

కథంతా శివస్వామి నాతో చెప్పాడు. డాక్టర్ గోపీ తన కారులో ఒంటరిగా వెళ్తున్నాడు. అతని కార్ను ఆపి, డాక్టర్ గోపీని మరోకార్లో తీసుకెళ్ళడానికి ఇతను యమప్రయత్నం చేసాడు. ఒక సి.ఐ.డి ఆఫీసర్ డాక్టర్ గోపీకార్ను వెంటాడుతున్నాడు. అతను రంగంలోకి దిగి ఇతడ్ని బంధించి లాక్కొచ్చాడు!

"డాక్టర్ గోపీని ఎక్కడకు తీసుకెళ్దామనుకున్నావు?" అడిగాను.

"నాకటువంటి ఉద్దేశం లేదు!" అన్నాడతను.

"డాక్టర్ రామన్ ఎక్కడున్నాడు?"

"నాకు తెలియదు!"

"హార్డ్ నట్ — మాట్లాడడు!" అన్నాడు శివస్వామి.

అతని దగ్గరగా వెళ్ళాను. కుడికాల్ను పట్టుకుని మెలిదిప్పాను. అతనిముఖంలో బాధ గోచరిస్తోంది. ఇంకా తిప్పాను. మోకాలు ప్రాంతంలో ఎముకలు పట్ పట్ మన్నాయి. అతను కెవ్వున అరిచాడు.

"మాట్లాడు!" అరిచాను.

"దేన్ని గురించి?"

"డాక్టర్ రామన్ ఎక్కడ?"

కాలు ఇంకా తిప్పుతున్నాను. అతనివైపే చూస్తు

న్నాను.

అతను బాధతో గట్టిగా మూల్గాడు.

టెలిఫోన్ మ్రోగింది. శివస్వామి మాట్లాడి నా కిచ్చాడు.

"హలో పరశురామ్!" అన్నాను.

"మిస్ క్వీన్ సార్. మీ గదిలో వున్న అమ్మాయిని ముగ్గురు మాస్క్‌డ్ మనుషులు ఎత్తుకు పోయారు. మేం ఎంత ప్రయత్నించినా వాళ్ళను ఆపలేకపోయాం!"

"నేను వస్తున్నాను."

రిసీవర్ పెట్టేశాను. నా గదిలో వుండడం వలన ఆమెకు ప్రమాదం సంభవించింది. పూర్ గర్ల్!

బయటకు పరుగెత్తాను. కారులో కూర్చున్నాను. శివస్వామి నా పక్క సీటులో కూర్చుని తలుపు మూశాడు. కార్ను శరవేగంగా పోనిస్తూ మిస్ దేవతను గురించి అతనికి చెప్పాను.

"ట్రాజిక్! వాళ్ళు దుర్మార్గులు. ఆమెను రేప్ చేసి ఎక్కడో వదిలేస్తారు!" అన్నాడతను.

"వాళ్ళు నా గదికి ఎందుకు వెళ్ళారు?" అన్నాను, సాలోచనగా.

హోటల్ కాంపౌండులో కారు ఆపాను. నేనూ, శివస్వామీ నా గది వద్దకు వెళ్ళాం. నడవలో మేనేజర్ ఫాక్స్, కొందరు హోటల్ పాట్రన్సు నిలబడి వున్నారు. గదిలోకి వెళ్ళాను. విస్కీ గ్లాసులు ముక్కలై నేలమీద పడున్నాయి. కుర్చీలు వెనక్కి పడ్డాయి. మిస్ దేవత వాళ్ళతో పోట్లాడి వుండాలి!

గది నలువైపులా తిరిగాను. హోటల్ మేనేజర్ ఫాక్స్ లోపల కొచ్చాడు.

"వాళ్లు ఎలా పోయారు?"

"పడిపైవు నుంచి! అక్కడ వాళ్ళ కారు రెడీగా వుంది. వాళ్ళను ఆపాలని నేను పరిగెత్తానిలోగా వాళ్ళా మనిషిని కార్లో కూర్చోబెట్టి తీసుకుపోయారు. మిస్టర్ పరశురామ్, మేం పోలీస్‌కి రిపోర్టు ఇవ్వాలి!"

"ఇవ్వండి!" అన్నాను.

పడిపైవు నున్న వరండా మీదకు వెళ్ళాను. హోటల్ కాంపౌండులో కొన్ని కార్లున్నాయి. నా గదిలోకి తిరిగివచ్చాను.

"వాళ్ళ కారునంబరు గుర్తుందా?"

"బ్లాక్ అంబాజిడర్," అని నంబర్ను మేనేజర్ చెప్పాడు.

శివస్వామి నా చెయ్యి పట్టుకున్నాడు.

"మిస్టర్ పరశురామ్, ఆఫీసుకి పోతాను. ప్రధాన మంత్రినుంచి ట్రంకాల్ రావచ్చు!" అన్నాడతను.

"గో ఆన్! అతడ్ని లాకప్‌లో వుంచండి! మెల్లగా మాట్లాడించుదాం," అన్నాను.

శివస్వామి వెళ్ళిపోయాను. హోటల్ మేనేజర్‌తో మాట్లాడి అతన్ని వెళ్ళమన్నాను. బజర్ నొక్కి గదిని క్లీన్ చెయ్యమని బాయ్‌తో చెప్పాను. కొత్త గ్లాసులు పట్టమన్నాను.

బాయ్ గదిని శుభ్రపరుస్తున్నాడు. విస్కీ తాగుతూ, సిగరెట్ పీలుస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాను. మిస్ దేవతను వాళ్ళు ఎంత కష్టపెడుతున్నారో!

టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి రిసీవర్ని అందుకున్నాను.

"హలో, పరశురామ్!" అన్నాను.

"మిస్టర్ పరశురామ్, అతడ్ని వాళ్ళు తీసుకుపోయారు!"

"ఎవరు?"

"వాళ్ళే! పోలీసుల్లా దుస్తులు ధరించి వచ్చారు. అతడ్ని లాకప్ లో వుంచుతామని చెప్పి తీసుకు పోయారు!" అన్నాడు శివస్వామి.

"గుడ్ గాడ్!" అన్నాను.

"వాళ్లు డేర్ డెవిల్స్!"

"తప్పకుండా డెవిల్సే!" అని చిరాగ్గా రిసీవర్ని పెట్టేశాను.

బాయ్ గది క్లీన్ చేసి వెళ్ళిపోయాడు. లోపలనుంచి తలుపుకున్న తాళం చెవిని తిప్పి ఫోమ్ బెడ్ మీద వాలాను. భోజనం చెయ్యలేదు. ఆకలి చచ్చిపోయింది. నిమిషాలు దొర్లిపోతున్నాయి. కాలం ఎవరి కోసమూ ఆగదు!

ఎవరో తలుపును తట్టారు. పిస్టల్ చేత్తో పట్టుకొని మెల్లిగా గుమ్మంవద్దకు వెళ్లాను. మళ్లా తట్టారు. ట్రిగ్గర్ మీద వేళ్ళుంచి తాళం చెవి తిప్పి తలుపు లాగాను.

తటాలున మిస్ దేవత లోపలకొచ్చి నన్ను కౌగిలించుకుంది. కళ్ళమ్మట నీళ్ళు కారుతున్నాయి. ఆమె ధరించిన దుస్తులు చిరిగాయి. ఆమె పెదిమలు వణుకుతున్నాయి.

తలుపుకు లోపల్నుంచి తాళం వేసి ఆమెను సోఫాలో పడుకోబెట్టాను. విస్కీ పోసి, కొద్దిగా ఐస్ వేసి ఆమెకిచ్చాను. ఆమె ఒక్క గుటకలో తాగేసి ఇంకా ఇమ్మంది. మళ్లా పోసి ఇచ్చాను. ఆమె వణకడం లేదు. నా వైపు సూటిగా చూసింది.

"దేవతా, నువ్వు! భయంలేదు!"

"వాళ్లు దుర్మార్గులు!" అందామె.

"నిన్ను ఏం చేశారు?"

"నన్ను కారులో కూర్చోబెట్టారు. ఒక చోట కారు

అన్నారు. ఫోన్ చేసి ఒకతను ఎవరితోనో మాట్లాడాడు. అతను తిరగొచ్చి కారెక్కాడు. వాళ్ళ మనిషి ఎవరో క్షేమంగా వెనక్కి వచ్చాడని చెప్పాడు. కారు కదిలింది. ఈ హోటల్ సమీపంలో కారు ఆపి వాళ్లు నన్ను పొమ్మన్నారు. దేవుడ్ని ప్రార్థిస్తూ ఇక్కడకు నడిచి వచ్చాను!'' అందామె.

ఫోన్ వద్దకు వెళ్లాను. మిస్ దేవత తిరిగొచ్చిందని హోటల్ మేనేజర్‌కీ, శివస్వామికీ చెప్పాను. శివస్వామి ఆశ్చర్యపడ్డాడు.

''మనిద్దర్నీ నా హోటల్కి రప్పించడం కోసం వాళ్లు దేవతను ఎత్తుకు పోయారు. వాళ్ళ మనిషి మీ ఆఫీసులోంచి బయట పడగానే ఆమెను వదిలేశారు!'' అన్నాను.

''యూ ఆర్ రైట్!''

రిసీవర్ పెట్టేసి ఆమె దగ్గరగా వెళ్ళి ఎర్రటి పెదిమ లను ముద్దాడాను.

''పద, డైనింగ్ హాలు కెళ్ళి భోజనం చేద్దాం!'' అన్నాను.

ఆమె బాత్‌రూమ్‌లోకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చింది. తన దుస్తులకేసి చూసుకుంది.

''ఎవరేనా చూస్తే నవ్వుతారు!''

''డోంట్ బాదర్! డిమ్‌లైట్స్! కాబ్రేడాన్స్! ఆ గోలలో వాటిని ఎవరూ అంతగా చూడరు,'' అన్నాను.

## 6

డాక్టర్ గుప్తా నావైపు తదేకంగా చూశారు. ఏర్ కండిషండ్ గదిలో ఆయనా, నేనూ మాత్రం వున్నాం.

''మిస్టర్ పరశురామ్, రేపు విమానంలో మేం వెళ్తున్నాం. నాతో నూటయాభై మంది వస్తున్నారు.

డాక్టర్ గోపీ మరికొంత రిసెర్చి చేసి ఈ నెల 21వ తారీఖున ఆ ప్రదేశానికి వస్తారు. సరిగ్గా 27న న్యూక్లియర్ డివైస్ పేల్చబడుతుంది!" అన్నారాయన.

గుప్తా గొప్ప సైంటిస్టు. భాభాకి ఒకప్పుడు కుడి భుజంగా వుండేవారు. ఆయన నాయకత్వంలో న్యూక్లియర్ టెస్టు చేసే స్థితికి మన దేశం రాగలిగింది.

"టెస్టు జరిగే ప్రదేశానికి ప్రాజెక్ట్ PND అని పేరు పెట్టాం. ప్లుటోనియమ్ న్యూక్లియర్ డివైస్! అక్కడకి నేను అంత ఉషారుగా వెళ్ళడం లేదు!"

"డాక్టర్ రామన్ మీతో లేకపోవడం వలన!"

"డాక్టర్ రామన్ జీనియస్. అమెరికా కెనాడాల్లో రిసెర్చి చేసి అక్కడ వుండిపోకుండా ఇండియాకి వచ్చారు. భారతదేశం న్యూక్లియర్ పవర్ కావాలని ఆయన తాపత్రయం! ఆయన మీతో వుంటే ధైర్యంగా వుంటుంది!"

"అవసరమైన సమయానికి ఆయన వస్తారేమో!"

"మిస్టర్ పరశురామ్, డాక్టర్ గోపీని సలక్షణంగా ప్రాజెక్ట్ PNDకి చేర్చే బాధ్యత మీది! ఆయన రాకపోతే మేం వెనక్కి తిరిగి రావాలి!"

"డాక్టర్ గోపీకి ఏ ప్రమాదం రాకుండా నేను చూస్తాను," హామీ ఇచ్చాను.

"విష్ యు గుడ్ లక్!"

"మీ టెస్టు ఫలిస్తుందని ఆశిస్తున్నాను," అని ఆయనకు నమస్కరించి బయటకొచ్చాను.

మెయిన్ హాల్లోవున్న టెలిఫోన్ వద్దకు వెళ్లాను. సి. బి. ఐ. డైరెక్టర్ శివస్వామితో మాట్లాడాను. డాక్టర్ గోపీ విషయంలో తీసుకోవల్సిన బందోబస్తును గురించి వివరంగా చెప్పాను.

"అలాగే చేద్దాం," అన్నాడు శివస్వామి.

ఫియట్ కారును వేగంగా పోనిచ్చాను. ఉడిపీ హోటల్ ముందు కారుఆపి దిగి లోపలకు వెళ్ళాను, వెస్టర్న్ స్టైల్ భోజనంతో విసుగెత్తింది. అరడజను ఇడ్లీ, రెండు దోశలు తిని కాఫీ తాగి బిల్లు చెల్లించి కారు ఎక్కాను.

ఎక్కడికి వెళ్ళాలి? లోకం అంతా తిరిగి మళ్ళా మొదటి మెట్టు మీదే నా పరిశోధన నిలబడిపోయి నట్టుంది!

## 7

గదిలోని ఫ్లోరసెంట్ లైట్ ప్రకాశవంతంగా వెలుగుతోంది. మిస్ దేవత ఎంత అందంగా వుందో వర్ణించలేను.

బాబ్డ్ హేర్ మెరుస్తోంది. ఒళ్ళు బంగారం పూత పెట్టినట్లు పచ్చగావుంది. బెల్ బాటమ్స్ స్లాక్ ధరించిందామె. గ్లాసుల్లో విస్కీ పోసింది. ఐస్ కలిపింది.

సోఫాలో కూర్చుని ఆమెను నావైపు లాక్కున్నాను. ఆమె గ్లాసును నాకిచ్చింది. కొంచెం తాగి గ్లాసును టీపాయిమీద పెట్టి ఆమె గ్లాసును తీసుకున్నాను. ఆమె పెదిమలను ఆ క్షణంలో నొక్కి ముద్దెట్టుకున్నాను.

ఆమె కిలకిల నవ్వింది. లేచి డాన్స్ చేస్తూ గ్లాసును అందుకుంది. టెలిఫోన్ మ్రోగింది. గ్లాసు పట్టుకుని ఫోన్ వద్దకు వెళ్ళాను. రిసీవర్ ఎత్తి "హలో, పరశురామ్!" అన్నాను.

"డాక్టర్ గోపి స్పీకింగ్! మీ కోసం ఎదురు చూస్తున్నాను. ఎనిమిదింటికి వస్తానన్నారు. అరగంట ఆలస్యమైంది!" అన్నాడు డాక్టర్ గోపీ.

"వస్తున్నాను!"

"మిస్టర్ పరశురామ్, నేను బయల్దేరుతున్నాను. నాతో కొందరు మఫ్టీ సి. ఐ. డీలు వస్తున్నారు. మీరు

డైరెక్టుగా విమానాశ్రయానికి రండి!"

"అయిదు నిమిషాలు ఆగండి!"

"ఐయామ్ సారీ!" అని ఆయన రిసీవర్ని పెట్టేశాడు.

రిసీవర్ పెట్టేసి గ్లాసులోని విస్కీని తాగేశాను. మిస్ దేవత సోఫామీద వెనక్కి వాలింది. ఆమెప్రక్కనే కూర్చున్నాను. ఆమె నాకేసి గాఢంగా చూసింది.

"నిద్రవస్తోందా?" అడిగాను.

ఆమె జవాబివ్వలేదు. కళ్లు మూసింది. కనురెప్పలు కదలడంలేదు. నిద్రపోతోంది.

జేబులో జంబో పిస్టల్ పదేసుకున్నాను. గబగబా బయటకెళ్ళి తలుపుమూసి తాళంవేశాను. హోటల్ మేనేజర్ గదిలోకి దూరాను. అతనితో మాట్లాడి కార్లో కూర్చుని శరవేగంగా పోనిచ్చాను.

డాక్టర్ గోపీ కారు విమానాశ్రయానికి వెళ్తూ వుంటుంది. దగ్గర తోవమ్మట కార్ను పోనిస్తున్నాను. మెయిన్ రోడ్డుకు తిప్పాను. దూరంలో రెండుకార్లు, నాలుగు స్కూటర్లు వెళ్తున్నాయి. యాక్సిలేటర్ని అదుక్కి తొక్కాను. స్పీడ్ హెచ్చింది. జెట్ ప్లేన్‌లా ఫియట్ దూసుకుపోతోంది!

స్కూటర్లను దాటి నా కారు డాక్టర్ గోపీ కారు వెనక పరుగెడుతోంది.

'వచ్చావురా!' అన్నట్లు డాక్టర్ గోపీ వెనుక అద్దం లోంచి నావైపు చూశాడు. డాక్టర్ గోపీ ముందు వెళ్తూన్న కార్ను మఫ్టీలోవున్న ఇన్‌స్పెక్టర్ డోంగ్రే నడుపుతున్నాడు.

రోడ్డు లైట్లు వెలుగుతున్నాయి. జనసంచారం లేని ప్రదేశంలో మా కార్లు వెళ్తున్నాయి. రోడ్డుకి ఇటూ అటూ రాళ్ళగుట్టలు!

అమాంతంగా ముందువెళ్తూన్న కారు సడెన్ బ్రేక్‌తో ఆగింది. డాక్టర్ గోపీ కూర్చున్నకారుబంపర్ ముందు కార్ను గుద్దుకొని ఆగింది. ఫియట్ కార్ను ఆపి కిందకి దూకాను. జంబో పిస్టల్ని చేతిలో వుంచుకున్నాను డాక్టర్ గోపీ కారును అందరం చుట్టేశాం!

ఇన్‌స్పెక్టర్ డోంగ్రే మావైపు పరుగెత్తుకొచ్చాడు.

"రోడ్డుమీద రాళ్ళు!" అన్నాడతను.

"మనందరం ప్రాణాలిచ్చి డాక్టర్ గోపీని కాపాడాలి! గెట్ రెడీ!" గంభీరంగా అరిచాను.

బోనెట్ ముందు నిలబడి ఇరువైపులా చూశాను. ఎడంవైపున్న రాళ్ళ గుట్టమీద కొందరి ఆకారాలు కనిపించాయి. జంబోపిస్టల్ ట్రిగర్ నొక్కాను. ఒకేసారి వాళ్ళవైపు ఇరవైగుళ్ళు దూసుకుపోయాయి. వాళ్ళు వెనక్కి పరుగెత్తారు!

"రాళ్ళగుట్టలు ఎక్కండి! షూట్ దెమ్!" అరిచాను.

డోంగ్రే, తదితరు గుట్టలమీదకు ఎక్కారు. డజను మంది మావైపు షూట్ చేశారు. కిందపడి దొర్లాను. ఒక రాయిపక్కనుంచి వాళ్ళకేసి షూట్ చేశాను. భయంకరంగా చప్పుడైంది. నలుగురు అరుస్తూ కిందపడ్డారు. తతిమ్మావాళ్ళు పారిపోసాగారు!

"రన్ అండ్ కాచ్ దెమ్!"

వాళ్ళవెనుక పరుగెత్తాం. ముగ్గురు దొరికారు. నలుగురు చేతులెత్తారు. ఒకతను ఎలా పారిపోయాడోగాని పత్తాలేడు!

"మిస్టర్ డోంగ్రే. డాక్టర్‌గోపీ ఒంటరిగా వున్నారు. నేను ఆయన్ని విమానాశ్రయానికి తీసుకువెళ్తాను! వీళ్ళను మీరు లాకప్‌లో వుంచండి!"

వెనక్కి పరుగెత్తాను. రాళ్ళగుట్ట మీదనుంచి కిందకి

చూశాను. డాక్టర్ గోపీ కారువద్దకు వెళ్ళాను. నిర్ఘాంత పోతూ నిలబడిపోయాను!

డాక్టర్ గోపీ కారులో లేరు! ఆయన ఏమయ్యారు? వాళ్ళలోంచి పారిపోయినతను ఇక్కడకొచ్చి ఆయన్ని తీసుకుపోయాడా? ఎదురుగా చూశాను. చాలాదూరంలో నా ముందు ఏదో కారుపోతోంది! ఆకారులో ఆయన వున్నారేమో!

ఫియట్ ని వేగంగా పోనిస్తున్నాను. నా కారులైట్లు ఆన్ చేయలేదు. హారన్ మ్రోగించడంలేదు. ముందు వెళ్తూన్న కారును దూరంగా వెంబడిస్తున్నాను.

విమానాశ్రయంకి వెళ్ళేరోడ్డు నుంచి ముందుకారు మరో వైపుకు తిరిగింది. అటువైపు తిప్పి కార్ను పోనిచ్చాను. జేబులోని పాకెట్ బైనాక్యులర్స్ ద్వారా ముందుకార్ను పరకాయించాను. డాక్టర్ గోపీ ముందు సీటుమీద వున్నారు!

డ్రయివర్ వీపుమాత్రం కనపడ్తోంది. బైనాక్యులర్స్ జేబులో పడేసి ముందుకార్ను అనుసరిస్తున్నాను. ఇంకా ఆ కారు ఎంత దూరం వెళ్తుంది?

రోడ్డుకిటూ అటూ పెద్ద మేడలున్నాయి. విశాలమైన కాంపౌండ్లు...! ముందుకారు ఎడం వైపున్న కాంపౌండులోకి ప్రవేశించింది. గేటుముందు కార్ను ఆపాను. ఎవ్వరూ కాపలాలేరు. కార్ను మొండి ధైర్యంతో లోపలకు పోనిచ్చి ఆపి క్రిందకి దూకాను. జంబో పిస్టల్ నా చేతిలో వజ్రాయుధంలా వుంది!

డాక్టర్ గోపీని ఓ యువకుడు చెయ్యి పట్టుకుని ఈడ్చుకుపోతున్నాడు. లేడిలా పరుగెత్తాను. వాళ్ళు వెనక్కి తిరిగారు.

“చేతులెత్తు!” అరిచాను యువకుడ్ని ఉద్దేశించి.

అతను డాక్టర్ గోప్పీ వెనక్కి జరిగాడు.

"మిస్టర్ పరశురామ్! నా కార్ను నువ్వు వెంటాడు తున్నావని నాకు తెలుసు! డాక్టర్ గోప్పీతో నిన్ను కూడా పట్టుకోవచ్చని వూరుకున్నాను. నా వైపు షూట్ చేస్తే మొదట చచ్చేవ్యక్తి డాక్టర్ గోప్పీ!" అన్నాడతను.

నా మెదడులో గంటలు మ్రోగుతున్నాయి! ఆకంఠం ఎక్కడో విన్నాను. వేషం మారినా కంఠం అదే! ఇంపాజిబుల్! భ్రమపడ్తున్నా నేమో! అది ఎలా సాధ్యం?

వెనుకనుంచి బూట్ల చప్పుడైంది. పది అడుగులు పక్కకి వెళ్ళాను. ఒకతను డాక్టర్ గోప్పీ నిలబడిన చోటుకు పరుగెత్తాడు.

"వాళ్ళు దొరికిపోయారు! నేను ఎలాగో రాగల్గాను!" అన్నాడతను.

"కాచ్ హిమ్!" అన్నాడు యువకుడు.

అతను నావైపు వస్తున్నాడు. అతను విజిల్ వేశాడు. ఇంట్లోంచి ఇరవైమంది ఆయుధాలతో బయటకొచ్చి వలయాకారంలో నా ముందు నిల్చున్నారు.

"నువ్వు పారిపోలేవు!" అర్చాడతను.

వికృతరూపం అతనిది! డాక్టర్ గోప్పీ యువకుడితో లోపలకు కదుల్తున్నాడు.

"దగ్గరకొస్తే చస్తారు!" అర్చాను.

అతను పరిహాసంగా నవ్వాడు.

"నలుగురు చచ్చినా ఫరవాలేదు, అతడ్ని పట్టుకోండి!"

పదిమంది నావైపు జరుగుతున్నారు. ట్రిగ్గర్ నొక్కాను. జంబోపిస్టల్ భయానకంగా ధ్వనించింది. పదిమంది కింద పడ్డారు. మళ్ళా ట్రిగ్గర్ నొక్కాను.

తతిమా వాళ్ళు నేలమీదపడి మూల్గుతున్నారు.

భవనంలోకి పరుగెత్తాను. పెద్దహాలు! డాక్టర్ గోపీ హాల్లో నిలబెట్టబడి వున్నాడు. అతనివైపు పరుగెత్తాను. ఎక్కడినుంచో మిషిన్‌గన్ ధన్‌ధన్ మ్రోగుతోంది. డాక్టర్ గోపీని పట్టుకుని ఒక స్థంభం వెనక్కి చేరుకున్నాను.

ఎదురుగా, గోడవారగా మిషిన్‌గన్ వుంది. అక్కడ వున్నాడా యువకుడు! మా ఇరువైపుల నుంచి గుళ్ళు దూసుకుపోతున్నాయి. రాతి స్థంభం మా ఇద్దరికీ శ్రీరామరక్ష అయింది.

జేబులోంచి మరో పిస్టల్ తీశాను. మిషన్‌గన్ వెనుకనున్న యువకునికేసి గురిపెట్టి రెండుసార్లు పేల్చాను. అతను అరుస్తూ కిందపడ్డాడు!

హాలులో నిశ్శబ్దంగా వుంది. వాయువేగంగా అతని వైపు పరుగెత్తాను. కుడిచేతిలోంచి రక్తం కారోంది. నేలమీద పడ్డంవలన అతని మీసాలు రాలి కిందపడ్డాయి. టోపీ దూరంగా పడి దొర్లుతోంది.

ఆశ్చర్యంతో ఆ మీసాన్ని చూస్తూ వుండిపోయాను! మిస్ దేవత!!

ఆమె పక్కనే వంగి కూర్చున్నాను. డాక్టర్ గోపీ నా దగ్గరకొచ్చాడు.

"మిస్టర్ పరశురామ్, ప్లేన్ టైమ్ అవుతోంది!" అన్నాడు గోపీ.

"డోంట్ బాదర్! స్పెషల్ ప్లేన్‌లో వెళ్ళొచ్చు! ఇక్కడెక్కడో ఫోన్ వుంటుంది. సి. బి. ఐ డైరెక్టర్ శివస్వామికి ఫోన్ చేసి యూనిఫాంతో సాయుధ పోలీసులతో ఇక్కడికి రమ్మనండి! జరిగినదంతా చెప్పండి," అరిచాను.

డాక్టర్ గోపి టెలిఫోన్ కోసం వెళ్లారు. నేలమీద పడున్న దేవతకేసి చూశాను. ఆమె నవ్వుతూ నా చెయ్యి పట్టుకుంది.

“ఆ గదిలోంచి ఎలా బయటపడ్డావు?”

“షూట్ చేసి లాక్ పగలగొట్టాను. బయట హోటల్ మేనేజర్ ఫాక్స్, ఇద్దరు నౌఖర్లు కాపలా వున్నారు. ఇద్దర్ని కాల్చిచంపి కారెక్కి దూసుకుపోయాను!” అందామె.

“డేర్ డెవిల్!” అన్నాను.

“ఏం లాభం! ఓడిపోయాను!” అందామె.

లేచాను. డాక్టర్ గోపి నా దగ్గరకొచ్చారు.

“ఆయన వస్తున్నారు!”

ఆమెను చూసుకోమని డాక్టర్ గోపితో చెప్పి ఆయనకు ఒక పిస్టల్ ఇచ్చాను. లోపలున్న గదులను సోదా చేయసాగాను. హాలు చివర్ని వున్న గదికి బయట తాళం వేసివుంది. పిస్టల్ తో షూట్ చేసి తాళాన్ని పగలగొట్టి లోపలకు వెళ్ళాను.

లైటు వెలుగుతోంది. నేలమీదున్న పరుపుమీద ఒకతను కూర్చుని వున్నాడు. నా వైపు విచిత్రంగా చూశాడతను! డాక్టర్ రామన్!

“ఐయామ్ పరశురామ్, డాక్టర్ రామన్!” అన్నాను.

ఆయన నవ్వుతూ లేచారు. డాక్టర్ రామన్ నీరసంగా వున్నారు.

“ఇవాళ స్పెషల్ ప్లేన్ లో మీరు ప్రాజక్ట్ PND కి వెళ్ళాలి. అందరూ ఇంతకు ముందే వెళ్ళారు!” అన్నాను.

“ఐయామ్ రెడీ! దేశంకోసం ఏం చేయాలన్నా నాకు కావల్సినంత బలం వస్తుంది,” అన్నారు డాక్టర్ రామన్.

డాక్టర్ రామన్ ఒక ఫైల్‌తో నా పక్కనడిచి హాల్లోకొచ్చారు. బయటనుంచి కార్లచప్పుడు వినపడింది. సి. బి. ఐ డైరెక్టర్ శివస్వామి నా వద్దకు గబగబా వచ్చాడు.

"మిస్టర్ పరశురామ్, ఇదంతా యుద్ధభూమిలా వుంది. చాలామంది గాయపడి మూలుగుతున్నారు!" అన్నాడతను.

"మిస్టర్ శివస్వామీ, ఈ భవనాన్ని సోదా చేయించండి. డాక్టర్ రామన్, డాక్టర్ గోపీలతో నేను విమానాశ్రయానికి వెళ్ళాలి!" అన్నాను.

డాక్టర్ శివస్వామి సంతోషంగా నాతో కరచాలనం చేశాడు. నేలమీదపడున్న దేవత వైపు ఆఖరిసారిగా చూశాను. ఆమెలో ప్రాణంలేదు! ముఖంమీద ఏదో నల్లటి పురుగువాలింది! గబగబా బయటకు నడిచాను. డాక్టర్లు ఇద్దరూ నా వెనకనే వస్తున్నారు.

సాయుధ పోలీసులు కాంపౌండులో బిజీగావున్నారు. డాక్టర్ రామన్, డాక్టర్ గోపీ ముందు సీటుమీద కూర్చున్నారు. ఫియట్ కార్ను గేటు అవతలకు పోనిచ్చి ఆపాను.

"డాక్టర్ రామన్, మీ ఇంటికి వెళ్ళాలా? బట్టలు తెచ్చుకోరూ?" అడిగాను.

ఆయన అమాయకంగా నవ్వారు.

"వెంటనే విమానాశ్రయానికి పదండి! బట్టలు మద్రాస్‌లో కొనుక్కోవచ్చు!" అన్నారు రామన్.

పదినిమిషాల్లో కారు విమానాశ్రయం చేరుకుంది.

ఇన్‌స్పెక్టర్ డోంగ్రే మా కారువద్దకు పరుగెత్తుకొచ్చాడు.

"డాక్టర్ గోపీ, మీ కారున్న ఇక్కడకు తీసుకొచ్చాను. అందులోని పెట్టెలు భద్రంగా ఏర్ లైన్స్ వారికి అప్ప గించాను!" అన్నాడు డోంగ్రే.

"మీట్ డాక్టర్ రామన్!" అన్నాను పరిచయం చేస్తూ.

డోంగ్రే కళ్ళు మెరుస్తున్నాయి.

"మిస్టర్ పరశురామ్, శివస్వామి గారు ఫోన్ లో నాకు అంతా చెప్పారు. నన్ను ఇక్కడకు డాక్టర్ గోపీ కారులో వెళ్ళి వుండమన్నారు!" అన్నాడు డోంగ్రే.

అందరం విమానాశ్రయంలోకి వెళ్ళాం. డాక్టర్ రామన్ నా చెయ్యిపట్టుకుని నా వైపు సూటిగా చూశారు.

"మిస్టర్ పరశురామ్! ఇదే విమానంలో మీరు మాతో ప్రాజెక్ట్ PND కి రావాలి? తోవలో మరే అడ్డంకులు వస్తాయో చెప్పలేం! టెస్టు అయిందాకా మీరూ మా యూనిట్ లో వుండాలి!" అన్నారు డాక్టర్ రామన్.

"ఫైన్ ఐడియా," అన్నారు డాక్టర్ గోపీ.

"ఐయామ్ కమింగ్!" అన్నాను వుషారుగా.

—: ఐ పో యిం ది :—




# రెండవ భాగము

క్రింద వున్నతను సిక్స్ సెల్స్ టార్చి వెలిగించాడు. ఎదురుగా వున్న బోటుపైన పడింది. పైనున్న వ్యక్తి గన్ పేల్చాడు. గుండు దూసుకువెళ్ళి మా గ్యాంగ్‌లో ఒకడికి తగిలింది.

"అమ్మో" అంటూ నొప్పికి తట్టుకోలేక బోటులోంచి సముద్రంలోకి దూకేశాడు అతను.

"వన్ డౌన్" అరచాడు పైనుంచి.

"కారీ ఆన్!" క్రిందనున్న రెండో డెవిల్ చెప్పాడు. ఈమారు క్రిందనున్న అతను పేల్చాడు. పైనున్న అతను టార్చి వేశాడు. మరో మనిషి చచ్చాడు. వాళ్ళవేపునుండి టార్చిలైటు వెలుగు మా బోటుమీద పడింది.

"సర్కిల్ ది బోట్" అన్నాడు.

నేను వీల్ పట్టుకుని గబగబ త్రిప్పాను.

బోటు గిరగిర తిరుగుతూ ముందుకు పోయింది. వాళ్లు

కాల్చిన గుండ్లు మా బోటుకు తగిలాయి.

నడిసముద్రంలో జరుగుతోంది సంకులసమరం.

పదిహేను నిముషాలసేపు తుపాకి గుండ్లు వర్షంలా కురిశాయి రెండువేపులనుండి. మా బోట్‌లో ఎవ్వరు చావలేదు. కానీ మా గ్యాంగ్‌లో చాలామంది నేల కూలారు. అందులో ఇద్దరు మాత్రం మిగిలినట్లున్నారని పైనున్న డెవిల్ చెప్పాడు.

అతనుకూడా దిగి క్రిందకొచ్చాడు.

యుద్ధం ఆగింది.

"అటునుంచి కాల్పులులేవు! కారణమేమిటి?" అడిగాను.

"అందరూ చచ్చారేమో?" అన్నాడు రెండో డెవిల్.

"లేదు! ఇంకా ఇద్దరన్నా ప్రాణాలతో వుండి వుంటారు. ఎవ్వరూ లేకుంటె ఈ విసురుగాలికి ఆ బోటు తీరంవైపు వెళ్ళిపోతూ వుండవలసింది. అది మెల్లిగా మన వైపుకే వస్తోంది. గమనించండి" అన్నాడు మొదటి డెవిల్.

నేను దృష్టిసారించి నిశితంగా చూశాను. అతను చెప్పింది నిజమే. బోటు ముందుకు వస్తోంది.

"మరి యుద్ధం ఎందుకాపినట్లు?" అర్థంగాక అడిగాను.

"మనం అందరూ చచ్చారనుకొని దగ్గరకు వెళ్ళే ప్రయత్నం చేస్తాం! బాగా దగ్గరకు వెళ్ళాక కాల్చి చంపాలని వాళ్ళ ప్లానయివుంటుంది" అన్నాడతను.

"అయితే ఏంచేద్దాం?"

"మనం మన దోవన వెళ్ళిపోదాం! వాళ్ళతో మన కవసరంలేదు. ఆ షిప్ లంగరు వేసుకుని మనకోసం వెయిట్ చేస్తూ వుంటుంది."

"మరి వాళ్ళొస్తే!"

"చంపేద్దాం!"

"ఆ వజ్రాలు మనకు అందిస్తారా?" అడిగాను.

"ఇవ్వరు! మామూలుగా సరుకుల మార్పిడీ ఎలా జరుగుతుందో నీకు తెలుసా?" అడిగాడు రెండో డెవిల్.

"మేము షిప్ కు దగ్గరగా బోట్ ను ఆపుతాం. టార్చిలైటు వెలిగిస్తూ ఆర్పుతూ వుంటాం. షిప్ లోవాళ్ళు దిగి లైఫ్ బోట్ లో సామాను తీసుకొచ్చి అందిస్తారు. మా బోట్లో పార్టీ చేస్తాం. సరుకులు మార్చుకున్నాక వాళ్ళు వెళ్ళిపోతారు" అన్నాను.

"పార్టీ చేసేందుకు మనదగ్గర మందుందా?"

"నేను ఒక డజను విస్కీ బాటిల్స్ తెచ్చాను," అన్నాను.

"గుడ్! బోటువాళ్ళకు పరిచయమైనదే గాబట్టి అనుమానించరు. నువ్వుకూడా వాళ్ళను నమ్మించవచ్చు."

"ఐవిల్ ట్రై" అన్నాను నేను.

బోటు ముందుకు సాగిపోతోంది.

నా దృష్టంతా వెనక వస్తున్న బోట్ పైనే వుంది. వాళ్లు గుండెలుతీసిన మొనగాళ్లు. ప్రాణాలతో నన్నూ, నా బోట్లోని వాళ్ళను సముద్రం దాటనిచ్చే రకంకాదు. నా వెంటవున్న డెవిల్స్ కూడా సామాన్యులుగారు. వాళ్ళ షూటింగ్ మెథడ్స్ వండర్ ఫుల్ గా వున్నాయి.

బోటు మెల్లగా షిప్ దగ్గరకు చేరుకుంటూంది.

ఒక డెవిల్ పైకెక్కి టార్చిలైటు వెలిగిస్తూ, ఆర్పుతూ, సిగ్నల్స్ ఇవ్వసాగాడు. నేను బోట్ ఆపాను. క్రిందున్న రెండో డెవిల్ మెషిన్ గన్ మాగజైన్ తెరచి నిండా తుపాకీ గుండ్లు కూరాడు. యుద్ధానికి మళ్ళీ సన్నద్ధమవుతున్నాడనుకున్నాను.

షిప్ లోంచి ముగ్గురు మనుషులు లాడర్ మీదుగా

లైఫ్ బోట్‌లోకి దిగడం మసకగా కనుపించింది. ఒకరి చేతిలో చిన్న హాండ్ కేస్ వుంది.

లైఫ్‌బోట్ ముందుకు కదలి మావైపు రాసాగింది.

పైనున్న డెవిల్ క్రిందకు దిగొచ్చి "వాళ్లు వస్తున్నారు" అన్నాడు.

"చూచాను!" చెప్పాను నేను.

"వాళ్లు వచ్చాకి స్తే మనం ఏమివ్వాలి?"

"బంగారం!"

"మనదగ్గర లేదు గాబట్టి, మనపైన వాళ్ళకు అనుమానం వస్తుంది. తిరిగి వెళ్ళేందుకు బహుశా వాళ్లు ప్రయత్నిస్తారు. అప్పుడు వాళ్ళను చంపక తప్పదు మనకు. షిప్‌లో వాళ్లు, వచ్చిన వాళ్ళ మనుషులు గంటలోగా తిరిగి రాకుంటే మనపైన కాల్పులు జరుపుతారు. కాబట్టి మనం వాళ్లు మన బోట్ ఎక్కిన వెంటనే బోట్ కదిలించి, షిప్‌కు దూరంగా వెనక్కు పోనివ్వాలి" అన్నాడు మొదటి డెవిల్.

"వెనక మా గ్యాంగ్ వాళ్ళబోటు వస్తూనే వుంది. వీళ్ళను తప్పించుకోవడంలో వాళ్ళచేతుల్లో పడతాం!" అన్నాను నేను భయంగా.

"తుపాకీ గుండ్లు కాల్చుకుంటూ మనం దారి ఏర్పరచుకోవాలి. నువ్వు భయపడకు. ధైర్యంగా వుండు" అన్నాడు రెండో డెవిల్.

నాకేం జవాబు చెప్పేందుకు తోచలేదు. వాళ్ళు చెప్పినట్లు చెయ్యడంకన్నా మరో మార్గం తోచలేదు కూడా.

లైఫ్ బోటు దగ్గరగావచ్చి మా బోటు ప్రక్కనే ఆగింది. నేను బోటుచివర కెళ్ళి నిలబడ్డాను.

"హల్లో మిస్టర్ రాజ్! హౌ డూ యూ డూ!"

అన్నాడు అందులోవున్న వ్యక్తి. అతన్ని నేను రెండు సార్లు చూశాను. అతని వెంట మరో అమ్మాయికూడా వుంది. ఆమె వెంట్రుకలు వెండిలా వున్నాయి. హాట్ పాంట్స్ వేసుకుంది. నిటెడ్ బనియన్ తొడుక్కుంది. అందులోంచి బ్రాసరీ, దానిలోపలి వక్షోజాలు స్ఫుటంగా కనుపిస్తున్నాయి.

"వెల్ కమ్! వెల్ కమ్! రండి" అంటూ ఆహ్వానించాను.

ముగ్గురూ మా బోటు ఎక్కారు.

ఆ అమ్మాయి బోటుకేసి చూసింది.

"సరుకు తెచ్చారా?" అడిగాను నవ్వుతూ.

"ఆఁ! ఆఁ! మీరొక్కరే వున్నారేం? మరెవ్వరూ రాలేదా?" అడిగాడతను.

"ఇద్దరు అనుచరులున్నారు. మా బోట్ను ఎక్సయిజ్ అధికారులు వెంట తరుముకొచ్చారు. వాళ్ళతో కాస్త యుద్ధం చేశాం. వాళ్ళబోటు ఇంకా అదుగో ఆ ప్రాంతాల్లోనే వుంది" చెప్పాను నేను.

అతను టార్చి వెలిగించాడు సముద్రంపైకి. కానీ బోటెక్కడో దూరంగా వుండటంతో సరిగ్గా కనుపించలేదు.

"మిస్టర్ రాజ్! మీట్ మై గర్ల్ ఫ్రెండ్ మిస్ డెల్లా!" ప్రక్కనున్న ఆ అమ్మాయిని పరిచయం చేశాడతను. ఆమె నాకు షేక్ హాండ్ ఇచ్చింది. సన్నటి వ్రేళ్ళు తగలగానే నా వొంట్లో కరెంటు పాసయింది!

"గ్లాడ్ టు మీట్ యూ!" అన్నాను.

ఆమెకూడా తన సంతోషాన్ని వ్యక్తపరిచింది.

అందరం కూర్చున్నాం. నా వెంటవున్న డెవిల్స్ కూడా వచ్చారు పార్టీలోకి. విస్కీ బాటిల్స్ నాలుగు తెచ్చి ఓపెన్ చేశాం. కేన్డ్ ఫుడ్ టిన్స్ ఓపెన్ చేసి

మధ్యలో పెట్టుకున్నాం.

"ఛీర్స్!" అంటూ అందరం గ్లాసులు తగిలించుకొని త్రాగడం ఆరంభించాం.

"మిస్టర్ రాజ్! డెల్లాకు ఇండియా చూడాలని కోరికగా వుంది. నేను మళ్ళీ పదిహేను రోజుల్లో ఇదే దోవన తిరిగివస్తాను. ఆలోగా అంతా చూపించి నా దగ్గరకు తిరిగి చేర్చాలి డెల్లాను. కెన్ యూ డూ దిస్ ఫర్ మీ!" అడిగాడతను.

"విత్ ప్లెజర్!" విస్కీ గొంతులో పోసుకుంటూ అన్నాను.

త్రాగడం పూర్తయింది.

వ్యాపారం ప్రారంభించారు.

"బంగారం తెచ్చారా?" అడిగాడతను.

"తెచ్చాం! మాకూ, ఎక్సైజ్ వాళ్ళకు జరిగిన యుద్ధంలో ఆ బ్రాండ్ కేస్ ఎక్కడో జారిపోయింది. మీ సరుకు ఇవ్వండి. డెల్లాతో బంగారం పంపిస్తాం!" అన్నాడు మొదటి డెవిల్.

"యస్! దటీజ్ కరెక్ట్. ఈ మారు అలా చెయ్యండి" అన్నాను నేను.

"ఇక్కడ్నుంచి వెళ్ళంగానే షిప్‌లో వున్న మా బాస్ అడుగుతాడు. బంగారం చూపించకుంటే ఒప్పుకోడు. సరుకు తిరిగి తీసుకెళ్ళిపోవలసిందే" అన్నాడతను.

"మేము ఉత్త చేతుల్తో తిరిగి వెళ్ళడం ఎలా? వజ్రాలకు మంచి ఆఫర్సుకూడా వున్నాయి. తీరం చేరగానే డెల్లాకు హాండ్ ఓవర్ చేస్తాను బిల్ట్ నన్ను నమ్ము" అన్నాను నేను.

"ఇది స్మగ్లింగ్ బిజినెస్. ఇందులో నమ్మకాలకు తావులేదు. అప్పులు పెట్టి వ్యాపారం చెయ్యడం మాకు

అసలు అలవాటు లేదు. డెల్లాను తిరిగి తీసుకొచ్చేప్పుడు బంగారు తెండి. నరుకు పట్టుకుపొండి. అంతకన్నా మరో మార్గం లేదు'' అన్నాడతను దృఢంగా, నిశ్చయించుకొని.

మొదటి డెవిల్ నాగుబాములా బుసకొట్టాడు. రెండో డెవిల్ చెయ్యి గన్ పైకి పోయింది. నేను ఇద్దర్నీ ఆగమన్నట్లు సంజ్ఞ చేశాను.

"ఓ. కే భాయ్! మేము శెలవు తీసుకుంటాం. డెల్లా! ఇండియా అంతా తృప్తిగా తిరిగి చూడు. పదిహేనో దినం వచ్చేసెయ్! సరేనా?'' అన్నాడతను.

"ఓ. కే'' అంది డెల్లా తల త్రిప్పుతూ.

అందమైన ఆడదాన్ని నమ్మి నా చేతుల్లో పెట్టగలిగాడు గానీ, వజ్రాలు మాత్రం ఇచ్చేందుకు ఒప్పుకోని అతని మన స్తత్వం నాకు వింతగా తోచింది. డెల్లాను వదిలేసి మిగిలిన ఇద్దరూ మా బోట్ లోంచి, వాళ్ళొచ్చిన లైఫ్ బోటులోకి మారేందుకు ప్రయత్నించేప్పుడు డెవిల్స్ ఇద్దరూ మెషిన్ గన్ లు మ్రోగించారు. గువ్వలా సముద్రంలోకి కూలిపోయారు. వాళ్ల చేతుల్లో వున్న బ్రాండ్ కేస్ కూడా సముద్రంపైన పడింది.

మొదట డెవిల్ లోనికి దూకాడు. అలలమీద తేలుతూ అది ముందుకు పోసాగింది. ఆ కేస్ ప్లాస్టిక్ ది కావడం వల్ల నీళ్ళపై తేలుతూవుంది. అతను ఈదుకుంటూ వెళ్ళి అరమైలు గజాల దూరంపోయిన ఆ పెట్టెను పట్టుకొని తెచ్చాడు.

"జీసెజ్ క్రెటెచరస్!'' అంది డెల్లా భయంతో నిలువెల్లా వొణికిపోతూ.

"నువ్వేం భయపడకు! నిన్ను సురక్షితంగా తిరిగి మీ వాళ్ళదగ్గరకు చేర్చే పూచీ నాది!'' అన్నాను.

(సశేషం)

## 30

భర్త పెదవులకి గులాబిరంగు వుండటంచూసి, అనుమానంగా అడిగింది భార్య.

అతడు తడబడ్తూ, "ఎ. ఎ. బ్బే. ఓ ఫ్రెండ్ తో హోటల్ కెళ్ళి క్రీమ్ బిస్కట్ తింటేనూ..."

"ఎవర్తా క్రీమ్ బిస్కెట్?" ఖఠినంగా అడిగింది అతని భార్య.

* * *

"అండర్ స్టాంద్?" అన్నాడొక విద్యార్థితో మాస్టారు.

వాడు తల ఊపాడు. తర్వాత క్వశ్చన్ వేస్తే జవాబు చెప్పలేకపోయాడు.

"అండర్ స్టాండ్ అంటే తల ఊపావు కదరా-అర్థమైందన్నట్లు. మరి జవాబిచ్చి చావవేం?" అన్నాడాయన విసుక్కుంటూ.

"ఏమోనండీ! మీరు క్రింద నుంచున్నావా? అని అడిగారనుకొని తల ఊపాను" అన్నాడా విద్యార్థి.

—యం. విద్యుల్లత, విశాఖపట్టణం.

## 31

భార్య:-ఏమండీ! మనమ్మాయికి పదేళ్ళని చెప్పారుట

పెళ్ళివారితో. బొత్తిగా అంత చంటిపిల్లను చేసుకోను అన్నాడట పెళ్ళికొడుకు. అయినా, అలా చెప్పడం ఏమన్నా బాగుందా మీకు?

భర్త:-ఏమో! నాకేం తెల్సు? ఆమధ్య నువ్వు పక్కింటావిడతో నీకు 20 ఏళ్లని చెబుతుంటే విని దానికి పదేళ్లయినా ఉండవా, అని అలా చెప్పానే!

* * *

ప్రియురాలు:- (టైపిస్టు ప్రియుడితో) డార్లింగ్! మన పెళ్లికి మా నాన్నగారు ఒప్పుకోవడం లేదు.

ప్రియుడు:-ఏం?

ప్రియురాలు:-నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటానని మా నాన్నకి పెట్టిన అప్లికేషన్‌లో అన్నీ తప్పులేనట! టైపుకూడ సరిగ్గా రాని అప్రాచ్యుడికి పిల్లనివ్వను అంటున్నాడు.

* * *

ఒక రోమియో, ఓ యువతి వెంటపడ్డాడు.

''ఏమండీ, మిమ్మల్ని గాఢంగా ప్రేమిస్తున్నాను. కాదంటే ఆత్మహత్య చేసుకుంటాను.''

''వద్దు! ఆ పనిమాత్రం చేయకండి!''

''ఐతే, ప్రేమిస్తున్నారా నన్ను?'' అడిగాడు రోమియో ఆశగా చూస్తూ.

''కాదు. మనిషిగా వెంటపడుతుంటేనే చికాగ్గా ఉంది. ఇంక దెయ్యమైతే అసలు భరించలేనని!'' అంది ఆ అమ్మాయి

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంట్" లో మొత్తం నాలుగు క్రైమ్ నవలలు ప్రచురించబడ్డాయి. నాలుగు నవలలూ మీ అభిమాన రచయితలు రాసినవే. వీటిలో మీకు అత్యుత్తమంగా తోచిన నవల పేరు ఒకటవ నెంబరు ప్రక్కన వ్రాయండి. తర్వాత వరుసక్రమంలో మీకు నచ్చిన మిగతా మూడు నవలల పేర్లు పూరించండి. పాఠకుల ఎన్నిక ప్రకారం అత్యుత్తమ నవల నిర్ణయించబడుతుంది.

పాఠకులు ఉత్తమ నవలగా ఎన్నుకొన్న ఆ నవలా రచయితకు రు. 116/- లు బహుమతి, నాలుగు నవలల ఎన్నికను సరైన వరుసక్రమంలో చెప్పగలిగిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10/- లు చొప్పున బహుమతి ఇవ్వబడుతుంది.

కూపన్

జులై '74 నెల "సప్లిమెంట్"లో మేము మెచ్చిన నవలలు వరుసగా ఇవి:

1 ..............................

2 ..............................

3 ..............................

4 ..............................

పై కూపను కొట్టివేతలు లేకుండా పూర్తి చేసి, యీ పేజి పూర్తిగా కత్తిరించి, యీ నెల 10వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి. మీ చిరునామా వెనుక ప్రక్కన వ్రాయటం మరచిపోవద్దు. ఫలితాలు వచ్చే నెల "అపరాధ పరిశోధన" మాసపత్రికలో ప్రచురించబడతాయి.

తాపీగా!

—ఎ. హెచ్. బాల, చోడవరం.

# 32

మాస్టారు ఓ విద్యార్థిని ఇలా అడిగాడు:

"శ్రీకృష్ణుడు పదహారువేలమంది భార్యల్ని ఎందుకు పెళ్ళి చేసుకున్నాడోయ్?"

"కట్నంకోసం సార్!" ఠకీమని చెప్పాడు విద్యార్థి.

*  *  *

ఇద్దరు చోరాగ్రేసరులు సినిమా చూసి బయటకు వచ్చారు.

మొదటి దొంగ:- సినిమా చూస్తున్నంతసేపు నువ్వా హీరోయిన్‌ను తినేసేలా చూసావు. ఆమెమీద మనసు పడిందా ఏం?

రెండవ దొంగ:-(నవ్వుతూ) అదేం కాదు. ఆ హీరోయిన్ మెళ్లోని హారం బంగారందా, నకిలీదా అని చూస్తున్నాను. అంతే!

*  *  *

"ఏమేవ్, దుర్యోధనుడు మా వంశంవాడేనటనే!" అని అన్నా డొకతను తన భార్యతో సంతోషంగా.

"అందుకే మీ అమ్మ బుద్ధులు, మీ బుద్ధులు ఒక్కలాగానే ఉన్నాయి," అంది వెంటనే అతని భార్య విసురుగా.

*  *  *

"ఫలాని మంత్రిగారి రెకమెండేషన్‌మీద ఉద్యోగంలో చేరినవారందరూ సీట్లు ఖాళీచేసి వెళ్ళిపొండయ్యా," అన్నాడు

జనరల్ మేనేజర్, ఆఫీసు ఉద్యోగులతో.

"ఏం?" అడిగారు ఆ మంత్రిగారి రికమెండేషన్‌తో వచ్చిన ఉద్యోగస్తులు.

"ఆ మంత్రి పార్టీనుండి బహిష్కరింపబడినాడు. క్రొత్త మంత్రిగారి అభ్యర్థులు వస్తున్నారు." అన్నాడు జనరల్ మేనేజర్ తాపీగా.

—ఎస్. రాజు, రుద్రంపూర్.

## 33

ఒంటరిగా బస్ స్టాండ్ దగ్గర నిల్చున్న ఒక అమ్మాయిని చూసి—

"ఒంటరిగా వచ్చిందంటే, జంటకోసమే ఐఉంటుంది!" అన్నాడొక బ్రూట్.

"అట్లన్నాడంటే, చెప్పుదెబ్బలకోసమే ఐఉంటుంది!!" అంటూ వంగి కాలిచెప్పు తీసుకొందా అమ్మాయి.

* * *

"మంత్రిగారు కారు ఆపి దిగి నాతో మాట్లాడారు." అన్నాడు రవి గర్వంగా.

"ఏం మాట్లాడారు?" కుతూహలంగా ప్రశ్నించాడు గోపాల్.

" 'ఇడియట్! కళ్లు కనపట్టంలా? కారుక్రింద పడి చావాలని ఉందా?' " అన్నారు.

* * *

"హలో! డాక్టర్ త్వరగా రండి. మా విజ్జీకి, కారుక్రింద పడి దెబ్బలు తగిలాయి. ప్లీజ్! త్వరగా రండి." అని ఫోన్ చేసింది రమ, డాక్టర్‌కి.

డాక్టర్ హడావుడిగా వచ్చి, "పేషంట్ ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

కాలికి దెబ్బతగిలి మూల్గుతున్న కుక్కపిల్లను చూపింది ఆమె.

డాక్టర్ విస్తుపోయాడు!

—ఏ. విజయలక్ష్మి, అలూరుపేట.



